The one and only Magazine devoted to Humour & Music

# హాసం

హాస్య-సంగీత పత్రిక

1-15 నవంబరు 2001

పేజీలు : 68 వెల : రూ.10



సెంటర్‌స్ప్రెడ్‌లో

నువ్వు నాకు నచ్చావ్!

స్నేహమంటే ఇదేరా

Friends forever

సినిమా పాటల పుస్తకాలు



# ఇవీ సంగతులు

## హాస్యం



## సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
నువ్వు నాకు నచ్చావ్
స్నేహమంటే ఇదేరా
సినిమా పాటలపుస్తకాలు
'సెంటర్ స్ప్రెడ్'లో

'హాసం' పాఠకు[illegible]
ప్రముఖ రచయిత సత్యానంద్
ప్రత్యేక రచన పై 'వేటు' మాష్టారు!
వచ్చే సంచికలో

గత సంచికలోని "ఇవీవీలా ఊహించండి చూద్దాం" క్విజ్ ఫలితాలు, జనార్దన మహర్షి కామెడీ కథపై పాఠకుల స్పందన, ఫలితాలు వచ్చే సంచికలో...

ముఖచిత్రం: నాగార్జున ('స్నేహమంటే ఇదేరా' చిత్రం నుండి)     కవర్ డిజైన్ :[illegible]

"హాసం" అనే హాస్య సంగీత పత్రికుందని, ప్రతి శీర్షిక, ప్రతి పేజీ లక్షల విలువని చదివాక కాని అర్థంకాలేదు. ఒక్క అక్షరం కూడా మిస్ కాకుండా చదివించే మీ మ్యాగజైను పది కాలాల పాటు ఇలాగే ఉండాలని, ఉంచుతారని ఆశిస్తూ, ఇక నుంచి ఇలాంటి మ్యాగజైన్‌ని కాంప్లిమెంటరీగా స్వీకంచడానికి సిగ్గు పడుతూ, జీవితాంతం పదిలంగా దాచు కోవడానికి, సంవత్సర చందాకంటే జీవిత చందా మేలని భావించి ఆ మొత్తం మీకు పంపిస్తున్నాను.

గమనిక :- ప్రింటింగ్ క్వాలిటీ బాగా లేక పోయినా పర్వాలేదు. కవర్ పేజీలు ఆర్భాటంగా లేక పోయినా పర్వాలేదు. మీ కలంలో సున్నితత్వం, సాహిత్యం చావకుండా చూడండి.

**పూరి జగన్నాథ్**
సినీ దర్శకుడు

ఒక పత్రిక మొదటి పేజీనుంచి చివరి పేజీ వరకూ ప్రతీ మిల్లీమీటరు పొడవునా రసాలూరించడం, ఆకట్టుకోవడం అరుదైన విషయం. హాస్య సంగీత సాహిత్యపు గుబాళింపులతో మీరు చేసినదిదే!

"అచలపతి" మరి కన్పించదేమో అనుకుంటున్న మా బోంట్లకు పెద్ద రిలీఫ్!

"అనగనగా ఆకాశంవుందీ..." పాట గురించీ, శ్రీశ్రీ "పదండి ముందుకు పదండి త్రోసుకు" నుంచీ, "పరుగులు తీయాలీ..." ద్వారా భజ గోవిందం గోవిందం భజ మూఢమతే" వరకూ... సారూప్యాలూ, గమనాలూ... ఓహ్ ఏం వ్రాసారండీ! (శ్రీ శ్రీ తన గేయగమనానికి ఆది శంకరుల శ్లోకం త్రోవ చూపించిందనీ ప్రకటించిన సంగతి తొలిసారిగా తెలుసుకున్నాను).

పాను గంటి వారి "సాక్షి"ని సరళీకరించడం ఎంత గొప్ప ఆలోచన!

మల్లీశ్వరీ గాన మాధుర్యాలలో- మంద్రంగా సాగే" మనసున మల్లెల మాల లూగెనే" గురించి...

"పల్లవి ఎక్కడా రిపీట్ కాక పోవడం - అస్సలు పల్లవే లేదూ, పదవిభజనం లేదు" అంటూ మీరు గుర్తు చేసిన విషయాలు - తట్టిలేపాయి. గొప్ప పత్రికలోని అతి గొప్ప శీర్షిక ఇదీ!

మనసున మల్లెల... పాటలో
"నీవు వచ్చేవని...
నీ పిలుపే వినీ"... తప్పేమో అని నా అభిప్రాయం.

"నీ పిలుపే వనీ"... అనివుంటే సరిపోయేదేమోనని నా అనుమానం.

జోకోదరులు బాపూ రమణల గురించి మాకు తెలియనివి (1. ఒకే ఇంటి వారవడం, 2. బాపూగారబ్బాయ్ పేరు రమణ, 3. రమణ గారబ్బాయి బాపూ గారి (తమ్ముడి) అల్లుడు లాంటివి) తెలియ జేసినందుకు ధన్యవాదాలు.

దయచేసి వీరి 'బంగారం - సింగారం' బొమ్మల సీరియల్ ప్రచురించరూ?

గురుదేవులకు గురువైన సంగమేశ్వరశాస్త్రి గారి గురించీ, అయిదు వందల ఏళ్ళ అల్లావుద్దీన్ ఖాన్‌ల సంస్మరణ అద్భుతంగా సాగింది.

విలక్షణ హాస్యనటులు శివరావు, మెహమూద్‌ల జీవిత ఘట్టాలు చక్కగా వివరించారు.

'కళ్ళల్లో రాగం'', 'సినారె - భళారె' సంగీత సాహిత్యాలకు దర్పణాలు.

చిరంజీవి చిరుహాసంతో వెలువడ్డ ఈ పత్రిక తెలుగు భాషలో చిరంజీవి కావాలనీ, టీవీ బారినపడ్డ తెలుగు వారి బతుకుల్లో చదివే అలవాటు మళ్ళీ నింపాలనీ, ప్రతి ఆంధ్రుడూ స్వంతంగా ఇలాంటి పత్రికలు కొనాలనీ ఆశిస్తూ

**- ఏ.కే. రావ్, విద్యానగర్ - 524 413**

**రాఘవయ్య గారి 'జ్యోతి' మాసపత్రిక తర్వాత ప్రతి పేజీ, ప్రతి పేరా చదివించగలిగిన పత్రిక 'హాసం' మాత్రమే! మధ్యలో ఒకటి రెండు పత్రికలు కొంతమేరకు ఉన్నా 'హాసం' పత్రికకు సాటి రావు. ఈ పత్రిక చిరకాలం కొనసాగడానికి అన్ని విధాలా తోడ్పడగలనని హామీ యిస్తూ**

**-డా॥ కె.జి. జయరామిరెడ్డి**
**కర్నూలు.**

మీపై దావా వేయాలను కుంటున్నా !
ఎందుకంటారా ...?!
మార్కెట్లో ఎడాపెడా వచ్చి పడుతున్న
షరా మామూలు... పత్రికల్లా కాకుండా...
మ్యూజిక్కన్నా... లాఫింగన్నా... పడిచచ్చేవాకు
దసరా డిస్కౌంట్‌లా...
ఒకటితో పాటు... ఇంకోటి 'జతి' కలిపి వదిలారు
పత్రికొచ్చిన రోజు...
నా అమూల్యమైన 24 గంటల కాలాన్ని
తినేసారు
మ్యాగజైన్ అందుకున్నప్పుడు
అట్ట పేజీనుండి... చిట్ట చివరి పేజీ వరకు
ఆమూలాగ్రం చదివించి.... పక్షం రోజుల
వరకూ నిరీక్షించేలా చేసారు...



ప్రథమ సంచికలో తుమరాడ సంగమేశ్వర శాస్త్రి గారి గురించి తనికెళ్ళ భరణి గారి వ్యాసం చదివి... గుండె వుప్పొంగితే... మలి సంచికలో ... ఆయన కొడుకు గురించి చిత్తరంజన్‌గారి లేఖ... గుండె చెమర్చేలా చేసింది.

'నాద వినోదము...' పాట ప్రస్తావనలో వేటూరి వారి పదార్ణవానికి... పాదాభివందనం చేయాలనిపించింది. ప్రతి శీర్షిక సంగీతాన్నో.. హాస్యాన్నో 'అంటు' పెట్టుకుని.. మనసును వెంట పట్టుకుపోతోంది. చాలా ఏళ్ళ తర్వాత వదలకుండా చదివించిన మీ పత్రిక మీద ఓ కథానిక వదలబోతున్నా.

ఈ హాసం... పాఠక దరహాసం
'ఖుషీ'తో నాస్తి దుర్భిక్షం

**త్యాగరాజు - ఎం**
యూసఫ్ గూడ బస్తీ-హైద్రాబాద్

హాసం
చదవాల్సింది కాదు
పఠించాల్సిందే !
హాసం
ఇంట్లో ఉండ దగ్గది కాదు
బీరువాలో ఉంచుకోదగ్గది !!
హాసం
నవరసాల పెనుభారం కాదు
హాస్య - సంగీత రసభరితం !!
హాసం
మూస మాస పత్రిక కాదు
పక్షం పక్షం ప్రత్యేక వ్యసనం !!!
హాసం
ఫ్రీగా చదవాల్సింది కాదు
కొనుక్కొని చదవాల్సిందే

**- దివాకర్ బాబు**
సినీ సంభాషణల రచయిత,
హైదరాబాద్

సంపుటి :1 సంచిక: 3

1-15 నవంబరు 2001

పేజీలు : 68 వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 3

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

“లోకో భిన్నరుచిః” అంటారు. ఆ రుచి ఏర్పడడానికి ఓ నేపథ్యం ఉంటుంది. అది పలురకాలుగా ఆ అభిరుచిని ప్రభావితం చేస్తుంది. అర్థిక పరిస్థితి, కుటుంబ వాతావరణం, పెరిగిన ప్రాంతం, చదివిన చదువు, సంస్కారం - ఇలా ఎన్ని కారణాలు చెప్పుకున్నా ఒకే ఇంట్లో పెరిగిన వ్యక్తుల మధ్య కూడా తేడా ఉంటూనే ఉంటుంది. చిన్నపిల్లలుగా ఉన్న దగ్గర్నుంచి ఇష్టాయిష్టాలు ఏర్పడడం చూస్తూ ఉంటాం.

ఎవరికి వారికే తమది మంచి అభిరుచి అనిపిస్తుంది. కారణం మంచి అభిరుచికి కొలమానం లేదు. కొన్నిటికి ముద్రలు వేసి వుంటాయి. 'ఫలానాది మంచి అభిరుచి', 'ఫలానా వారిది చౌకబారు టేస్టు' అని! ఈ అభిరుచి కూడా సర్వకాల సర్వావస్థలలోనూ ఒకేలా ఉంటుందన్న గ్యారంటీ లేదు. ఒకే వ్యక్తికి ఒక మూడ్‌లో శ్యామ్‌బెనగల్ సినిమా చూద్దామనిపించవచ్చు. మరో మూడ్‌లో విఠలాచార్య సినిమా చూద్దామని పించవచ్చు.

పదిమందీ మెచ్చేది అభిరుచి లేనిదనీ, చాలా తక్కువమంది మేధావులు ముద్ర వేసినది అభిరుచి ఉన్నదనీ చాలాసార్లు సూత్రీకరించడం జరుగుతూంటుంది. 'పదుగురాడు మాట పాడియై ధర చెల్లు' అన్న సూక్తి ఇక్కడ వర్తింపజేయరనుకోవాలి. మనస్సుకు ఆహ్లాదం కలిగించేదాని కంటే మేధకు పనిచెప్పేదే గొప్ప కళాసృష్టి అనే అభిప్రాయమే దీనికి మూలం కావచ్చు. మెజారిటీ జనుల అభిప్రాయంతో విభేదించినప్పుడే తమ మేధావితనానికి గుర్తింపు వస్తుందనే ఉద్దేశ్యంలో కొంతమంది దీనికి బహుళ ప్రచారం కూడా కల్పించి ఉంటారు. మరికొంత మంది కళాకారులు ప్రజలు తమను అర్థం చేసుకోవడంలో విఫలమయ్యారని వారి పట్ల జాలి చూపిస్తారు కానీ తామెందుకు ప్రజల వద్దకు చేరలేకపోయామని ఆత్మశోధన చేసుకోరు.

ఎవరు ఔనన్నా, ఎవరుకాదన్నా మెజారిటీ బలం మెజారిటీదే. రైల్లో ఎయిర్‌కండిషన్డ్ బోగీలు రెండుండాలంటే పన్నెండు మామూలు బోగీలుండాలి. ఎయిర్‌కండిషన్డ్ బోగీలతో మాత్రమే ఏ రైలూ నడపలేరు. సామాన్య ప్రజల ఆర్థిక స్థాయి, అభిరుచి, అందుబాటు ఇవన్నీ దృష్టిలో పెట్టుకునే మొత్తం రైలును కూర్చడం జరుగుతుంది. అప్పుడే ఆర్థికపరంగా కూడా తూకం సరిగ్గా కుదురుతుంది. బండి నాలుగుకాలల పాటు నడుస్తుంది.

“హాసం” పత్రికను రూపుదిద్దేటప్పుడు ఈ విషయాలన్నీ సాకల్యంగా చర్చించుకుని ఒక విధానాన్ని ఏర్పరుచుకోవడం జరిగింది. సామాన్య ప్రజలకు అందుబాటులో ఉన్న కళారూపాల ద్వారా వారికి చేరువై వారికి నచ్చిన విషయాన్ని చెబుతూనే, వారిలో ఆలోచనలు రేకెత్తించి ఏది మంచి, ఏది ఉన్నతం, ఏదికాదు అనే వివేచన అలవరుద్దామని మా లక్ష్యం. వ్యక్తిగత ఇష్టాయిష్టాలను పరిగణనలోకి తీసుకుంటూనే మేము నమ్మిన విలువలతో రాజీ పడకుండా పదిమందికి నచ్చేట్లా, పదిమందికీ అందేలా పత్రికను తయారుచేయాలన్నదే మా ఉద్దేశ్యం. మేధావుల చేత మాత్రం ఔననిపించుకోవడం గర్వకారణమే కానీ అదొక్కటే మా లక్ష్యసాధనకు సరిపోదు. సామాన్యులకు అందుబాటులో లేని కళ ఎంత ఉన్నతమైనదైనా సరే, సంకుచితమై, సమసిపోతుందన్న “జయభేరి” సినిమాలోని ఆత్రేయ డైలాగు మాకు మార్గదర్శకం. అదే సమయంలో వారిని మెప్పించడానికి స్థాయి దిగజారే ఉద్దేశ్యం మాకు ఎంత మాత్రం లేదు.

మేము మా లక్ష్యం దిశగా పయనిస్తున్నామా లేదా అని చెప్పవలసినది పాఠకులే!

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82



# హ...హా!

దివాకరబాబు

**నవ్వులో శివుడున్నాడురా.....**
**అన్నారు పెద్దలు...**
**శివుడంటే గుర్తొచ్చింది .......**

**స్థలం : కైలాసం**
**సమయం : ఒకప్పుడు**

ఓసారి శివుడ్ని ఉడికించాలని పార్వతి ఓరగా శివుడి వంక చూస్తూ.... "నాకు నాన్న వున్నాడు.... మీకు లేడుగా"...... అందిట! అప్పుడు శివుడు అరనవ్వు నవ్వి ..... "నాకు మామ ఉన్నాడు నీకు లేడుగా" అని చమత్కరించాట్ట.

ఇద్దరూ మంచల్లే హాయిగా నవ్వుకున్నార్ట. అలా

విష్ణులోకం
బ్రహ్మలోకం
ఒక టేమిటి అన్ని లోకాల్లో హాస్యం
ఓలలాడుతుండేదిట!

**స్థలం : కైలాసం**
**సంవత్సరం: 2001**

మంచు కొండల మీదనించి వీచే గాలి గిలిగింతలు పెడుతున్నా ఎవరూ నవ్వడం లేదు.

శివ పార్వతులతో సహా అంతా గంభీరంగా వున్నారు. అంతలో నారదుడు వడివడిగా నడుస్తూ హడావుడిగా వచ్చాడు...

"నారాయణ .....! పరమేశా! వున్న పాటున రమ్మన్నారట ఏమిటి విశేషం".

ఉపోద్ఘాతాలు లేకుండా సూటిగా పాయింట్‌కి వచ్చాడు శివుడు.

"నారదా కాసేపు నవ్వించవయ్యా"

'అదిరి పడ్డాడు' నారదుడు. నెత్తిమీద పిడుగు పడ్డట్టు ఫీలయ్యాడు. వినకూడని మాట విన్నట్టు ఫ్రీజ్ అయి పోయాడు... సరిగ్గా వినలేదేమోనని డౌట్ పడ్డాడు.... ఎందుకన్నా మంచిదని "స్వామీ నేను విన్నది...." అంటూ గొణిగాడు.

"నేను అన్నదే ...."

"ఇంకోసారి అనండి"

"కాసేపు నవ్వించవయ్యా"



చిడతలు కిందపడేసి నారదుడు రెండు చెవులూ మూసుకున్నాడు. "నారాయణ నారాయణ.... నవ్వించాలా... ఇదేం విపరీతమైన కోర్కె దేవా... మన దేవలోకాల్లో నవ్వు అన్నది దుర్భిణీ వేసి వెతికినా దొరకనిదై పోయింది కదా.... నవ్వు అన్నది కేవలం ఒక మాటగా మిగిలి పోయింది. ఎవరి పెదాల మీదా కనిపించనంత అపురూపమై పోయింది కదా దేవా! నవ్వడం మరచి పోయిన నేను మిమ్మల్ని ఎలా నవ్వించగలను ఆదిదేవా.... అశక్తుడ్ని.... నన్ను మన్నించు".

శివుడు నిరాశపడి తిరిగి గంభీర ముద్ర దాల్చాడు.

"నేను నవ్వించమంటే నవ్వించవా" అని శివుడు మూడో కన్ను తెరిచి భస్మం చేస్తాడేమోనని భయపడి అక్కడ్నించి జారుకున్నాడు నారదుడు. కింద పడిన చిడతలు తీసుకునిమరీ!

**స్థలం : బ్రహ్మలోకం**

రామేశ్వరం వెళ్ళినా శనేశ్వరం తప్పలేదు అన్నట్టు బ్రహ్మలోకం వెళ్ళినా నారదుడికి బాధ తప్పలేదు.

బ్రహ్మ కూడా నారదుడిని నవ్వించమని బ్రతిమాలాడు. మూడు తలలూ నవ్వక్కర లేదు, ఒక తల నవ్వినా చాలని రిక్వెస్టు చేసాడు.

ఇంకాసేపు అక్కడే వుంటే వీణ లాక్కుని వీపు మీద వాయించి పంపుతాడేమోనని భయపడి పారిపోయాడు.

**స్థలం : విష్ణులోకం**

పాల కడలిలో పడుతూ లేస్తూ 'పాహిమాం ... పాహిమాం" అంటూ నారదుడు వచ్చాడు.

శివుడు, బ్రహ్మ తనని నవ్వించమని ఏవిధంగా ఇబ్బంది పెట్టిందీ వివరించాడు. అంతా విన్న శ్రీ



దివాకరబాబు అనగానే కుందేటి కొమ్ము, ఎవ్వనిచే జనించు, పుటుక్కు జరజర డుబుక్కు మే వంటి నాటికలు, రసరాజ్యం నాటిక, చూడాలని వుంది, శుభలగ్నం, యమలీల, మావిచిగురు, రాజేంద్రుడు - గజేంద్రుడు వంటి హిట్ సినిమాలన్నీ ఒకదాని వెంబడి ఇంకొకటి గుర్తొచ్చేస్తాయి. డజను దాకా నాటక నాటికలు, ఇద్దరు పెళ్ళాల ముద్దుల పోలీస్, డబ్బెవరికి చేదు, మన్మధలీల - కామరాజుగోల నుంచి ఇద్దరు మిత్రులు, సర్దుకుపోదాం రండి వరకు సుమారు ఓ 85 సినిమాలు రచయతగా ఆయన అక్కౌంట్‌లో ఉన్నాయి. ముళ్ళపూడి, ఆత్రేయ ఆయన అభిమాన రచయితలు. ఆ విషయం ఈ కథ చదవగానే అర్థం అయిపోతుంది. ఈ కథపై పాఠకులు తమ అభిప్రాయాన్ని

**దివాకర్‌బాబు**
**'అక్షరాజ్యం'**
**బి-17, రోడ్ నెం. 7**
**ఫిలిమ్‌నగర్,**
**జూబ్లీహిల్స్, హైదరాబాదు**

అడ్రస్‌కే నేరుగా పంపవచ్చు. ఆయన మెప్పుపొందిన ఉత్తరాన్ని పంపిన వారికి 'హాసం' పత్రిక ఆరు నెలల పాటు ఉచితంగా పంపిస్తాం.

మహావిష్ణువు నవ్వలేదు!

అర్జంటుగా ముక్కోటి దేవతల జనరల్ బాడీ మీటింగ్ ఎరేంజ్ చేయించ మన్నాడు.

**స్థలం: దేవతల కమిటీ హాలు**

మూడు కోట్ల కిరీటాలతో సభ కిటకిట లాడిపోతోంది. ఎవరి నోట విన్నా ఒకటే మాట... 'నవ్వు'!

"నవ్వా?"
"అంటే ఏంటి?"
"నువ్వెప్పుడైనా నవ్వావా?"
"నవ్వంటే ఎలా వుంటుంది?"

తలో రకంగా అనుకుంటున్నారు...




పక్కవాళ్ళని అడుగుతున్నారు. "నవ్వంటే ఆయుధమా? లేక పోతే అమృతంలా తాగే పాయసమా?" అని పిల్లదేవుడికి ఒకడికి సందేహం వచ్చింది.

గతంలో నవ్వంటే తెలిసిన పెద్ద దేవుడు పిల్లదేవుడి మాట వినికూడా నవ్వలేక పోయాడు.

వక్తలు సుదీర్ఘ ప్రసంగాలు చేసారు.

మనకి ఎలాగైనా 'నవ్వు' కావాలని తీర్మానించారు.

"కావాలి సరే ఎక్కడ్నుంచి తేవాలి నవ్వుని' అని బ్రహ్మదేవుడు అడిగాడు.

అప్పటి దాకా బ్రహ్మదేవుడు 'నవ్వు'ని సృష్టిస్తాడన్న ఆశతో వున్న దేవుళ్ళు బ్రహ్మ అలా అడిగేసరికి డీలా పడిపోయారు.

అప్పటి వరకూ మౌనంగా వున్న యముడు లేచి నిలబడ్డాడు... వేదిక మీదికి వచ్చాడు.... గొంతు సవరించుకున్నాడు.... సభా సదులని నిశ్శబ్దంగా వుండమన్నాడు.... 'నవ్వుని దేవలోకం తీసుకొచ్చే 'చిట్కా' చెప్తా నన్నాడు..."

అందరూ ఆశ్చర్యంగా చూసారు.... చెవులు రిక్కించారు.

"మనకి నవ్వు కావాలంటే మనం హత్య చెయ్యాలి"

**'హత్యా !'**

మూడు కోట్ల కంఠాలు ఆశ్చర్యంతో ఆందోళనతో ఒక్కసారిగా అరిచాయి.........

**స్థలం : భూలోకం, యశోద హస్పిటల్**

**తేది : 19-06-2001**

బ్రహ్మ సృష్టించలేని నవ్వులని సృష్టించిన హాస్య బ్రహ్మ జంధ్యాలగారు... ప్రాణాలు కాపాడే ఆ దేవాలయంలోకి వచ్చారు. పాపం ఆయనకి తెలియదు హాస్యం కోసం దేవుళ్ళు అక్కడ కాపు కాసి వున్నారని.......

సాహితీ సంపదలతో పచ్చగా వున్న జంధ్యాల గారి మీద పాశం విసిరారు దేవుళ్ళు... ! అంతే,

నవ్వుల్ని పంచే అక్షయ పాత్ర పగిలిపోయింది. తెలుగువాడి దగ్గర్నించి నవ్వు చేజారి పోయింది. నవ్వుకి బోలెడంత దుఃఖం వచ్చింది.

**స్థలం : స్వర్గ లోకం**

**సమయం : 19-06-2001 నుంచీ**

చిరునవ్వుతో జంధ్యాల గారు దేవుళ్ళకి చెప్తున్నారు.

"నవ్వడం ఒక భోగం
నవ్వించడం ఒక యోగం
నవ్వలేక పోవడం ఒక రోగం.........."

మనుషుల్ని ఏడిపించి దేవుళ్ళు హాయిగా నవ్వుకుంటున్నారు....

**హ...... హో !**



అది సాలూరు సంస్థానం!

రాజావారు.. కిమ్మూరి లక్ష్మీనరసింహ సన్యాసిరాజు...

ఆయన రసికుడు..... సంగీత..... సాహిత్యాలంటే ప్రాణం...

ఓ సంజెవేళ ఆయనకి సంగీత సభ పెట్టించాలని కోరికయింది!

వెంటనే ఆజ్ఞా అయ్యింది!!

మాంచి సంగీత విద్వాంసుణ్ణి తీసుకురమ్మన్నారు!!

సంగీత విద్వాంసుడొచ్చాడు!....

కొంచె పొట్టిగా..... సన్నగా..... అర్భకంగా!..... అమాయకంగా!..... ఉన్నాడు.

తను పాడాలంటే... మృదంగం వాయించేవాళ్ళు కావాలి! ..

తనకి సమానంగా వాయించే వాళ్ళు కావాలి!....

మహారథి ఉండగానే చాలదని ..... దానికి సారథి కావొద్దూ!!

ఆయన పరిస్థితి గమనించిన రాజుగారు....

"మీరు పాడండీ!..... మృదంగం వాయించడానికి నేనున్నాగా" అన్నారు స్వయంగా!

రాజు తల్చుకుంటే దెబ్బలకి కొదవా?...

మృదంగం మీద దెబ్బ పడింది!!

# రాజునే మృదంగ విద్వాంసునిగా మలుచుకున్న మహా కళాకారుడు

# తనికెళ్ల భరణి

**పట్రాయని సీతారామశాస్త్రి గారు పొద్దం మొదలెట్టారు...**

**సాక్షాత్తూ తన గానానికి రాజావారి చేత మృదంగం కొట్టించుకుని**

**సభ చేత చప్పట్లు కొట్టించుకున్న వాగ్గేయకారుడు....**

**శ్రీ పట్రాయని సీతారామ శాస్త్రిగారు!!**

**ఆయనే సాలూరు చినగురువుగారు....**

సీతారామశాస్త్రిగారు తన తండ్రి గారి వద్ద సంగీతం నేర్చుకున్నారు.

ఆయన పేరు పట్రాయని నరసింహ శాస్త్రిగారు (ఈయనే సాలూరు పెదగురువు గారు....)

ఈ పట్రాయని అన్నపేరు రావడానికి కారణం.... సీతారామశాస్త్రిగారి పూర్వీకులు ఒకాయన చిన్న సైనిక బలగానికి అధిపతిగా పనిచేసి కీర్తి ప్రతిష్టలు సంపాయించుకున్నారు. ఆయన పేరు పట్రాయుడు. ఆ పేరు ఇంటిపేరుగా స్థిర పడిపోయింది!!

ఒకప్పుడు బరంపురం విద్యకి కేంద్రంగా ఉండేది. సంగీత సాహిత్యాలకు మంచి పోషణ ఉండేది.... అలాంటి వాతావరణంలో సీతారామశాస్త్రి గారు... తన పదహారో ఏటే పద్యాలూ... కీర్తనలూ రాయడం అలవాటు చేసుకున్నారు...

ఓ దేవాలయంలో ఏర్పాటుచేసిన సంగీత పోటీల్లో తొలి కచేరి చేసి స్వర్ణపతకం పొందిన ఘనులు శాస్త్రిగారు.

శాస్త్రిగారు సూక్ష్మాతి - సూక్ష్మమైన మూర్ఛనాది ధ్వనులు హార్మోనియంపై వాయించేవారు. అది హార్మోనియం అని తెలీనంత సున్నితంగా వాయించేవారు.

1936.... సీతారామశాస్త్రి గారు విజయనగరం సంగీత కళాశాలలో గాత్ర పండితులుగా నియమింపబడ్డారు. శాస్త్రి గారు సంప్రదాయ సంగీత వాది!... పరమభాగవతోత్తములు వాగ్గేయకారులూ అయిన త్యాగరాజాదుల మార్గాన్ని అవలంబించే సంగీతం మోక్షసాధనంగా భావించారు....

"భారతదేశాన్ని పరిపాలించడం కన్నా.... గాంధీమహాత్ముని ధీగరిమకన్నా... గురజాడ వారి కన్యాశుల్కం కన్నా.... కాళిదాసు కావ్యాలకన్నా.... తిరుపతి వెంకట కవుల వాఙ్మాధురి కన్నా... కామ మోహిత అయిన ప్రియురాలి పెదవికన్నా... త్యాగరాజస్వామి కీర్తనలు కన్నా పడతి అందించే కర్పూర విడెం కన్నా పువ్వుతేనె కన్నా మనసుకు హాయి కూర్చేది హరిభజనేనోయీ'' అని రాశారు....

అలాగే.... ఆనాటికే అధ్వాన్నస్థితికి చేరుతున్న సంగీతాన్ని వెక్కిరిస్తూ

**స్టేజి సంగీతమే శ్రేష్ఠమంచును నెంచి**
**పరవశత్వము చెందు సరసులార**

అరవనొక్కులే శాస్త్రమంచు
నెంచుచుదాని
భావమే ఎరుగని ప్రాజ్ఞులార

మహారాష్ట్ర గానంపు మహిమ
చూపెదనంచు
గళము గిర్గిరత్రిప్పు ఘటికులార
మూలనుండిన వీణ ముందరకున్
లాగి
తంత్రులను ద్రెంపు విద్వాంసులార!!

కాలగతి చేత, ప్రస్తుత కాలముందు
ఆంధ్ర సంగీతమింత
యధ్వాన్నమయ్యె
గాన శాస్త్రజ్ఞులార సుజ్ఞానులార
గాన శాస్త్రజ్ఞులార అజ్ఞానులార!!

చూసారా ఎంత దెబ్బ కొట్టారో!!
'శ్రీ రఘుకుల మందుబుద్ధి నీవూ'
అంటూ
'ఎందరో మగానుభావులూ' -

అంటూ
భాషని ఖూనీ చేసే వారికిది
చెంప పెట్టు....
ఇలాటి సాలూరి చినగురువుగారిని
నిష్ఠతో.... గురుబ్రహ్మ గురుర్విష్ణు గురుదేవో
మహేశ్వరా!...

అని కాళ్ళని కళ్లకద్దుకుంటూ.... మన అమర గాయకుడు

ఘంటసాలగారన్న మాటలు....

"మా తండ్రిగారు పోయిన తరువాత నా చదువు సంధ్యలు తిన్నగా జరుగలేదు. దృష్టి ఎప్పుడూ ఆటపాటల మీద ఉండేది. మా కుటుంబం అంతా మా మేనమామ ర్యాలి పిచ్చిరామయ్య గారి సంరక్షణ క్రిందికి వచ్చింది.

చివరి రోజులలో తండ్రిగారు చెప్పిన మాటలు ఎప్పుడూ తలపుకి వస్తూ ఉండేవి. ఏమైనా సరే సంగీత విద్య సాధించాలి అని నాలో నేను శపథం చేసుకుంటూ ఉండేవాణ్ణి. చుట్టుప్రక్కల నున్న చాలామంది సంగీత విద్వాంసులను ఆశ్రయించేను శిక్షణ కోసం. అయితే గురుకులవాస దీక్షకు నాటి నా బాల్య ప్రవృత్తి తట్టుకోలేక పోయింది. అంతటితో ఏ విధమైన విద్యాభ్యాసంగం లేక ఏదో కాలక్షేపం ధోరణిలో పడింది జీవితం. ఈ పరిస్థితులలో



ఒక సంగీత సమావేశంలో నేనూ, నా సంగీతం ఎంతో నవ్వుల పాలవడం జరిగింది. నాటి నుండి ఒకే వేదన ప్రారంభం అయింది. 'సంగీత విద్య సాధించాలి. తండ్రిగారి ఆత్మకు శాంతి కలిగించాలి. నన్ను అపహాస్యం చేసిన వారిని సంగీత విద్యలోనే ప్రతీకారం చేయాలి.' ఇదే నిరంతర ధ్యాస.

నాటికి ఆంధ్రదేశంలో ఏకైక సంగీత కళాశాల విజయనగరంలో మాత్రమే ఉంది. మహామహులు శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు, శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు గారు మొదలగు సుప్రసిద్ధ విజయనగర సంగీత విద్వాంసుల కీర్తి బాల్యం నుండి కూడా తెలియడం జరిగింది. సంగీత విద్య విజయనగర సంగీత కళాశాలలోనే సాధన చేయాలి. గత్యంతరం లేదు. విజయనగరం వెళ్లడానికి తగిన ప్రోత్సాహం యింట్లో లభించే ఆశలేక పోయింది.

ఇంట్లో ఎవరికీ తెలియకుండా చేతినున్న

## శ్రీ తనికెళ్ల భరణిగార్కి

'హాసం' పత్రికలో తుమరాడ సంగమేశ్వర శాస్త్రి గారిని గూర్చి మీ ఆర్టికల్ చదివాను. సినిమాలలో మీరు వేసే వేషాలు విలన్ గాని లేక ఏవో రౌడీ మొదలైన చీప్ వేషాలు కాబట్టి మా మనసులో అదే ముద్ర ఉంటుంది. కానీ మీ ఆర్టికల్ చదివాక మీలోని గుణగ్రహణ పారీణత స్పష్టమైనది. పండితునిగా నటించిన ఓ నటుడు ప్రేక్షకుల హృదయాలలో కాళిదాసు స్థానం సంపాదిస్తాడు స్వతహాగా తాను బడుద్దాయి అయినప్పటికి! ఉన్నతమైన పాత్రలు వేయకపోయినా ఔన్నత్యం కలిగి ఉంటారు మీ వంటివారు. మీ ఆర్టికల్ ద్వారా సంగమేశ్వర శాస్త్రిగారి గొప్పదనం విశ్వకవిని మెప్పించినదని చదివి గర్వించుతున్నాను. ఒక తెలుగు వాడిగా మీ వ్యాసం తుమరాడ వారి గొప్పతనాన్ని, మీ గొప్పతనాన్ని కూడా వెలువరించింది. మీలోని సాహిత్యాభిమానం, సంగీతాభిమానం, విశదమయ్యాయి. సంతోషం .

నల్లూరి బసవలింగం,
రిటైర్డ్ తెలుగు పండిట్, సంస్కృత పండిట్,
కన్నడ పండిట్,
పామర్రు - 521 157,
గాజులవారి వీధి, కృష్ణాజిల్లా.

బంగారు ఉంగరం విక్రయించి ఆ సొమ్ము పట్టుకొని విజయనగరం చేరుకొన్నాను. సరీగా ఆ సమయానికి సంగీత కాలేజీ వేసవి సెలవల మూలంగా మూయబడి ఉంది. అంతే కాకుండా నేను విజయనగరంలో నిలదొక్కుకుని కాలేజీలో సక్రమంగా ప్రవేశించడానికి కూడా ఎంతో ప్రతికూల వాతావరణం ఏర్పడింది.

ఇటువంటి నిరుత్సాహ పరిస్థితులలో శ్రీపట్రాయని సీతారామశాస్త్రిగారి దర్శనం చేసేను. శ్రీ శాస్త్రిగారు సంగీత కళాశాలలో గాత్ర పండితులుగా ఉన్నారు. శ్రీ శాస్త్రిగారిని ఆ ప్రాంతంలో అందరూ సాలూరు చిన గురువుగారనే వారు (వారి తండ్రిగారు పెద్ద గురువుగారు). వారు సాలూరు గ్రామంలో అంతకు పూర్వం చాలా కాలం నుంచి సంగీత పాఠశాల నెలకొల్పి ఎంతో మంది విద్యార్థులకు ఉచితంగా సంగీత విద్య ఉపదేశిస్తూ ఉండేవారు. శ్రీ శాస్త్రిగారు విజయనగర సంగీత కళాశాలలో ప్రవేశించి అప్పటికి కొద్దికాలమే అయింది.

శ్రీ శాస్త్రిగారు నాచేత పాడించి, నా గాత్రం విని ఎంతో ముగ్ధులయేరు. నన్నూ నా



గురువు పట్రాయని సీతారామశాస్త్రి పాదాల చెంత కూర్చున్న ఘంటసాల (కుడి నుంచి రెండవ వ్యక్తి)

పరిస్థితులని తెలుసుకున్నారు. సంగీత విద్య యెడల నాకు గల తీవ్రమైన ఆకాంక్షను అర్థం చేసుకొన్నారు. నన్ను సర్వ విధాలా ప్రోత్సహించి నాలో ధైర్యం కలిగించేరు. శ్రీ శాస్త్రిగారి గానం, వారి మూర్తిమంతం, సౌమ్యత నన్ను ప్రబలంగా ఆకర్షించేయి. 'గురువు' అన్న మాట శ్రీ శాస్త్రిగారి యెడలనే సార్థకమయిందనిపించింది. నాటి నుండే వారి సన్నిధిలో సంగీత సాధన ప్రారంభించేను."

నిజానికి గొప్ప గురువు దొరకడం గొప్ప గాదు.... ఎంచేతనంటే గొప్ప వాడైతేనే మనం ఆయన పంచన జేరతాం .... గొప్ప శిష్యుడు దొరకడమే గొప్ప. ఎందుకంటే... శిష్యుడి గొప్పదనం తర్వాత గానీ తెలియదు.

కానీ ఈ సందర్భంలో... గురువు సీతారామశాస్త్రి గారూ గొప్పే.... శిష్యుడు ఘంటసాలా గొప్పే!

ఇప్పుడు రాజాలూవేరు.... సంస్థానాలు లేవు... మహరాజా పోషకత్వమూ లేదు. కానీ పట్రాయని సీతారామశాస్త్రి వంటి కళాకారుల కీర్తి సౌరభాలు మాత్రం శాశ్వతంగా పరిమళిస్తూనే వుంటాయి.

(డాక్టర్ కుమారి సి.విజయలక్ష్మి గారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలూ సంగీత వాఙ్మయం' చదివి స్పందించి)

ఈ ఆర్టికల్‌పై మీ అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికే నేరుగా తెలియజేయండి.
ఆయన అడ్రస్సు:
తనికెళ్ల భరణి,
'సౌందర్య లహిరి' 8-3-678/6, ప్రగతినగర్
హైదరాబాద్ - 500 045.

ఈ పాటను వివరణాత్మకంగా కావాలని కోరినది : పులగం చిన్నారాయణ, ఫిలిం జర్నలిస్ట్, హైదరాబాద్




చిత్రం: ఆనందం, బ్యానర్: ఉషాకిరణ్,
నిర్మాత: సి.హెచ్. రామోజీరావు
దర్శకత్వం: శ్రీను వైట్ల, సంగీతం: దేవిశ్రీ ప్రసాద్
పాట రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి
గానం: పాట1. ప్రతాప్, పాట.2. చిత్ర

# ఎవరైనా ఎప్పుడైనా...



'ఆనందం' ఆకాష్, రేఖ

**పాట:1**

ఎవరైనా ఎప్పుడైనా
సరిగా గమనించారా
చలిచెర అసలెప్పుడు వదిలిందో
అణువణువు మురిసేలా
చిగురాశలు మెరిసేలా
తొలి శకునం ఎప్పుడు ఎదురైందో
చూస్తూనే ఎక్కడినుంచో చైత్రం కదిలొస్తుంది
పొగమంచును పొమ్మంటూ తరిమేస్తుంది
నేలంతా రంగులు తొడిగి సరికొత్తగా తోస్తుంది
తన రూపం తానే చూసి పులకిస్తుంది
ఋతువెప్పుడు మారిందో
బ్రతుకెప్పుడు విరిసిందో
మనసెప్పుడు తలపుల వనమయ్యిందో
ఓ ఓ ఓ
ఎవరైనా ఎప్పుడైనా
సరిగా గమనించారా
చలిచెర అసలెప్పుడు వదిలిందో
అణువణువు మురిసేలా
చిగురాశలు మెరిసేలా
తొలి శకునం ఎప్పుడు ఎదురైందో

**పాట 2.**

ఎవరైనా ఎప్పుడైనా
ఈ చిత్రం చూశారా
నడి రాతిరి తొలివేకువ రేఖ
నిదురించే రెప్పలపై
ఉదయాలను చిత్రించే
ఒక చల్లని మది పంపిన లేఖ
గగనాన్ని నేలని కలిపే
వీలుందని పించేలా
ఈ వింతల వంతెన
ఇంకా ఎక్కడి దాకా
చూసేందుకు అచ్చంగా
మన భాషే అనిపిస్తున్నా
అక్షరము అర్థం కాని
ఈ విధి రాత
ఎవ్వరికీ కనబడని
ఈ మమతల మధురిమతో
హృదయాలను కలిపే శుభలేఖ
ఓ... ఓ... ఓ... "ఎవరైనా"

సినిమాల్లో పాట ఎంతవరకు అవసరం...? అసలు నిజ జీవితంలో పాడుకుంటారా? అన్న ప్రశ్నలు సినిమా పుట్టిన దగ్గర్నుంచీ మన ముందుకు వస్తూనే ఉన్నాయి.

పాత పాటల నుండి కొత్త పాటల వరకు అన్నిరకాల పాటల యొక్క ప్రాధాన్యతా రోజు రోజుకీ పెరుగుతోందే తప్ప తరగటం లేదు. అంచేత ఆ వాదనని పక్కన పెట్టేస్తేనే రసాస్వాదన చేయగలం.

కథా గమనానికి తోడ్పడ్డానికి, పాత్రల మనోభావాలను ప్రతిఫలింపజేయడానికి సినిమాలో పాట పుట్టింది. డైలాగ్ ద్వారా గాని, ఎక్స్‌ప్రెషన్ ద్వారా గాని చెప్పలేనిది పాట ద్వారా చెప్పొచ్చు... ఆ విషయాన్ని తెలుసుకుని దానికి భావుకతని జోడించి అందంగా చెప్పగలిగినప్పుడే సినీగీత రచయితలోని ప్రతిభకు సార్థకత...

కారణాలు ఏవైతేనేం ఇటీవల అటువంటి అవకాశాలు కరువైపోతూ ఉండటంతో సామర్థ్యం గలిగిన వారి ప్రతిభ కూడా ప్రజలకు అందవలసిన రీతిలో అందకుండా పోతోంది. అందుకు భిన్నంగా అతి అరుదుగా పాట ప్రయోజనాన్ని స్పష్టీకరించే సంఘటన ఒకటి ఎదురైనప్పుడు స్పందించకుండా ఉండలేం.

ఇటీవల విడుదలైన 'ఆనందం' సినిమాలో 'ఎవరైనా ఎపుడైనా' అనే మకుట వాక్యంతో ఉన్న రెండు స్వరఖండికలలోని సాహిత్యాన్ని ఆసాంతం గమనిస్తే అది ఎంత నిజమో మీకే తెలుస్తుంది.

ఆకాష్ (హీరో) రేఖ (హీరోయిన్) పక్కపక్క ఇళ్ళలో ఉంటూ అనునిత్యం దెబ్బలాడుకుంటూ ఒకరిపట్ల ఒకరు ద్వేషం, జుగుప్సా భావాలను పెంచుకుంటారు. తండ్రికి ట్రాన్స్‌ఫర్ అవటంతో రేఖ మరో ఊరికి వెళ్ళిపోతుంది. అక్కడ వాళ్ళుండే ఇంట్లో అంతకు ముందు తనూరాయ్ (ఇంకో హీరోయిన్) కుటుంబం ఉండేది. సవతి తల్లి పెట్టే బాధలు భరించలేక ప్రేమించిన ప్రియుడి ఉత్తరం సకాలానికి చేరక పోవటంతో ఆమె ఆత్మ హత్య చేసుకుంటుంది. ఆ విషయం ఆ ప్రేమికుడి (వెంకట్)కి తెలిస్తే అతనికి ఏమవు తుందోనని తనూరాయ్ పేరిట రేఖ ఉత్తరాలు రాస్తూ వుంటుంది. ఆ ఉత్తరాలు ఆకాష్‌కి చేరుతుంటాయి. కారణం వెంకట్ ఈ ఆకాష్‌కి క్లోజ్‌ఫ్రెండ్. పెళ్ళి ఏర్పాట్లు చేసుకొని తనూరాయ్ దగ్గరికి వెళ్ళబోతున్న సమయంలో యాక్సిడెంట్‌కి గురై చనిపోతాడు. ఈ విషయం తెలిస్తే తనూరాయ్ బ్రతకదని తెలుసుకొని వెంకట్ పేరుతో ఆకాష్ ఉత్తరాలు రాస్తూ ఉంటాడు. అలా ఉత్తరాలు రాసుకున్న ఆకాష్, రేఖ ఎదుటి వారిలో గల మానవతా

దృక్పథాలను గుర్తించి ఒకరి పట్ల ఇంకొకరు గౌరవం పెంచుకొని దెబ్బలాటలు మరచిపోయి ప్రేమతో ఒకటవుతారు. ఇదీ కథ.

సవతి తల్లి బాధలతో సతమతమవుతున్న తనూరాయ్‌కి వెంకట్ ఇచ్చిన మనోధైర్యం, జీవితం పట్ల తిరిగి ఆశలు చిగురించటం ఇదీ మొదటి స్వరఖండిక నేపథ్యం.

ఫాల్గుణ మాసం దాటి చైత్రం వచ్చేసరికి మారిన ఋతువుకి చలి మెల్లగా తొలగి పోవటం, కొత్త చిగుళ్ళు తొడగటం, ఉగాదికి ప్రకృతిలో కొత్త శోభలు గోచరించటం మనం చూస్తూనే ఉన్నాం. వీటిని ప్రస్తుత సన్నివేశంతో ముడిపెట్టడం ఏ కవి అయినా చెయ్యగలడు. కాకపోతే చెప్పేవిధానంలో తేడా - తనదైన ముద్ర - అదే సీతారామ శాస్త్రి ప్రత్యేకత.

సవతి తల్లి పెట్టే బాధలనుంచి మనసు
విముక్తి పొందటం - చలిచెర వదలడం
వెంకట్‌తో పరిచయం - చూస్తూనే ఎక్కడి
నుంచో చైత్రం కదిలి రావటం
మనసులో పేరుకుపోయిన బాధల్ని పోగొట్టడం
పొగమంచును పోపొమ్మంటూ తరిమెయ్యటం
తనలో తనకి తెలియకుండా ప్రేమ పుట్టడం
నేలంతా రంగులు తొడిగి సరికొత్తగా తోచటం
ఆ భావనతో తన జీవితం పట్ల తనకే ఆశ
కలగటం - తన రూపం తానే చూసి పులకించి
పోవటం
ఇవన్నీ ఎప్పుడు ఎలా జరిగాయో తెలిసేలోగానే
మనసంతా ప్రేమతో నిండిపోవటం -
ఋతువెప్పుడు మారిందో బ్రతుకెప్పుడు
విరిసిందో మనసెప్పుడు తలపుల
వనమయ్యిందో!

ఇదిలా ఉండగా వెంకట్‌తో పరిచయం ఎలావుందిట... అణువణువూ మురిసేలా చిగురాశలు మెరిసేలా ఎదురైన తొలి శకునంలా ఉందిట.

ఇక రెండవ స్వరఖండిక...

చనిపోయిన సెకండ్ హీరో (వెంకట్) సెకండ్ హీరోయిన్ (తనూరాయ్) పేరిట ఆకాష్ (హీరో) రేఖ (హీరోయిన్)లు ఉత్తరాలు రాసుకుంటుంటే దర్శకుడు కథా పరంగా చెప్పాలనుకున్న భావనలకు భావుకతను జోడించి చెప్పాలి.

అందుకే - ఎవరైనా ఎపుడైనా ఈ చిత్రం చూశారా నడి రాతిరి తొలివేకువ రేఖ నిదురించేరెప్పలపై ఉదయాలను చిత్రించే ఒక చల్లని మది పంపిన లేఖ - అని అన్నారు.

కానీ ఇదొక విచిత్రబంధం - ఆ హీరో హీరోయిన్‌లు వ్యక్తిగతంగా ఎంతో దూరం పెంచుకున్నారు. అయినా ఇలా ఉత్తరాల బంధం ద్వారా దగ్గరయ్యారు.

అందుకే 'గగనాన్ని నేలని కలిపే వీలుందనిపించేలా...'

నిజానికి ఈ విచిత్ర బంధం ఎక్కడికి దారితీస్తుంది?

అందుకే 'ఈ వింతలవంతెన ఇంకా ఎక్కడిదాకా?'

ఇటువంటి సన్నివేశం జీవితంలో ఎదురైతే మనసుకు ఏదో గోచరిస్తూనే ఉంటుందిగాని విధి ఎలా మలుపు తిప్పుతుందో ఎవరూ ఊహించలేరు.

అందుకే - చూసేందుకు అచ్చంగా మన భాషే అనిపిస్తున్నా అక్షరము అర్థంకాని ఈ విధి రాత!?

ఇలా కథాగమనాన్ని, పాత్ర స్వరూప స్వభావాలని పోల్చుకుంటూ సీతారామశాస్త్రి రాసిన వర్ణనలతో పేర్చుకుంటూ చూడండి... తన ప్రతిభా వ్యుత్పత్తులను దృశ్య మాధ్యమం (విజువల్ మీడియా) ద్వారా ఎంత ఉన్నతంగా ఆయన ఆవిష్కరించి అందించగలిగాడో అర్థం అవుతుంది. అందుకే గత సంచికలోని 'ఇష్టపది' శీర్షికలో "చాలా కాలం తర్వాత ప్రతి అక్షరం కవితాత్మకంగా వెలిబుచ్చ గలిగిన ఒక పొయెటిక్ పీస్‌ని రాసే అవకాశం కలిగింది" అన్నారు సీతారామశాస్త్రి. ఆ తృప్తి భాషకు అందనిది!!

'లలితకళారాధనలో' అనే పాటలో - 'అవధిలేని ప్రతి అనుభూతికి ఆత్మానందమె పరమార్థం' అని సినారె అన్నట్టు ఇటువంటి ఆత్మానందం కలిగించే సంఘటనలు అరుదుగా జరుగుతూ ఉంటాయి కనుకనే ఇవాళ మనం ఈ పాట గురించి ఇంతగా చెప్పుకున్నాం. భవిష్యత్తులో మరింతగా చెప్పుకుంటారు కూడా.



మీ
ప ద
సం ప ద

## ఇది యస్పీ బాలసుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

1. మనవులుగా (పెళ్ళి చేసి చూడు... ఎవరో ఎవరో)
   (ఎ) మానవస్వభావంతో (బి) కొత్తరకముగా
   (సి) విన్నపములు (డి) స్వంతవారిగా భావించి
2. సద్దు ( పెళ్లిచేసి చూడు .... ఏడుకొండలవాడ)
   (ఎ) కోపం (బి) గొడవ (సి) అల్లరి (డి) చప్పుడు
3. చెర (ఆనందం ... ఎవరైనా ఎపుడైనా)
   (ఎ) కౌగిలి (బి)దగ్గరితనం (సి)నడిచేది (డి) జైలు
4. పులుగు (సంపూర్ణ రామాయణం: ఊరికే కొలను నీరు)
   (ఎ) పక్షి (బి) జంతువు (సి) పురుగు (డి) చేప
5. పూలచేరు (సంపూర్ణ రామాయణం.... ఊరికే కొలను నీరు)
   (ఎ) పువ్వులు చల్లిన దారి (బి) పువ్వుల రథం
   (సి) పూలహారము (డి) పుప్పొడి
6. మధురిమ (ఆనందం.... ఎవరైనా ఎప్పుడైనా)
   (ఎ) తేనె (బి) మద్యము (సి) తీపితనము (డి) ప్రావీణ్యత
7. రాయంచ (నువ్వు నాకు నచ్చావ్.... ఆ నీలి గగనాల)
   (ఎ) రాతిబొమ్మ (బి) మెట్టు (సి)రాత్రి తిరిగే పక్షి (డి) రాజహంస
8. జవరాలు (నువ్వు నాకు నచ్చావ్.... ఆకాశం దిగివచ్చి)
   (ఎ) యవ్వనవతి (బి) శక్తి కలిగినది (సి) వరమునిచ్చునది (డి) ప్రేమ కురిపించునది
9. వేకువ (స్నేహమంటే ఇదేరా.... స్నేహమంటే)
   (ఎ) మెలకువ బి) వేడి (సి) వెలుగు (డి) తెల్లవారే సమయం
10. అనాది (స్నేహమంటే ఇదేరా.... స్నేహమంటే)
   (ఎ) ఆదిలో లేనిది (బి) పాతకాలపుది (సి) తనదికానిది (డి) తల్లిదండ్రులు లేనిది

జవాబులు
1(ఎ) 2(డి) 3(బి) 4(సి)
5(ఎ) 6(ఎ) 7(డి) 8(ఎ)
9(డి) 10(బి)




## విలువైన నటన



ప్రముఖ జానపద చిత్ర నిర్మాత, దర్శకుడు శ్రీ బి.విఠలాచార్య మొట్ట మొదట తెలుగులో 'కన్యాదానం'అనే చిత్రం నిర్మించి దర్శకత్వం వహించారు. ఆ చిత్రంలో ఒక ముఖ్యపాత్రకు శ్రీ సి.యస్.ఆర్.ఆంజనేయులు గారిని కలిసి-

"మూడు రోజులు వేషం సార్! నేను అయిదు వేలు ఇచ్చుకుంటాను" అన్నారు.

కాని - సి.యస్.ఆర్ గారు "ఆ.... మూడ్రోజుల్లో వేషం ఎక్కడ పూర్తవుతుందీ? ముందు అంతా అలాగే అంటారు. ఆ తర్వాత అలాఅలా డేకించి ఏ పది రోజులో చేస్తారు. చాలామంది నిర్మాతల పద్ధతి అదే!" అని, "ఇన్ని రోజుల వర్కు అని ఎందుకుసార్? రోజుకి ఓ వెయ్యి రూపాయలనుకుందాం" అన్నారు.

విఠలాచార్యగారు అంగీకరించారు. ఆ పాత్ర షూటింగు వారు అనుకున్నట్టు మూడు రోజుల్లోనే ముగిసింది. ఆఖ్రరోజున శ్రీ సి.యస్.ఆర్ గారితో-

"అయ్యా! మీరు అడిగిన ప్రకారం -మీకు మూడు వేలే ఇవ్వాలి, కాని నేను ఆ పాత్రకు అనుకున్న మొత్తం అయిదు వేలూ ఇస్తాను." అని రొఖ్ఖం అయిదు వేలు షూటింగు పూర్తి అయిన వెంటనే ఇచ్చేశారు.

## నటనా పరీక్ష



అది 1953 సంవత్సరం

ఒక ఆకుపచ్చ మోరిస్ మైనర్ కారు వచ్చి, మదరాస్ కోడంబాకం హైరోడ్‌లోని ఓ ఇంటి ముందు గేటుకి కొంచెం దూరంగా ఆగింది. అందులోంచి ఓ స్ఫురద్రూపి దిగారు. ఆయన చేతిలో ఓ ఫైలు వుంది. మరో చేత్తో ఆయన పంచె కుచ్చెళ్ళు పట్టుకుని ఠీవిగా లోపలకు వచ్చారు. ఆయనలో తెలుగుదనం, తెలుగు అందం వుట్టిపడుతోంది.

ఆయన ఆ ఇంటిలోపల వున్న నిర్మాతను కలిసి

"మీరు పంపిన సంభాషణలు అన్నీ చదువుకు వచ్చాను. నా పద్ధతిలో మీకు వినిపిస్తాను. ఏమన్నా మార్పులూ చేర్పులూ చెబితే చేసుకుంటాను" అన్నారు ఆయన.

ఆ చిత్రం 'వద్దంటే డబ్బు', ఆ నటుడు యన్.టి.రామారావు,

చిత్రనిర్మాత హెచ్.ఎం.రెడ్డి.

ఇప్పుడు వారు లేరు. ఆ 113 నంబరు ఇల్లూ లేదు. ఆ నిర్మాణ సంస్థ 'రోహిణీ పిక్చర్స్' కూడా లేదు. ఆ కారు నెంబర్ ఎమ్.డి.ఓ. 1522. ఆ కారు మాత్రం ఇప్పుడు హైదరాబాద్ రామకృష్ణా స్టూడియోస్‌లో వుంది.

చాలా చిత్రాల తొలిరోజు షూటింగుకు శ్రీ రామారావుగారు ఆ కారులోనే వచ్చేవారు.



## ప్రేక్షకాభిప్రాయం

మదరాస్‌లోని జెమినీ సంస్థ పేరు గుర్తుండని ప్రేక్షకులు వుండరు. వారు నిర్మించిన చంద్రలేఖ, అపూర్వసహోదరులు, మంగమ్మ శపథం, అవ్వయ్యార్ మొదలైన చిత్రాలు ఈ నాటికీ తెలుగు ప్రేక్షకుల మనసుల్లో మెదలుతూ వుంటాయి.

ఆ సంస్థ అధిపతి యస్.యస్.వాసన్ గారికి ఒక అలవాటు వుండేది. చిత్రం పూర్తయిన తర్వాత, దాన్ని స్టూడియోలో సిబ్బంది అందరికీ చూపించేవారు. ఇది అందరూ చేసే పని కాని అయన మాత్రం చూసిన వారిని అందరినీ తమ తమ అభిప్రాయాలు, తోచిన సలహాలు నిర్మొహమాటంగా కాగితాల మీద రాసి ఓ డబ్బాలో వేయమనేవారు. ఆ చీటీల్లో వారి పేరు రాయనక్కరలేదు. అంచేత చిత్రం మీద నిర్మొహమాటమైన అభిప్రాయాలు సేకరించగలిగేవారు. అవి పరిశీలించిన తర్వాత, చిత్రంలో కొన్ని మార్పులూ చేర్పులూ చేసేవారు.

ఆ విధంగా 'అవ్వయ్యార్' చిత్రంలో పసిపాప నదిలో కొట్టుకుపోయే దృశ్యం కోసం మరికొన్ని షాట్లు షూట్ చేశారట!

## మాటే (అయినా) పాటే!



వేటూరి ఎక్కడ వుండేది, ఏ కంపెనీకి వెళ్ళేదీ, ఏ పాట రాసేది, ఇంట్లో కూడా తెలీదు. రెండు మూడు హోటళ్ళలో గదులుండేవి. రెండు మూడు చోట్ల రికార్డింగులు జరుగుతుండేవి.

ఓ అసిస్టెంట్ ఆయన దగ్గరకు వచ్చి- "బలే సిచ్యుయేషన్ - మీరే రాయాలి - ఎలాగైనా కాస్త సాయం పట్టండి. ఒకే ఒక పల్లవి రెండు చరణాలు చాలు" అని బతిమాలాడు.

"క్షమించాలి. నే రాయను - రాయలేను" అన్నారు వేటూరి చాలా వినయంగా.

"ఆ.... ఇదే పల్లవి సార్ - కరెక్ట్‌గా సూటయింది" అని పారిపోయాడు అసిస్టెంట్.

"నే పాటలు రాస్తానండీ అన్నప్పుడు ఎవ్వరూ మాట్లాడలేదు. ఇప్పుడు నేను మాట్లాడుతుంటే 'పాట' అంటున్నారు. - ఏమిటో ఈ (మా)లోకం!" అనుకున్నారు వేటూరి.




## నువ్వు-నేను



కుర్రకారు జోరుతో హుషారుగా విజయరథం మీద సాగుతోంది. 'నువ్వు - నేను' చిత్రం. ఈ చిత్రంలో ఏ పాటకా పాటే గొప్పగా వున్నాయనే చెప్పుకోవాలి. ఈ చిత్ర దర్శకుడు తేజకి మంచి మ్యూజిక్ టేస్ట్ వుంది. యూత్ నాడికి ఏది పడుతుందో ఈయనకి బాగా తెలుసు. ఫోక్ సాంగ్స్‌ని ప్రేక్షకులు మరచి పోతున్న సమయంలో తన ప్రతి సినిమాలోను ఓ ఫోక్ సాంగ్ పెడుతున్నారు తేజ. 'నువ్వు - నేను'లోని 'గాజువాక పిల్లా' ఫోక్ సాంగ్ చిన్న పిల్లల నోళ్ళలో కూడా నానుతోందంటే, ఆ పాటకెంత పాపులార్టీ వచ్చిందో అర్థం చేసుకోవచ్చు. ఈ పాటంటే తేజకి కూడా బాగా ఇష్టం. "ఈ పాటలో దిల్లు వుంది. డ్రిల్లు వుంది. అండర్ కరెంట్‌లో చిలిపి శృంగారం వుంది. మంచి ఊపుందీ పాటలో" అన్నారు తేజ.

## డాడీ



అల్లురామలింగయ్య గారికి, మెగాస్టార్‌కి ఉన్న అనుబంధం గురించి ఇవాళ కొత్తగా చెప్పనక్కర్లేదు. అల్లు రామలింగయ్య గారిలో ఒక మంచి నటుడే గాక సంగీతపరంగా స్పందించే రసహృదయం కూడా ఉందని ఆయన పాడిన పాటలు విన్నవారు ఒప్పుకుంటారు. అటువంటి అల్లు తన అల్లుడి సినిమాలోని పాట గురించి ఏం చెబుతారోనని ప్రశ్నించడం జరిగింది. వానా వానా పాట గురించి, గుమ్మాడి గుమ్మాడి పాట గురించో చెప్తారని ఊహించటం సహజం. కానీ ఆయన చెప్పింది వేరు. ఆ పాట ఏమిటో ఆయన మాటల్లోనే వినండి. "మందారం బుగ్గల్లోకి మచ్చెట్లొచ్చిందే సీక్రెట్టు చెవిలో చెప్పమ్మా పాట వినసొంపుగానే కాదు, చూడ చక్కగా కూడా వుంది. రోజూ ఆ పాట వింటున్నాను" అన్నారు చిత్ర సమర్పకులు అల్లు రామలింగయ్య.

## నువ్వు నాకు నచ్చావ్



రవికిశోర్ గారి సినిమాల్లోని పాటలు ఒక ప్రత్యేకమైన అభిరుచితో ఉంటాయి. ఇది ఎప్పటి నుంచో బుజువు అవుతున్న సత్యం. ఇటీవల ఆడియో పరంగా కూడా హిట్ అయిన 'నువ్వు నాకు నచ్చావ్' సినిమాలోని 'ఒక్కసారి చెప్పలేవా నువ్వు నచ్చావని' పాట తనకెక్కువ నచ్చిన పాటగా చెప్పారు రవికిశోర్. "పెద్ద హీరోతో చేశాం. పాటలో మొత్తం భావం అంతా పలకాలి. అందుకు తగ్గ మూమెంట్స్ సెట్ కావాలి. వాటిన్నిటినీ బాలెన్స్ చేసే విధంగా పెర్ఫెక్ట్ ట్యూన్ ఇచ్చాడు కోటి. పెర్ఫెక్ట్ ట్యూన్‌కి పెర్ఫెక్ట్ లిరిక్ అన్నట్టు సీతారామశాస్త్రి రాశారు. ఈ పాటకి ఆయన 65 రకాల పల్లవులు ఇచ్చారు. ఇక చరణాలయితే అలా ఇస్తూనే ఉన్నారు. ఎంచుకోవటం ఓ ప్రాబ్లెమ్ అయిపోయింది. పక్కన పెట్టిన చరణాలలో కూడా సీతారామశాస్త్రి ఎంత గొప్పగా రాశారో!? మీరు గనుక వాటిని ఆయన దగ్గర్నుండి సంపాదించి చూడండి. చలించి పోకుండా ఉండలేం" అన్నారు రవికిశోర్ రసస్పర్శతో స్పందిస్తూ.

## మనసంతా నువ్వే



సాధారణంగా డైలాగుల గురించి గాని కథను గురించి గాని చెప్పమంటే అనర్గళంగా చెప్పగల పరుచూరి గోపాలకృష్ణ పాటల గురించి కూడా అదే స్థాయిలో చెప్పగలరని ఇటీవల బుజువైంది. 'మనసంతా నువ్వే' సినిమాలో 'చెప్పవే ప్రేమ చెలిమి నీ చిరునామా' పాట గురించి ఆయన చెప్పింది వింటే ఎంతలోతుగా ఆయన పరిశీలిస్తారో అర్థమవుతుంది. "పూర్వం ప్రబంధాల్లో యోజనగంధి అనే యువతి గురించి, ఆమె శరీరం నుండి వెలువడే సౌరభం గురించి చదువుకున్నాం. ఆ హీరోయిన్ గురించి హీరో ఈ పాటలో పాడుతూ ఆమె పీల్చి వదలిన గాలి పరిమళం ఆమె వచ్చిందని చెప్పిందట. చిన్నప్పుడు ఊహ తెలియని వయసులో విడిపోయి 12 సంవత్సరాల తర్వాత ఆమె అక్కడికి వచ్చి వెళితే ఆ గాలి ఆమె వచ్చిందని చెప్పడం ప్రేమకి బ్యూటిఫుల్ ఎక్స్‌ప్రెషన్. ప్రబంధ లక్షణాలున్న పోయెట్రీ రాశారు సీతారామశాస్త్రి ఈ పాటలో" అంటూ సుమారు 20 నిమిషాలపాటు ఆగకుండా మెచ్చుకున్నారు పరుచూరి గోపాలకృష్ణ

## ఆనందం



'ఆనందం' సినిమా దర్శకుడు శ్రీనువైట్లని ఓ అందమైన భావుకతను సెల్యులాయిడ్ మీద మరింత అందంగా చూపించగల టెక్నీషియన్‌గా పేరు తెచ్చింది. ఈ చిత్రంలోని 'కనులు తెరిచినా కనులు మూసినా కలలు ఆగవేలా' పాటను తనకెంతో నచ్చిన పాటగా తెలిపారాయన. "అక్కడ అమ్మాయికి అబ్బాయికి ఒకటే ఫీలింగుంటుంది. కానీ ఎక్స్‌ప్రెస్ చేసుకోలేని కండిషన్. ఆ సిట్యుయేషన్‌కి సీతారామశాస్త్రిగారు ఎక్సలెంట్ లిరిక్ ఇచ్చారు. ఒక నైటంతా కూచున్నాం. ఆయన అలా పల్లవులు, చరణాలు అలా ఇస్తూనే ఉన్నారు. పాట థర్డ్ బీజీయమ్‌లో ఎవరైనా సరే వయొలిన్స్ వాడతారు. కానీ మేం 'వయొలా' వాడాం. దాని వలన పాటకి మరింత డెప్త్ వచ్చింది. మొత్తానికి మేం ఏ పాట నంబర్ వన్ అవుతుందనుకున్నామో అదే అయింది" అన్నారు శ్రీనువైట్ల తృప్తిగా.

## ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం



'ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం' 'హిట్‌లు శ్రావణి సుబ్రమణ్యం' అనిపించుకుంది. అర్థ శతదినోత్సవం జరుపుకున్న ఈ చిత్రంలోని ప్రతి పాటా శ్రోతలకు పసందు చేసింది. ఫాస్ట్‌బీట్, మెలోడి, ఫోక్.... ఇలా అన్ని రకాల పాటలు ఈ చిత్రంలో వున్నాయి. సినిమా రంగానికి కొత్తయినాగానీ మంచి నేర్పుతో, క్రమశిక్షణతో తొలి ప్రాజెక్ట్‌నే సక్సెస్ చేసారు యువ నిర్మాత కె.వేణుగోపాల్‌రెడ్డి. "ఏమో ఏమవునో ఎవరికి తెలుసంటా' పాట నాకు ఇష్టమైన పాటగా మారింది. సీక్వెన్స్‌కి తగ్గట్టుగా సాహితి మంచి సాహిత్యాన్ని పాటలో పొదిగారు. కథ చెబుతున్నట్టుగా వుంది పాట. పిక్చరైజేషన్ కూడా ఎట్రాక్టివ్‌గా వుంది. చక్రిసంగీతం అదరహో అన్నట్టుగా వుంది" అని చెప్పారాయన.

## స్నేహమంటే ఇదేరా



ఆడది మెచ్చిందే అందం అన్నట్టు ఒక రచయిత తోటి రచయితను మెచ్చుకుంటే చెప్పుకోడానికి చాలా బావుంటుంది. అలాటిదే జరిగింది. 'స్నేహమంటే ఇదేరా' పాటల విషయంలో. ఆ సినిమా టైటిల్‌ని కులశేఖర్ రాశాడు. అది తనకెంతో నచ్చిందన్నాడు చంద్రబోస్. "ముఖ్యంగా రెండో చరణం ఎంతో గొప్పగా ఉందండి. సృష్టిలో మానవుడికన్నా ముందరది ప్రకృతి. ఆ ప్రకృతిని బేస్‌గా తీసుకుని పాటని డెవలప్ చెయ్యడం. ఆ సమన్వయం అన్నీ చక్కగా చేశాడు కులశేఖర్. ఎన్ని ఇబ్బందులున్నా కొనసాగేదే స్నేహం. రెండో చరణంలో కూడా ఆ ఓరియెంటేషన్ ఉంది. అటువంటి కంటెంట్ ఉండడం వలనే ఆ పాట బావుందని ఫీలయ్యాను" అని వివరించాడు చంద్రబోస్.

## స్టూడెంట్ నెం. 1



కీరవాణి ఈ చిత్రంతో మళ్ళీ తన సత్తా చాటి చెప్పారు. గతంలో లాగానే కీరవాణి - కె.రాఘవేంద్రరావుల కాంబినేషన్‌లో వచ్చిన ఈ ఆడియో శ్రోతల హృదయాలను గెలుచుకుంది. 'శాంతినివాసం' మొదలైన టీవీ సీరియల్స్‌ని డైరెక్ట్ చేసిన యువదర్శకుడు రాజమౌళి ఈ చిత్రం ద్వారా వెండితెరపై పాదం మోపారు. "ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి ఇక్కడే కలిశాము' అనే ఫేర్‌వెల్ సాంగ్‌కి ఈ సినిమా పాటలన్నింటిలో కల్లా అగ్రతాంబూలం ఇవ్వొచ్చు. సంగీతం కానీండి, సాహిత్యం కానీండి ఎవ్విరిథింగ్ ఈజ్ నైస్. అలాగే చిత్రీకరణ కూడా లవ్లీగా వచ్చింది" అని చెప్పారు రాజమౌళి.

## ఖుషీ



పవన్ కళ్యాణ్ రేంజ్‌ని చూపించిన చిత్రం 'ఖుషీ'. ఈ చిత్రం ఆడియోకి ఇప్పటికీ శ్రోతల ఆదరణ లభిస్తోంది. ముఖ్యంగా 'అమ్మాయే సన్నగా అరనవ్వే నవ్వగా' పాట చిన్నా, పెద్దా తేడా లేకుండా అందరి నోళ్ళలోనూ నానుతోంది. ఈ పాట తనకు బాగా నచ్చిందని యువ దర్శకుడు పూరి జగన్నాథ్ అంటున్నారు. ఈయన ఇంతకుముందు పవన్‌కళ్యాణ్ 'బద్రి' సినిమాకి దర్శకుడు. 'మిస్సమ్మ' సినిమాలో రేలంగి పాడిన 'బాబూ ధర్మం చేయ్ బాబూ' పాటంటే నాకెంతో ఇష్టం. ఆ పాట ఆధారంగా 'ఖుషీ' తమిళం వెర్షన్‌లో ఓ పాట చేశారు. ఆ తమిళ వెర్షన్‌ని మారిస్తే వచ్చిందే ఈ తెలుగు పాట. పాటలోని పదాలు కూడా చాలా స్మూత్‌గా వున్నాయి. సాధారణంగా అమ్మాయి నవ్విందంటారు గానీ, అరనవ్వు నవ్విందనడం మంచి విశేషణంగా పేర్కొనాలి. కొంత ఇష్టం కొంత కొంటెతనం ఇవన్నీ కలిస్తేనే అర నవ్వు వస్తుంది. అందుకే నాకీ పాట బాగా నచ్చింది" అన్నారు పూరీ జగన్నాథ్.

## జాబిలి



మోహన రాగంలో ఒక్కొక్కరిదీ ఒక్కోశైలి. అది వారిని పట్టి ఇచ్చేలా ఉంటుంది. అదేవిధంగా కృష్ణారెడ్డి సినిమాల్లో మోహనరాగం ఏదో ఓ విధంగా చోటు చేసుకుంటూ ఆయన మార్కుని ప్రతిఫలింపజేస్తూ ఉంటుంది. నవంబరు 16న విడుదల కాబోతున్న 'జాబిలి'లో 'వయసు తలపు తెరిచే' పాటను తనకు యిష్టమైన పాటగా పేర్కొన్నారు యస్వీ కృష్ణారెడ్డి. "తెలుగు ట్యూన్‌కి తెలుగు పదాలు పడిన పాట ఇది. అంచేత పాట మరీ అందగించింది. దాంతో అందమైన స్కీమ్‌తో మోడ్రన్ టచ్‌తో పాట చిత్రీకరించే అవకాశం వచ్చింది. పాట ఎంత లేతగా వచ్చిందో సినిమా కూడా అంత లేతగా వచ్చింది" అని అన్నారాయన తన తన్మయత్వధోరణిలో.



హాస్యచిత్రాలు ఇతోధికంగా రావడానికి "హాసం" చేసే కృషిలో భాగంగా

పి.జి.ఉడ్‌హౌస్ రాసిన 'గెలహెడ్ ఎట్ బ్లాండింగ్స్" అనే

నవల కథా సంగ్రహం ఇస్తున్నాం.

రకరకాల హాస్య పాత్రలు, పలురకాల హాస్య సంఘటనలు గల ఈకథ సినిమావారికి సెంట్ పర్సంట్ ఫిట్. చదివి పాల్గొనే పాఠకులకి థౌజెండ్ టైమ్స్ బెనిఫిట్. అదేమిటో కథ పూర్తయ్యాక తెలుస్తుంది. ఇక కథ చదవండి మరి-

# గెలహెడ్ ఎట్ బ్లాండింగ్స్

**అనగనగా ఒక హీరో. అతనికో హీరోయిన్. ఇద్దరూ ప్రేమికులే అయినా ఇద్దరికీ గొడవలు వచ్చాయి. కారణం సెకండ్ హీరో పెళ్లికి సంబంధించిన ఓ పందెం. ఈ సెకండ్ హీరోకి ప్రేమలో పడడం, పెళ్లి నిశ్చయం అయిన, తర్వాత మనసు మార్చుకుని ఆ పెళ్లి ఎగ్గొట్టడం కొత్తకాదు. అతను ప్రేమలో పడ్డ ప్రతీసారీ ఈ సారైనా పెళ్లి అవుతుందా లేదా అని మిత్రులంతా పందాలు వేసుకోవడం, గుర్రప్పందాలలోలా టిక్కెట్లు అమ్మడం జరుగుతూంటుంది. ఈ సారి అతనికి ఓ జమీందారు మేనకోడలితో పెళ్లి నిశ్చయం జరిగింది. ఈ పెళ్లి జరుగుతుందా లేదా అన్న పాయింటు మీద టిక్కెట్లు అమ్మారు. హీరో, హీరోయిన్లు అతని మిత్రబృందంలో వాళ్లే కాబట్టి టిక్కెట్లు అమ్మకానికి వచ్చాయి. పెళ్లి అవుతుంది అని చెప్పి హీరో 500 పౌండ్లకు టిక్కెట్టు కొన్నాడు. హీరోయిన్‌కి కోపం వచ్చింది. "ఇలా ఎన్ని సార్లు కాలేదు, వీడికి ఈ సారి కూడా పెళ్లి కాదు, ఆ టిక్కెట్టు ఎవరికైనా 100 పౌండ్లకు అమ్మేయి, అని సలహా చెప్పింది. వినకపోతే వాదించింది. దాని మీద మాటా మాటా పెరిగి హీరోయిన్ను 'నువ్వొట్టి దద్దమ్మవి' అనేశాడు హీరో. దాంతో ఆమె అలిగి బ్లాండింగ్స్ అనే ఊరు వచ్చి ఉద్యోగంలో చేరిపోయింది. హీరో లండన్‌లో ఉండిపోయాడు ఒంటరిగా.**

హీరోయిన్ ఉద్యోగం ఓ జమీందారుకు సెక్రటరీగా ఉండడం. ఆ జమీందారుకి సెక్రటరీని పెట్టుకోవడం ఇష్టం లేదు. కానీ ఆయన ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా ఆయనకు సెక్రటరీ కుదిర్చినది - జమీందారు చెల్లెలు! మహా డామినేటింగ్ కారెక్టరు. ఈవిడ భర్తేమో మిలటరీ కల్నల్‌గా చేసి రిటైరయాడు. వాళ్ల అమ్మాయితోనే సెకండ్ హీరోకు పెళ్లి నిశ్చయమైంది. ఆవిడంటే చికాకుపడేవాళ్లల్లో జమీందారు తమ్ముడు కూడా ఉన్నాడు. అతనో నడివయసు బ్రహ్మచారి. జీవితం హాయిగా గడిపేసిన బాపతు. ఏ బాదరబందీలు లేకుండా హాయిగా ఉంటాడు. కానీ కొన్ని బాధ్యతలు నెత్తిన వేసుకుంటూంటాడు. విడిపోయిన ప్రేమికులను కలపడం వాటిల్లో ఒకటి. హీరో, హీరోయిన్ సంగతి విన్నాక వాళ్లకు సహాయం చేయడానికి నిశ్చయించుకున్నాడు.

జమీందారుకు ఇతరత్రా కూడా కొన్ని కష్టాలున్నాయి. ఇంట్లో తిష్టవేసిన అతిథి ఒకామె అందులో టాప్‌లో ఉంది. జమీందారు యవ్వనంలో ఉండగా ఆవిడని ప్రేమించాడు కానీ ఇద్దరికీ చెరొకరితోనూ పెళ్లి అయిపోయింది. దరిమిలా జమీందారు భార్య పోయింది. ఈ మధ్యనే ఆ మాజీ ప్రియురాలి భర్తా పోయాడు. ఆవిడకో కొడుకు. మహా దుండగీడు. వాడికో తండ్రి ఉంటే బాగుండునని ఆవిడకి తోచింది. జమీందారు గుర్తుకు వచ్చాడు. ఇంటికి వచ్చి కూచుంది. ఆవిడకు జమీందారు చెల్లెలు వత్తాసు. జమీందారుకు ఇప్పుడు ఆమె మీద ఎలాటి ఇంట్రస్టూ లేదు. పైగా ఆ కుర్రాడు ఆయనకు ఏమాత్రం నచ్చలేదు. వాడు ఆయన ఎంతో ప్రేమగా చూసుకునే ఓ పందిని ఏడ్పిస్తున్నాడు.

జమీందారుకు పందులను పెంచడం మహా

## సిద్ధాంతాలూ - రాద్ధాంతాలూ — షాపింగ్

బొమ్మలు: బాలి

క్యారీబాగ్‌లలో ఏదో ఒకటి
చిరగాలని రాసిపెట్టివుంటే ఆ
చిరిగే బ్యాగ్‌లో ఉండేవి
ఖచ్చితంగా కోడిగుడ్లే.

-ఇంటాయన వేదాంతం



షాపులో కొనుక్కోవలసినవన్నీ
ఒక్క ట్రిప్‌లోనే
పూర్తవుతాయనుకోవడం భ్రమ.

-గృహస్థు ఆవేదన





ఇష్టం. వాళ్ల కోటలో పెద్ద పందులదొడ్డిని నడుపుతున్నాడు. ఆయన అభిమానాన్ని చూరగొన్న ఒక పందిని రాణి అనేపేరుతో పెట్టి చాలా ప్రేమగా చూసుకుంటాడు. దాన్ని పంది అని ఎవరైనా అంటే చంపేస్తాడు. అలాటిదాన్ని ఈ కుర్రాడు సతాయిస్తుంటే ఆయనకు ఎలాగ ఉంటుందో ఊహించుకోవచ్చు. ఇవన్నీ చాలనట్టు ఆయనకి తగని మతిమరుపు. చెల్లెలి ధాష్టీకాన్ని తప్పని పరిస్థితుల్లో భరిస్తున్నాడు.

ఈ నేపథ్యంలో ఓ రోజు జమీందారు సెక్రటరీ - అదే, మన హీరోయిన్ - విఫల ప్రేమగాథ జమీందారు తమ్ముడికి తెలిసింది. హీరోని ఎలాగైనా వెతికి తెచ్చి, విడిపోయిన జంటలను కలుపుదామనే సదుద్దేశ్యంతో లండన్ రైలెక్కాడు. అక్కడ హీరోని చూడగానే అతను తన పాతస్నేహితుడి కొడుకని తెలిసింది. అభిమానం చూపాడు. ప్రేమికులు ఎందుకు విడిపోయారో వివరంగా తెలుసుకున్నాడు. నువ్వు మా ఊరు వచ్చేయ్. సమయం చూసి, ఏదో ఒకవేషంలో కోటలోకి తీసుకువచ్చేస్తాను. హీరోయిన్‌కి దగ్గరగా మసిలితే ఆమె ప్రేమ మళ్లీ పొందవచ్చు. అని నచ్చచెప్పాడు. హీరో సరేనని బ్లాండింగ్స్ రైలెక్కాడు.

ఆ సమయానికి జమీందారు లండన్‌లోనే ఉన్నాడు. తమ్ముడు వచ్చి 'నువ్వు లేకపోతే నీ మాజీ ప్రియురాలి కొడుకు ఆ రాణిని పందుల దొడ్డిలోంచి వదిలిపెట్టేస్తాడు చూడు, పొద్దున్న లేచిన నుంచి వాడికి ఇదే ఆలోచన' అని హడలగొట్టి వదిలిపెట్టేడు. జమీందారు భయపడి ఊరుకి రైలెక్కబోతూండగానే సెకండ్ హీరో, ఓ ఫ్రెండ్‌ని వెంటబెట్టుకుని వచ్చాడు. ఆ ఫ్రెండు జమీందారుకి బంధువే. అతనూ, సెకండ్ హీరో కలిసి ఓ క్లబ్‌లో పేకాటలో డబ్బు పోగొట్టుకుని గలభా చేస్తే పోలీసులు వచ్చి ఆ రాత్రంతా జైల్లో పెట్టి, బెయిల్‌కి 10 పౌండ్లు పట్టుకు రమ్మన్నారు. చేతిలో డబ్బు లేక జమీందారును ఆ పది పౌండ్లు అప్పు అడగడానికి వచ్చారిద్దరూ.

నరేనని ఇచ్చాడు కానీ ఇంటి కొచ్చాక చెల్లెలితోనూ, బావతోనూ తన మతిమరుపుతో, అయోమయంగా చెప్పేసరికి వాళ్లకు మతిపోయింది. వాళ్లకు కాబోయే అల్లుడు ఉన్న ఆస్తంతా ఊడ్చుకుపోయి, బికారైపోయి, పది పౌండ్లకు కూడా దిక్కులేని స్థితిలో ఉన్నట్టు వాళ్లకు చెప్పాడు ఈ మతిమరుపు జమీందారు. దాంతో నిశ్చితార్థాన్ని రద్దు చేసుకుందామనుకుని నిశ్చయించుకున్నారు వారు. ఇది విని 'నేను ముందునుండీ అనుకున్నదేగా' అనుకుంది హీరోయిన్. తన మాట వినకపోగా సైగా తనను దద్దమ్మ అన్న హీరో మీద ఇంకాస్త కోపం వచ్చింది.

జమీందారు తమ్ముడు చెప్పిన సలహా మేరకు ఊరు చేరిన హీరో హోటల్ కూచుని ఏదో తింటూ ఉండగా జమీందారు బట్లర్ పరిచయమయ్యాడు. ఆ బట్లరు తన వాచీ తీసి హీరోకి చూపిస్తూండగా అంతలో సడన్‌గా హీరోయిన్ అక్కడికి వచ్చింది. హీరోని అక్కడ చూసి కోపంతో గిరుక్కున వెనక్కి

## సిద్ధాంతాలూ - రాద్ధాంతాలూ

**షాపింగ్**

బొమ్మలు: బాలి

షాప్ వాడికిచ్చిన చెక్కు ఎన్ని రోజులలో బ్యాంకుకి వస్తుంది అనేది మన ఎక్కవుంటులోని బ్యాలన్స్ మీద ఆధారపడి వుంటుంది. బ్యాలన్స్ ఉంటే వారాల తరబడి రాదు. లేకపోతే రాత్రికి రాత్రే వచ్చి పడుతుంది.

-బ్యాంకింగ్ బాధితుడి నిర్వేదం






సూపర్ మార్కెట్ వారు స్వంతంగా తయారు చేసే వస్తువుల నాణ్యత, ఆ షాపు సైజు - ఆపోజిట్ రేషియోలో ఉంటాయి.

-షాపింగ్ సైంటిస్టు పరిశీలన

తిరిగి వెళ్లిపోయింది. అది చూసిన హీరో ఆమెను కలిసి నచ్చచెబుదామనుకుని వెంటపడబోయాడు. హడావుడిలో బట్లర్ చూపిస్తున్న వాచీని జేబులో వేసుకుని హోటల్ బయటకు పరిగెట్టాడు. అప్పుడే పరిచయమైన పెద్దమనిషి ఇలా వాచీ పట్టుకుని పారిపోవడంతో కంగారుపడి ఆ బట్లర్ హోటల్లో కాఫీ తాగుతున్న ఓ పోలీసు జవానుకు మొరపెట్టుకున్నాడు. వెంటనే పోలీసు సైకిలెక్కి హీరో వెంటపడ్డాడు. హీరో దొరికాడు, వాచీ తిరిగి ఇస్తున్నట్టే ఇచ్చి సైకిలు లాక్కున్నాడు, అదెక్కి హీరోయిన్‌ను అందుకుందామని అతని ఐడియా. సైకిలెక్కి వెతికినా హీరోయిన్ అందలేదు. విసుగుపుట్టి ఆ సైకిలు రోడ్డు మీదే పడేసి పోయాడు. కానీ పోలీసువాడి సైకిలు ఎత్తుకుపోయినందుకు పోలీసులు హీరో మీద కేసు పెట్టి అతనికోసం వెతకసాగేరు.

హీరోయిన్ ఈ పరిణామాలతో విసిగిపోయింది. తండ్రికి ఒంట్లో బాగోలేదని చెప్పి కోట విడిచి వెళ్లిపోయింది. ఇది జమీందారు తమ్ముడికి నచ్చలేదు. తను కష్టపడి అందర్నీ కలుపుదామని చూస్తూంటే ఇలా జరుగుతోందేమని. అసలు అతను హీరోని ఏదో ఒక పేరు మీద కోటలోకి అతిథిగా తేవాలన్న ఐడియాతో ఉన్నాడు. పందుల గురించి ఓ పెద్ద పుస్తకం రాసిన ఓ రచయిత అంటే జమీందారుకి చాలా గౌరవం. నువ్వే ఆ రచయితనని చెప్పి కోటలోకి వచ్చేయి. అన్నాడు హీరోతో. నా వల్లకాదు. పైగా నాకు పందులంటే చికాకు అన్నాడు హీరో. కానీ చివరికి మారుపేరుతో రాక తప్పింది కాదు. కానీ అప్పుడూ ముప్పు తప్పలేదు. కోటలో ఉన్న జమీందారు బట్లర్ వేరెవరో కాదు, హీరోకి హోటల్లో పరిచయమయిన వాడే. అప్పుడు తన వాచీ ఎత్తుకుపో జూసినట్టే కోటలో కూడా ఏదైనా వస్తువులు ఎత్తుకుపోవడానికి మారుపేరుతో వచ్చాడని వాడి అనుమానం. దీనికి

# మీరే సినీరచయిత



దర్శకుడు శివనాగేశ్వరరావు

## ఏజెంట్‌లకు, పాఠకులకు బహుమతులు

ఈ కథను గనుక ఎవరైనా నిర్మాత తెలుగులో సినిమాగా తియ్యదలుచుకుంటే మనకున్న నటీనటుల్లో ఎవరు ఏ పాత్రకు సరిపోతారన్నది బాగా ఊహించి ఈ కింది కూపన్‌లో తుడుపులు, కొట్టివేతలు లేకుండా నీటుగా రాసి 15-11-2001లోగా పంపండి. ఫ్రమ్ అడ్రస్ రాయడం మరచిపోవద్దు. ఈ కథను ప్రముఖ దర్శకుడు శివనాగేశ్వరరావు గారికి వినిపించడం జరిగింది. ఏయే పాత్రలకు ఎవరెవరు సరిపోతారో ఆయన సూచించారు కూడా. ఆయన ఊహకు దగ్గరగా వున్న సూచనను పంపిన వారికి **రూ.500/-లు** ఒక తప్పుతో పంపినవారికి **రూ.300/-**లు రెండు తప్పులతో పంపినవారికి **రూ.200/-**లు బహుమతిగా పంపడం జరుగుతుంది.

**ఆయా విజేతలకు ఈ పత్రికను విక్రయించిన ఏజెంట్‌లకు కూడా బహుమతులు అదే పద్ధతిలో వుంటాయి.**

ఇలా పాఠకులు కూడా తాము చదివిన 'కామెడీ బేస్‌గా వున్న ఇంగ్లీషు నవల' యొక్క కథా సంగ్రహాన్ని గానీ, సినిమాకు పనికొచ్చే విధంగా తాము స్వంతంగా రాసిన కామెడీ కథ గాని పైన రాసినట్టుగా సింగిల్ లైన్ ఆర్డర్‌లో రాసి మాకు పంపొచ్చు. 'ఏమో... గుర్రమెగరా వచ్చు' అన్నట్టు క్లిక్ అయితే మీరే ఓ సినీ కథా రచయిత అవుతారేమో...!? ప్రయత్నించి చూడండి.

## పాత్రలు - పాత్రధారులు

| పాత్రలు - | జమీందారు | జమీందారు చెల్లెలు | జమీందారు తమ్ముడు | జమీందారు మాజీ ప్రియురాలు |
|---|---|---|---|---|
| పాత్రధారులు - | | | | |

| పాత్రలు | హీరో | హీరోయిన్ | సెకండ్ హీరో | సెకండ్ హీరోయిన్ |
|---|---|---|---|---|
| పాత్రధారులు - | | | | |

పంపినవారి పేరు, చిరునామా..........................................................................

..........................................................................................వయస్సు.....................

న్యూస్ ఏజెంట్ పేరు, అడ్రస్సు..........................................................................

..........................................................................................................

తోడు అనుకోకుండా అసలు రచయిత దగ్గర్నుంచి ఫోనొచ్చింది, తను త్వరలో కోటకు రాబోతున్నట్టు.

ఇది ఇలా ఉండగా జమీందారు చెల్లెలు తన కూతురుకు చెప్పింది. 'ఇలా సెకండ్ హీరో బికారి అయిపోయాడు. ఎంగేజ్ మెంట్ బ్రేక్ చేస్తున్నట్టు ఉత్తరం రాసి పంపు' అని తల్లి మాట జవదాటలేక ఆమె రాసి ఇచ్చింది కూడా. ఆ ఉత్తరం జమీందారు తమ్ముడి చేతికి వచ్చింది. ఈలోగా కల్నల్, అంటే సెకండ్ హీరోయిన్ తండ్రికి తెలియవచ్చింది - కాబోయే అల్లుడి ఆస్తి నిక్షేపంలా ఉంది, ఇదంతా జమీందారు కన్‌ఫ్యూజన్ మహత్యం అని. వెంటనే జమీందారు తమ్ముడికి ఫోన్ చేసి ఉత్తరం సెకండ్ హీరోకి అందకుండా చూడమన్నాడు.

హీరోని అనుమానించిన బట్లర్ ఊరికే కూచోలేదు. జమీందారు చెల్లెలికి వెళ్లి చెప్పాడు. తన తమ్ముడి ఆకతాయి పనులు బాగా తెలుసుకాబట్టి దీనిలో అతని హస్తం ఉండే ఉంటుందని ఊహించి, ఆవిడ వచ్చి నిలదీసింది. జమీందారు తమ్ముడు తొణకలేదు హీరో రహస్యం బయటపెట్టావంటే మీ అమ్మాయి సంబంధం తెంపుకుంటూ రాసిన ఉత్తరం నా దగ్గరే ఉంది, సెకండ్ హీరోకి అందజేస్తా. దెబ్బకి నీకు లక్షాధికారి దక్కడు అని బెదిరించాడు. జమీందారు వద్దకు వెళ్లి ఈ 'పందుల పుస్తకం రచయితకు' వెయ్యి పొండ్లు ఇవ్వడానికి ఒప్పించాడు. ఆ డబ్బుతో అతనికే, హీరోయిన్‌కే పెళ్లి జరిపించేద్దామని అతని ప్లాను.

హీరోయిన్ ఊరినుండి తిరిగి వచ్చింది. సెకండ్ హీరో కలిసాడు. తను జమీందారు మేనకోడల్ని గాఢంగా ప్రేమిస్తున్నాననీ, తన ఫ్రెండు - అంటే జమీందారు కజిన్ - పందులను కాసే అమ్మాయిని ప్రేమించాడని, పెద్దలు ఒప్పుకోవడం లేదు కాబట్టి రెండు జంటలూ ఇల్లొదిలి పారిపోతున్నామని చెప్పాడు. సడన్‌గా హీరోయిన్‌కి జ్ఞానోదయం కలిగింది. సెకండ్ హీరో ప్రేమని అంచనా వేయడంలో హీరోదే రైటనీ, తనది తప్పనీ, హీరో తనను దద్దమ్మ అనడం సరైనదేననీ. పశ్చాత్తాపంతో కుమిలిపోతూ హీరోని వెతకబోయింది. కానీ అతనెక్కడా కనబడడే!

తను చెప్పినా జమీందారు చెల్లెలు ఈ మారువేషగాడిని తరిమేయక పోవడంతో ఒళ్లు మండి, బట్లర్ పోలీసులకు చెప్పాడు మీరు వెతుకుతున్న వాడు ఇక్కడే కోటలో ఉన్నాడని. హీరో వెళ్లి ఓ షెడ్‌లో దాంకున్నాడు. హీరోయిన్ జమీందారు తమ్ముడి వద్దకు వెళ్ళి అడిగి హీరో గురించి అడిగింది. అతను ఊహించి చెప్పాడు. వెళ్ళి హీరోను కలిసింది. వాళ్ళ మధ్య అపోహలు తొలగిపోయాయి.

అంతా శుభం అయిపోయేదే గానీ ఈ లోపున జమీందారు మేనకోడలు రాసిన ఉత్తరం పొరబాటున సెకండ్ హీరోకి చేరిపోయింది. దాంతో అతనికి ఆమె ప్రేమ మీద అనుమానం వచ్చింది. కానీ హీరోయిన్, జమీందారు తమ్ముడు ఇద్దరూ వెళ్లి అతనికి నచ్చచెప్పారు. అది తల్లి బలవంతం మీద రాసినదేనని. వాళ్ల పెళ్లి నిశ్చయమవుతుందని తెలియగానే జమీందారు చెల్లెలికి ధైర్యం వచ్చేసింది. వెళ్ళి తన అన్నగారికి ఈ బోగస్ రచయిత గురించి ఫిర్యాదు చేదామని బయలుదేరింది. అంతలోనే అన్నగారు ఓ ఉపద్రవం తెచ్చి పెట్టాడని వింది.

జమీందారు ఇంట్లో తిష్టవేసిన మాజీప్రియురాలు కొడుకు తనను హింస పెట్టగా చూసి చూసి ఓ నాడు ఆ రాణీ పంది వాడి వేలు కొరికేసింది. వెంటనే వాడి తల్లి జమీందారు వద్దకు వెళ్లి ఆ పందిని చంపి పారేయి అని ఆర్డరేసింది. ఆ పందంటే పంచప్రాణాలు అయిన జమీందారు కావాలంటే నువ్వు పో గానీ దానిని వదలను అనేశాడు. ఇది విని జమీందారు చెల్లెలు హతాశురాలై పోయింది, జమీందారు చెల్లెలు. ఆవిడ ఇంటికి కోడలుగా వస్తే మరింత ఆస్తి కలిసివస్తుందన్న ఆశ ఈమెది.

కోపంగా జమీందారు వద్దకు వెళ్లి అపాలజీ చెప్పు అంది. దానికే కాదు, నీకూ చెప్పను పో అన్నాడు, తిక్క జమీందారు.

అలా అయితే నేను ఇంట్లోంచి వెళ్లిపోతాను కానీ వెళుతూ వెళుతూ నీకో రహస్యం చెబుతాను. నువ్వు పందుల రచయిత అనుకుంటున్నవాడు వాడు కాదు, వేరేవాడు. ఈ కుట్ర వెనక్కాల మన తమ్ముడు ఉన్నాడు అని చెప్పింది. జమీందారు మండిపడ్డాడు. తమ్ముణ్ణి సంజాయిషీ అడిగేడు. ఈ దొంగ రచయితకు వెయ్యి పొండ్లు ఇమ్మనమని ఎందుకడిగేన్నాడు.

తమ్ముడు ఒప్పుకున్నాడు. చేసినదంతా చెప్పాడు. ఇదంతా నీ లాభానికే అన్నాడు. ఎలా అన్నాడు జమీందారు. నువ్వు ఆ వెయ్యి పొండ్లు... పోనీ అప్పుగా ఇచ్చావనుకో, వాళ్లిద్దరూ పెళ్లి చేసుకుని వెళ్లిపోతారు. నీకు సెక్రటరీ బాధ వుండదు. తను చెప్పినా మాట వినలేదన్న కోపంతో అక్క మళ్లీరాదు. తనతో బాటు తన మద్దతున్న నీ మాజీ ప్రియురాలు రాదు. దానితో బాటు ఆ ఆకతాయి కుర్రాడు రాడు. నీ రాణిపందిని సతాయించలేడు. చూడు ఎన్ని లాభాలో అన్నాడు.

జమీందారు మురిసిపోయాడు. రైటో అన్నాడు. హీరో, హీరోయిన్ల చేతిలో వెయ్యి పొండ్లు ఇచ్చి పెళ్లి చేసుకోమని ఆశీర్వదించాడు.

**ఇదీ కథ!**

**- మంజీర**

'సమ్‌థింగ్ ఫ్రెష్' అనే ఈ కథను సినిమాగా తీస్తే అందులో ఈ దిగువ ఉదహరించిన పాత్రలకు ఈ నటీనటులైతే బాగుంటుంది :

పాత్రలు పాత్రధారులు

| | | | |
|---|---|---|---|
| పాత్రలు | హీరో | హీరోయిన్ | జమీందారు |
| పాత్రధారులు | మహేష్ బాబు | భూమిక | కోట |
| పాత్రలు | జమీందారు కొడుకు | రిసెప్షనిస్ట్ | రిసెప్షనిస్ట్ కూతురు |
| పాత్రధారులు | సుధాకర్ / రవిబాబు | భరణి | ఇంద్రజ / రవళి |
| పాత్రలు | పోలీసు ఆఫీసరు | సెక్రటరీ | అక్కరి ఫ్రెండు |
| పాత్రధారులు | ప్రకాష్ రాజ్ | శివాజీరాజా | బ్రహ్మానందం |

S.V. [illegible]

ఎస్వీ కృష్ణారెడ్డి
ఫిల్మ్ డైరెక్టర్ - మ్యూజిక్ డైరెక్టర్
11/ఎ. రోడ్ నెం. 2, బంజారాహిల్స్,
హైదరాబాద్.

**1-15 అక్టోబరు, 2001 సంచికలో 'ఉడ్ హౌస్ ఫర్ యూ' శీర్షికన వెలువడిన 'సమ్‌థింగ్ ఫ్రెష్' అనే కథ పై నిర్వహించిన క్విజ్ జవాబులను శ్రీ యస్వీ కృష్ణారెడ్డి స్వదస్తూరిలోనే చూశారు గా....**

**ఇక ఫలితాలు: ఆల్ కరెక్టుగా ఎవరూ రాయలేకపోయారు.**

**ఒక తప్పుతో రాసినవారు**
**డాక్టర్ ఇ.యస్.సంపత్‌కుమార్ - శ్రీకాకుళం**

**రెండు తప్పులతో రాసినవారు**
**జి.రంగనాయకమ్మ - జంగారెడ్డిగూడెం**

ప్రకటించిన బహుమతులను వీరికి పంపడం జరుగుతుంది. వీరు పంపిన కూపన్‌లలో ఏజంట్ల వివరాలను పేర్కొనలేదు. కనుక వారికి బహుమతులను పంపలేక పోతున్నందుకు చింతిస్తున్నాము.

# సున్నితమైన సూరేకారం

# సూర్యకాంతం











అక్టోబరు 28
సూర్యకాంతం
జయంతి
సందర్భంగా
**రావికొండలరావు**
ప్రత్యేక రచన ఇది.

అత్తగార్లు రెండు రకాలు.

ఒకరు సౌమ్యం. రెండోవారు గయ్యాళి.

సాధారణంగా అత్తగారు కోడలి మీద పెత్తనం చలాయిస్తుంది.

ఆ పెత్తనం పెడసరం అయితే గయ్యాళితనం కింద మారుతుంది. గయ్యాళితనం అంటే, రాసిరంపాన పెట్టడం. అలా అత్తగారు కోడల్ని బాధ పెడుతూ వుంటే చూసేవాళ్లకి కోడలు మీద జాలి, అత్తమీద కోపం కలగాలి. కాని ఈ 'సినిమా అత్తగారు' నవ్వు తెప్పిస్తారు.

గయ్యాళి అత్త పాత్ర ద్వారా ఎంటర్‌టైన్‌మెంట్ పంచి పెట్టే ఆ తార **సూర్యకాంతం.**

'గయ్యాళి అత్త'కి మరో పేరు.

మామూలు మాటల్లో, ఎవరైనా అత్తల గురించి మాట్లాడినప్పుడు

"అమ్మో - ఆవిడ అత్తగారా! సూర్యకాంతమే" అని చెప్పుకోడం వింటూనే వున్నాం.

అలాంటి పాప్యులారిటీ సంపాయించింది ఆమె.

ఇంకా విశేషం ఏమిటంటే - ఎన్ని సినిమాల్లో ఆమె అత్తవేషం వేసి ఎడం చెయ్యి విసురుతూ ధుమధుమలాడుతూ నటించినా, మొనాటనీ కనిపించక పోవడం! ఒకే రకమైన పాత్రని దాదాపు అన్ని చిత్రాల్లోనూ నటిస్తూ అన్ని పాత్రలతోనూ ఆకట్టుకున్న నటి సూర్యకాంతమే.






సినిమా వాళ్లలో దగ్గర వాళ్లని వరసలు పెట్టుకుని పిలవడం ఓ అలవాటు - ఎన్.టి.ఆర్‌ను 'అన్నగారు', నాగయ్యను 'నాన్నగారు' అన్నట్టు. ఆ వరసలో ఈ సూర్యకాంతాన్ని ఎవరూ 'అత్తగారూ' అని పిలవరు. భయం! చాలామందికి ఆమె అక్కగారు. కొందరికి దొడ్డమ్మగారు.

రేలంగి - సూర్యకాంతం, రంగారావు - సూర్యకాంతం, రమణారెడ్డి - సూర్యకాంతం కాంబినేషన్లుంటే, సినిమాలలో నవ్వుల పంటే. అందుకే, నాటి నిర్మాతలు కథా చర్చలోనే సూర్యకాంతం పాత్రకోసం వెతికే వారు. "సూర్యకాంతం మీ చిత్రంలో వుందా?" అని ప్రేక్షకులు అడిగినట్టు - డిస్ట్రిబ్యూటర్లూ అడిగే వారు. ఐతే, ఆమెను హాస్యనటిగా ముద్ర వెయ్యడానికి వీల్లేదు. కారెక్టర్ యాక్ట్రెస్ - అనే అనాలి. ముక్కు, కళ్లూ నోరూ వంకర్లు తిప్పుతూ, కోతి చేష్టల్లాంటివి చేస్తూ ఆమె హాస్యం పలికించలేదు. కేవలం సంభాషణాచాతుర్యమే. అందుకు వందలాది సినిమాలు సాక్ష్యం.

ఐతే, ఈ తెరగయ్యాళి - తెరముందు సౌమ్యురాలు. చక్కని మాటా, తీరూతో అందర్నీ ఆకట్టుకునేది. పండుగలు పబ్బాలూ వస్తే, షూటింగులకి తినుబండారాలు తెచ్చి,







చిన్నాపెద్దా అందరికీ ఇచ్చేది. వర్కర్స్ లాంటివాళ్లకి 'కట్నాలు' పెట్టేది.

షూటింగుల్లో ఆమె వుంటే సందడే. సరదాగా జోకులు వెయ్యడం, చెయ్యడం - సరేసరి.

ఒకసారి ఒక జర్నలిస్టు దీపావళికి ప్రత్యేక సంచిక తెస్తున్నామని, దానికేదైనా 'ఇంటర్వ్యూ' ఇమ్మని అడిగాడు. 'చూదాం' అందామె. ఆ ప్రత్యేక సంచిక విశేషాల్ని ముందు సంచికలో వేస్తూ "సూర్యకాంతంతో ప్రత్యేక ఇంటర్వ్యూ" అని వేశారు. అది చూసి, ఆ జర్నలిస్టుని సౌమ్యంగా ఇంటికి పిలిపించి, వచ్చిన తర్వాత ఝాడించేసింది. "చూదాం అన్నాను గాని, ఇంటర్వ్యూ ఇస్తాను అన్నానా? ఎందుకిలా ప్రచురించారు?" అంటూ తీవ్ర స్థాయిలో ఎగిరిపోయేటప్పటికి,



ఆ జర్నలిస్టు, అతనితో వచ్చిన ఇంకో జర్నలిస్టు అడిలిపోయారు. పొరపాటు క్షమించమన్నారు. బిక్కమొహాలు పెట్టి చూశారు. ఏడుపు మొహాలు పెట్టబోయే సమయంలో "ఊరికే అన్నాన్నాయనా. మిమ్మల్ని భయపెట్టాలని, చిన్న జోక్ చేశాను. రండి ఇంటర్వ్యూకి కూచుందాం" అని కాఫీ తెప్పించే సరికి, ఆ జర్నలిస్టులు వేడి కాఫీ తాగి కూల్ డ్రింకు తాగినట్టు చల్లబడ్డారు. ఇలాంటి ప్రాక్టికల్ జోకులు ఆమెకు సరదా.

ఐతే, ఆమె స్ట్రిక్టు, నికార్సయిన మనిషి, అమాయకురాలు కాదు. అందర్నీ నమ్మేది కాదు. దూరంగా నిలబెట్టేది. తన కారు రిపేరొస్తే మెకానిక్ ఇంటికొచ్చి ఏ పార్టు పోయిందో ఎందుకు పోయిందో చెప్పాలి. అది కొనుక్కొచ్చి తన ఎదుటే మార్చాలి. అలాగే అన్నీనూ. అవసరమైన వాళ్లకే ఆర్థిక సహాయం చేసేది

ఓసారి షూటింగులో షాటు తియ్యబోతూంటే - మేనేజరు "సైలెన్స్ అవుట్ సైడ్" అని గట్టిగా అరిచాడు. ఆ అరుపుకి సూర్యకాంతం "ఓ" అని అరిచింది. "అమ్మా అమ్మా.... సైలెన్స్ అమ్మా" అన్నాడు అతను దీనంగా. "నువ్వు సైలెన్స్ అవుట్‌సైడ్ అన్నావుగదా, నేను లోపలున్న దాన్ని గనక అరిచాను" అందామె - పిల్ల చేష్టచేసి చిరునవ్వుతూ

గాని, అనవసరం అనో, అపాత్రదానం అనో అనిపిస్తే మాత్రం పూచిక పుల్ల విదిల్చేది కాదు. తనకి రావాల్సిన పారితోషికాన్ని అడగవలసిన నిర్మాతల దగ్గర్నుంచి గట్టిగా అడిగేది. నమ్మకం గల నిర్మాతల్ని ఏనాడూ అడిగేది కాదు. సెట్లో సూర్యకాంతం, ఛాయాదేవీ వుంటే - 'వివాహ భోజనంబు'లే. పోటీలు పడి తెప్పించుకుని తింటూ వుండేవారు. ఓసారి రేలంగి, "ఏం తింటార్రా బాబూ" అని విసుక్కుంటే, "మేం తెప్పించుకుంటాం, తింటాం, ఫిల్ము తినడం లేదుగా" అని మాట అందించింది. "ఐతే నాకూ పెట్టండి" అంటూ ఆ నవ్వుల రాజు చెయ్యిజాపాడు.

సినిమాల్లో సజెషన్ షాట్స్ అని వుంటాయి. ఒక పాత్రని తల వెనక భాగం కనిపించేలా నిలబెట్టి ఎదటి పాత్ర డైలాగ్ తీసుకుంటారు. ఒక డైరెక్టరు "అమ్మా మీ సజెషన్‌తో షాట్

దృశ్యంలోని డైలాగులు సొంతం చేసుకుని చెప్పడం ఆమె అలవాటు. "సహజంగా వుండాలంటే ఉన్న డైలాగుని మార్చకుండా సొంతం చేసుకుంటాను" అని చెప్పేది ఆమె. వీలైనంతవరకూ సొంతం చేసుకుంటాను" అని చెప్పేది ఆమె. 'శ్రీమంతుడు' షూటింగులో ఒక పెద్ద షాటులో సూర్యకాంతం తన డైలాగు అయిపోయినా, ఇంకా ఏదో చెబుతూనే వుంది. దర్శకుడు ప్రత్యగాత్మ కట్ చెప్పలేదు. ఎక్కడో ఆగిందామె. అప్పుడు 'కట్' అయింది షాటు. 'షాటు కట్ చెప్పలేదేం నాయనా" అని ఆమె అడిగితే, "మీరు చెబుతున్నారు గదా, కానీండి అని వూరుకున్నాను" అన్నారు ప్రత్యగాత్మ నవ్వుతూ. "మరి అదనపు డైలాగులు చెప్పాను గదా, అదనంగా ఏదైనా ఇప్పించండి" అని ఆమె జోక్ చేసింది.

తీసుకుంటాను" అంటే, "ఓహో, నా సజెషన్స్‌తో కూడా మీరు షాట్స్ తీస్తారన్నమాట" అని చమత్కరించింది ఆమె సజెషన్‌ని 'సలహా'గా మార్చి. జోకులు, చమత్కారాలూ ఎలా వున్నా - దర్శకులన్నా, నిర్మాతలన్నా భయం భక్తీ వుండేవి. దుక్కిపాటి మధుసూదనరావు గారన్నా, చక్రపాణిగారన్నా విపరీతమైన భక్తి, భయం.

ఇలాంటి 'సినిమా అత్తగారు' మళ్లీ వస్తుందో లేదోగాని,

ఒక చిత్రంలో నాగయ్యగారిని తిట్టే దృశ్యం. తిట్టి తిట్టి, షాట్‌కట్ అయిన తర్వాత ఆయన కాళ్ల మీద పడి, "అపరాధం, క్షమించండి" అని వేడుకున్నదామె - "డైలాగు కదమ్మా... నువ్వా తిట్టావు, పాత్ర కదా" అని నాగయ్యగారు చెప్పినా వినకుండా చెమర్చిన కళ్లు తుడుచుకుందామె. అదీ ఆ సున్నిత హృదయంలోని భక్తి!



బయట సూర్యకాంతం కనిపిస్తే, అభిమానులు దూరంగా నిలబడే మాట్లాడే వారు గాని, దగ్గరగా వచ్చేవారు కాదు. "ఓసి మీ కడుపులు బంగారం గానూ, ఎందుకర్రా అంత భయం" అని అడిగేదామె. "మీరు చెయ్యి విసురుతారేమోనని" అన్నాడో కుర్రాడు కొంటెగా. "ఆ విసురుడంతా సినిమాల్లో. అక్కడ డబ్బు ఇస్తారు. నువ్వు ఏం ఇస్తావు? ఇవ్వవు కదా, అంచేత చెయ్యీ విసరను, రాయీ విసరను... రా దగ్గరికి" అని గదమాయించిన సూర్యకాంతాన్నీ ఆమె పాత్రల్నీ ఎవరూ మరచిపోలేరు.

ఆమె మాత్రం శాశ్వతం! అత్తగారుగా అభిమానులకీ, అక్కగారుగా దగ్గరవారికీ ఆమె ఎంతో గుర్తు... ఎప్పుడూ గుర్తు.

ఈ పాటను వివరంగా కావాలని కోరినది: వై.యస్. నాగమణి, ఆంధ్రాబ్యాంక్, హైద్రాబాద్.

1971-1980



| | |
|---|---|
| చిత్రం | : సంపూర్ణ రామాయణం(1972) |
| బ్యానర్ | : లక్ష్మీ ఫిలింస్ |
| దర్శకత్వం | : బాపు |
| సంగీత దర్శకత్వం | : కె.వి. మహదేవన్ |
| ఈ పాట రచన | : దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి |
| పాడినది | : పి. సుశీల |
| అభినయించినది | : పండరీ బాయి, శోభన్‌బాబు, నాగరాజు |

# ఊరికే కొలని నీరు ఉలికి ఉలికి పడుతుంది

ఊరికే కొలని నీరు ఉలికి ఉలికి పడుతుంది
ఒరగా నెమలి పింఛ మారవేసు కుంటుంది
ఎందుకో... ఎందుకో.. ప్రతి పులుగు ఏదో
చెప్పబోతుంది.
వనములో చెట్టు చెట్టు కనులు విప్పి చూస్తుంది
ఉండుండి నా కాళ్ళు ఊగి ఊగి పోతుంది
అదిగో రామయ్యే ఆ అడుగులు నా తండ్రివే
ఇదిగో శబరీ శబరీ వస్తున్నానంటున్నవి
కదల లేదు వెర్రి శబరి ఎదురు చూడలేదని
నా కోసమే నా కోసమే నడచి నడచి నడచీ
నా కన్నె నిరుపేద నా మహారాజ పాపం అదుగో
అసలే ఆనదు చూపు ఆపై ఈ కన్నీరు
తీరా దయచేసిన నీరూపు తోచదయ్యయ్యో
ఏలాగో నా రామా ఏదీ ఏదీ ఏదీ
నీల మేఘ మోహనము
నీ మంగళ రూపము
కొలనునడిగి తేటనీరు
కొమ్మ నడిగి పూలచేరు



పట్టు నడిగి చెట్టు నడిగి
పట్టు కొచ్చిన ఫలాలు
పుట్ట తేనె రసాలు
దోర వేవా కాయలేవొ
ఆరముగ్గిన వేవొ గాని
ముందుగా రవంత చూసి
విందుగా అందీయనా
విందుగా అందీయనా

పల్లవి, అను పల్లవి, చరణం అంటూ ప్రత్యేకంగా విడదీయలేని ఈ స్వర రచనలో 'ఊరికే కొలని నీరు...' దగ్గర్నుంచి 'నాకన్నె నిరుపేద నా మహారాజు పాపం అదిగో' వరకు శహనా రాగాన్ని, 'అసలే ఆనదు చూపు' దగ్గర్నుంచి 'నీ మంగళ రూపము' వరకు ఆనంద భైరవి రాగాన్ని, 'కొలను నడిగి తేట నీరు' దగ్గర్నుంచి 'విందుగా అందీయనా' వరకు మోహన రాగాన్ని ఉపయోగించారు. 'ఉండుండి నా వొళ్లు ఊగి ఊగి పోతోంది' అనే వాక్యం వరకు రిథమ్‌ని అసలు ఉపయోగించకుండా ఆగి, అక్కణ్ణించి మాత్రమే మొదలు పెట్టడం వల్ల లయకి, ఊగించే గుణానికి గల అవినాభావ సంబంధాన్ని గుర్తెరిగి మరీ వ్యవహరించారని అనిపిస్తుంది.

సినిమా వాళ్ళు అంతగా పట్టించుకోని రాగాలలో శహనా ఒకటి, ఆ రాగాన్ని తీసుకొని అందులో పూర్తిస్థాయి శృంగార గీతాన్ని చేసిన ఘనత తెలుగు సినీ సంగీతానికి సంబంధించినంత వరకు కె.వి.మహదేవన్‌కే దక్కుతుంది. 'వీరాభిమన్యు' చిత్రంలోని 'చూచి వలచి చెంతకు చేరి' పాట ద్వారా ఆ ప్రయోగం చేశాడాయన. ఆర్తి ఎక్కువగా ప్రతి ఫలించే ఆ రాగంలో శృంగార గీతాన్ని స్వరపరచటం మామూలు ప్రయోగమే కాదు సాహసం కూడా. అటువంటి సాహసం తరువాత-తిరిగి ఆ రాగ లక్షణాన్ని సంపూర్ణంగా వినియోగించుకుంటూ ఆ రాగంపై తనకున్న పట్టుని, సృజనాత్మకతలో రసాస్వాదనే తప్ప వాదన ముఖ్యం కాదన్న విషయాన్ని- ఈ 'ఊరికే కొలని నీరు' లోని తొలి ఖండిక ద్వారా నిరూపించాడు మహదేవన్.

కొన్ని కొన్ని అనుభూతుల్ని అందించ టానికి హృదయానికి పరిపక్వత కావాలి. అనుభవాల్ని పండించుకున్న జీవితం అయితీరాలి. అప్పుడే పదాలు పవిత్రంగా జన్మిస్తాయి. భావాలు స్వచ్ఛంగా ఉంటాయి. నాస్తికుడైన కవి కలం నుంచి వచ్చే మాటలకి, ఆస్తికుడైన కవి కలం నుంచి వచ్చే మాటలకి తేడా ఉంటుంది. ఆ తేడా రసస్పర్శకు సంబంధించినది. దాన్ని తిరిగి మాటల్లోకి అనువదించి వర్ణించలేం. ఒక విధంగా చెప్పాలంటే నాస్తికుడైన కవి కలంలో తన్మయత్వం మిస్సవుతూ ఉంటుంది. తెలుగు కవితకు సంబంధించినంత వరకు దేవులపల్లి కారణజన్ముడు. ఆయన కవితలో వ్యర్థ పదాలుండవు. ఒక పదం ఒకసారి మాత్రమే కాకుండా మరోసారి, ఇంకోసారి మళ్ళీ మళ్ళీ వచ్చినా దానిక్కూడా ఓ సార్థకతతో కూడిన పరమార్థం ఉంటుంది. అందుకే ఆయన ఉలికి ఉలికి పడుతోంది అన్నా, ఎందుకో ఎందుకో అన్నా, చెట్టు చెట్టు అన్నా, ఊగి ఊగి పోతోంది అన్నా, శబరీ శబరీ అన్నా, నా కోసమే నాకోసమే అన్నా, నడచి నడచి నడచీ అన్నా, ఏదీ ఏదీ ఏదీ అన్నా అవన్నీ ఆయన హృదయాన్ని యథాతథంగా మోసుకొచ్చి శ్రోతల చేతిలో పెట్టేశాయి. మహారాజు అయిన రాముడు తన కన్న నిరుపేదలా అనిపిస్తున్నాడట శబరికి.... నిజానికి దేవులపల్లి తన పూర్వ జన్మలో శబరేమో.... లేకపోతే అంత గొప్ప వాక్యం ఎలా రాయగలడు!? అసలే ఆనదు చూపు ఆపై ఈ కన్నీరు, తీరా దయచేసిన నీరూపు తోచదయ్యయ్యో అని రాయడానికి హృదయం ఎన్నిసార్లు చెమ్మగిల్లిపోయి ఉండాలి!? పైగా ఇది మొదటిసారి కాదు.... 1950 ప్రాంతంలో 'భక్త శబరి' సినిమాలో 'రానై ఉన్నాడు', అనరాదా శ్రీరామ అని', 'ఏమి రామ కథ శబరీ శబరీ', 'నిన్ను చూచునందాక కన్నుల వెలుగుండేనా' వంటి పాటల ద్వారా భక్తిలోని పరాకాష్ఠతను పూర్తిగా అందించాక కూడా తిరిగి అదే కవితావస్తువుతో అంతకన్నా గొప్పగా లేదా సమానంగా అదే అనుభూతిని అందించాలంటే ఆ కవి కారణజన్ముడైతే తప్ప సాధ్యం కాదు. అందుకే ఈ పాట ఎప్పుడు విన్నా మనసున్న ప్రతి కంట్లోనూ శబరి ప్రవహిస్తుంది.

# శ్రీ కృష్ణుణ్ణి ఫస్ట్ రాక్‌స్టార్ అంటున్న







# వైదిక్ గ్రూప్

సంగీతం భారతీయుల జీవితంలో ఒక భాగం... ఆడుతూ పాడుతూ ఇంటి పనులు చేసుకోవడం దగ్గరినుంచి భగవంతుని కొలవడంలో కూడా మనం సంగీతాన్ని ఒదలం. త్యాగరాజు, పురందర దాసు, మీరాబాయి వీరంతా తమ సంగీతంతో భగవంతుని అర్చించారు. ఆరుగురు సభ్యులుగల ఓ రాక్‌స్టార్ బృందం సరిగ్గా దాన్నే కాస్త ఆధునీకరించారు. వీరు తమ బృందానికి 'వైదిక్ ఛాంట్' అని నామకరణం చేసారు. బెర్నార్డ్, గోపాల్, అనిరుధ్, సుహాస్, సిద్ధార్థ్, సామ్యూల్ అనే ఈ ఆరుగురు బృందంగా ఏర్పడ్డారు. వీరిలో బెర్నార్డ్ బాస్ ప్లేయర్, వోకలిస్ట్. సుహాస్, సిద్ధార్థ్‌లు కూడా గాత్ర సహకారం అందించే వారే. ఇక గోపాల్ డ్రమ్స్ ప్లే చేస్తే అనిరుద్ధ్ తబలా, ఢోల్ వాయిస్తాడు. సామ్యూల్ గిటారిస్ట్.

## పేరు వెనుక:

వేదాలు మన జీవితంలో అంతర్వాహినిలా కలిసిపోయాయి. ఉదయం మనం వినే సుప్రభాతం దగ్గరినుంచి దేవుణ్ణి స్తుతించే శ్లోకాల వరకూ అన్నింటిలోను వేదాల ప్రభావం ఎంతో ఉంది. అసలు ఉషోదయాన్ని సుప్రభాతంతో ఆరంభిస్తే ఆరోజంతా ప్రశాంతంగా గడిచిపోతుంది. దీన్ని దృష్టిలో పెట్టుకునే మా ట్రూప్‌కి 'వైదిక్ ఛాంట్' అని పేరు పెట్టడం జరిగిందని వివరించారు, ఈ రాక్‌స్టార్ బృందం.




## టైటిల్ ట్రాక్ గురించి

వైదిక్ ఛాంట్' అని పేరు పెట్టిన ఈ బృందం వారి టైటిల్ ట్రాక్‌ని మాత్రం 'క్యాహై యే జాదూ' అని పిలుస్తున్నారు. ఇది కొంచెం

పలికించవచ్చు. అయితే రాగం యొక్క అందం పాడవకుండా చూసుకోవాలి. అంతేకాదు జనానికి నచ్చుతుందా లేదా అనేది ఆలోచించాలి. వారికి నచ్చని సంగీతానికి భవిష్యత్తు ఉండదు" అంటాడు గోపాల్.....

## ఫస్ట్ రాక్‌స్టార్ కృష్ణుడు

ఫస్ట్ రాక్‌స్టార్ కృష్ణ భగవానుడు అని

పాడేవారు. సంగీతాన్ని సమకూర్చేవారు - ముగ్గురికీ అవగాహన ప్రధానం. వీరి మధ్య సమన్వయం లోపించినా, భాషా సమస్య ఏర్పడ్డా ఆ పాటలో జీవం ఉండదు. అందువల్లే ఇండీపాప్ ఆల్బమ్స్ సేల్స్ తక్కువగా ఉంటాయి. వీరు 'శుభా ముద్గల్' పాప్ ఆల్బమ్స్‌కి డిమాండ్ ఎక్కువని అభిప్రాయపడ్డారు.

పాప్ ఆల్బమ్స్ చేసేవారికి ఎప్పుడూ ఆదరణ ఉంటుంది. కొన్నాళ్ళు ఆల్బమ్స్ చేసి సెన్సేషన్ క్రియేట్ చేసి మధ్యలో గాప్ తీసుకున్నా ఫర్వాలేదు. అయితే రీ ఎంట్రీ ఆల్బమ్ మాత్రం సూపర్ హిట్ చేసుకోవాలి లేకపోతే అప్పటిదాకా ఉన్న ఇమేజ్ పోతుంది.

ప్రస్తుతం వీరు చేస్తున్న ప్రయోగం



అస్వాభావికంగా ఉందికదా అంటే వీళ్ళు ఒప్పుకోరు. వారెన్నుకున్న 'భైరవిరాగం' పండిట్ రవిశంకర్ వాయించినా, పండిట్ భీమ్‌సేన్ జోషి ఆలపించినా ఆ స్టయిల్ అలాగే ఉంటుంది. ఇది అస్వాభావికం కాదు కేవలం స్టయిల్లో మార్పంతే అన్నది వీరి అభిప్రాయం. ముఖ్యంగా డ్రమ్స్ ఉపయోగించడం వల్ల స్టయిల్లో మార్పొస్తుంది. బాస్‌డ్రమ్స్‌ని కొన్ని పాటలకే ఉపయోగించగలం. అన్నింటికి వాటిని వాడితే పాట అందం దెబ్బతింటుంది అన్నాడు బెర్నార్డ్. ఇతను ఈ ట్రూప్‌లో బాస్ ప్లేయర్. 'ఎబిసిడిలు అందరికీ వచ్చినా అవే అక్షరాలు కొందరి చేతిలో అద్భుత వాక్యాలుగా రూపుదిద్దుకుంటాయి. స్వరాలైనా అంతే.... సరిగమలనే ఎన్ని రకాలుగానైనా

మా అభిప్రాయం అన్నారీ బృందం. తన సంగీతంతో అందరిని అలరించిన కృష్ణ భగవానుడిని కొంచెం భిన్నంగా చూపాలన్నది తమ ప్రయత్నమని కూడా వీరు పేర్కొన్నారు.

బాస్, డ్రమ్స్ కలిపి ఇంతవరకు ఏ రాక్ గ్రూప్ మనదేశంలో ఉపయోగించక పోవడంతో మొదటిసారి వీరు ఆ ప్రయోగాన్ని చేపట్టారు. ఈ రెంటిని కలిపితే ఓ పెక్యులియర్ సౌండ్ వస్తుందని బెర్నార్డ్, గోపాల్ అంటున్నారు.

## మేం ఎందుకు చెయ్యకూడదు?

వీరి రాక్‌బ్యాండ్ కాకుండా ప్రస్తుతం మనదేశంలో 'యుఫోరియా', సిల్క్ రేట్' అనే రెండు బ్యాండ్స్ ఉన్నాయి. (ఈ రెండూ పాకిస్థాన్‌కి చెందినవే.) పాట రచయితలు,

పట్ల వారికి పూర్తి నమ్మకం ఉంది. ఎవరో విదేశాల నుంచి వచ్చి ఇక్కడి శ్లోకాలకు బీట్‌ని కూర్చి శ్లోకాలను ఉచ్చరించి కాసెట్స్ తయారు చేస్తుంటే ఇక్కడే పుట్టిన మేమెందుకు ఆ పని చేయకూడదని వీరి ప్రశ్న. జనం తమని ఆదరిస్తారన్న విశ్వాసం వీరికుంది. అంతేకాదు పాశ్చాత్యులు రూపొందించే వాటిల్లో ఉచ్చారణ లోపాలు ఎన్నో ఉంటున్నాయి. మన సంస్కృతిని అలాచేసే అధికారం వారికి లేదన్నది వీరి అభిప్రాయం

-మరి వీరెంత సక్సెస్ అవుతారో చూడాలి.

**-ఆదెళ్ళ శివకుమార్**

అలనాటి ఆణిముత్యాల
గురించి
నేటి తరానికి అనువైన
శైలిలో తెలిపే

క్లాసిక్ రీటోల్డ్

సాక్షి సంఘానికి ఓ ఉత్తరం చేరింది.

"నేను ఓసారి రైల్లో ఊరు వెళుతూ పుస్తకం చదువుకుంటున్నాను. దోమలు చెవి దగ్గర చేరి గాన కాలక్షేపం ఆరంభించాయి. నేను పడుకున్న పరుపును ఆశ్రయించి అభివృద్ధి చెందుతున్న నల్లులు తమ స్థానాన్ని ఆక్రమించినందుకు చెడామడా పొడవ సాగాయి. టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్న చిట్టెలుక ఒకటి 'నువ్వు ఈ సెంటర్ క్లాసుపెట్టెలో కూచోడానికి అర్హుడువి కావన్న'ట్టు చూస్తోంది. ఇక చదువుసాగదని పుస్తకం మూసి నిద్రపోయాను. నిద్రలో ఒక కల.

జంతువులకు రాని చలిజ్వరం మనిషికెందుకొస్తుంది!? అంటూ ధ్వజమెత్తిన

# దోమలు నల్లులు ఎలకల మహాసభ

సాక్షి



కవిశేఖర
పానుగంటి
లక్ష్మీనరసింహారావు

అదో పెద్ద మైదానం. నాలుగు భాగాలుగా విడగొట్టబడింది. ఒక భాగంలో లక్షలాది దోమలు వేర్వేరు గుంపులు ఉన్నాయి. అనేక జండాలు. జండాలమీద 'పాలకొల్లు మశకముల విడిది'. 'కొల్లేటి మశక రాజుల మహలు', 'అనెగొంది మశక సార్వభౌముల నికేతనం' అని వేర్వేరు గుంపులున్నాయి.

పక్కనున్న గుడారాలు చిట్టెలుకలవి. ఇంకో విడిదినిండా నల్లులు. సభా మధ్యప్రదేశంలోకి ఒక నల్లి ఎర్ర ముఖమల్ కోటు వేసుకుని వచ్చి దీర్ఘవాలుడనే మూషిక శిఖామణిని సభకు అధ్యక్షుడిగా ప్రపోజ్ చేసింది. వెంటనే బోదురు కప్పంత సైజులో ఉన్న కొల్లేటిదోమ వచ్చి ఆ ప్రతిపాదనను సెకండ్ చేసింది. గుప్పుమని ఒక్క పెట్టున దోమలన్నీ సంతోష సూచకంగా మొర పెట్టాయి. ఎలకలన్నీ తోకలు నేలమీదకొట్టి వాలతాళ ధ్వనులు చేశాయి.

అధ్యక్షుడుగా ఎన్నికయిన ఎలుక పెద్ద ఉపన్యాసం ఇవ్వడం మొదలుపెట్టింది. "నన్ను ఎన్నుకున్నందుకు దోమలకు, నల్లులకు థ్యాంక్స్. ఓ దోమలారా మీకున్న వ్యోమయాన శక్తి, కంఠస్వర మాధురీపాకము నాకులేదు. ఓ నల్లులారా మీలా శరీర సౌష్టవం, శత్రుహింసా పరాయణత నాకులేవు. అయినా నాకు ఈ పదవి ఇచ్చి సత్కరించారు.

మనకు ముఖ్య శత్రువు నరుడు. నరజాతి అంతటి తుచ్ఛజాతి ప్రపంచాన లేదు. తాను మహావీరుడని పోజు ఒకటి. తేలును చూస్తే భయం. జెర్రిని చూస్తే భయం. పాముని చూస్తే



పరుగు. దోమ కరిచిపోతుందేమోనని సాయంకాలానికి దోమతెర గుడారంలో దూరతాడు. నల్లి ఒక్కటి పొడిస్తే కల్లు తాగినవాడిలా తైతక్కలాడుతాడు. మనం చూడండి తుఫాను పట్టినా, అగ్నిపర్వతం పేలినా హాయిగా తిరుగుతాం.

వాడి బుద్ధి చూడండి. ఎలకలను చంపడానికి ఎన్ని మార్గాలు పడతాడో చూడండి. కర్ర బోనులు, లోపల మినుప రొట్టెలు. కత్తెర బోనులు. లోపల గారెముక్కలు. వాడి మాయమండ, ఎందుకీ దగాబాజీ? తిండి పేరు చెప్పి ఆశపెట్టి చంపుతున్నాడే. మన దోమసోదరులకు సామూహిక మరణం ప్రసాదించడానికి పౌడర్లు చల్లుతున్నాడే! ఇంత టక్కరి వేరెవరైనా ఉన్నారా?

వాడి విశ్వాస ఘాతుకత్వం చూడండి. మన సోదరులలో ఒక దోమను తీసుకోండి. ఒకసారి ఒక మనిషిని కరిచిందనుకోండి, మళ్ళీ ఎప్పుడైనా వదులుతుందా? బట్టతో విదిలించినా, చేతితో తోసేసినా, చెవులు మూసుకున్నా వెళ్లిపోతుందా? మంచో, చెడో మళ్లీ మళ్లీ అతన్నే కరుస్తూ అతని దగ్గరే పడివుంటుంది కానీ విశ్వాసం మరచిపోయి వెళ్లిపోదు.

అదే విధంగా నల్లులు. పాతదో, కొత్తదో ఓ తుంగచాపను గాని, ఓ కుర్చీనిగాని, మంచాన్ని గాని ఆశ్రయించుకుని ఉంటే హరీమనే వరకు దానిని వదిలిపెట్టవు కదా! దాని మీద పడుకున్న మనిషిరక్తం ఎంత కొద్దిగా తాగినా ఆ విశ్వాసం మరవదు. ఎండలో పెట్టి మోదినా, ఉడుకునీళ్లు పెట్టి తడిపినా, ఆ క్షణానికి అప్పటికప్పుడు చచ్చినట్టుపడి వుండి మర్నాటి కల్లా పదునెక్కి అతను చేసిన అకృత్యాలను లెక్కపెట్టకుండా అతన్నే ఆశ్రయించుకొని అంటకాగి ఉంటాయికానీ అవతలికి పోతాయా?

మాఎలుకల గురించి చెప్పాలంటే ఫలహారం బీరువాలోనో ధాన్యపు గాదెలోనో ఒకసారి దూరితే బయటపడడం ఉంటుందా? ఇంట్లో దాసీ చీపురు కట్టతో కొట్టినా, పిల్లాడు ఓ ముక్క ఉండ్రం ముక్క పెట్టినా కొట్టు,

# పానుగంటి లక్ష్మీ నరసింహారావు



(1865-1940)

నాటక రచయిత, వ్యాసకర్తగా, అన్నింటిని మించి హాస్య స్రష్టగా ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో ఒక విశిష్ట స్థానం సంపాదించుకున్న పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి జననం రాజమండ్రి దగ్గర సీతానగరంలో 11.2.1865న, విద్యాభ్యాసం సీతానగరంలోను, రాజమండ్రిలోను జరిగింది. బి.ఎ. వరకు చదువుకున్న తరువాత కొంతకాలం పెద్దాపురం హైస్కూలులో ఉపాధ్యాయుడుగా ఉండి ప్రైవేటు ట్యూటరుగా ఒకతనికి చదువు చెప్పారు. ఆయన వద్ద చదువుకున్న ఆ బాలుడు లక్ష్మీ నరసాపురం ఎస్టేటుకు దత్తుడుగా వెళ్ళగా ఈయన కూడా ఆ ఎస్టేటులో అసిస్టెంటు దివానుగా ప్రవేశించి, దివాను అయ్యారు. ఆయన అక్కడ ఉండగానే 'విష్ణునామ సహస్రమాల' అనే లఘు పద్యరచన చేసి, ఎస్టేటు జమీందారాణి రావు చెల్లయ్యమ్మా రావుకు అంకితంగా మరో పద్య ప్రబంధం వ్రాసే సంకల్పంలో ఉండగా, యాదృచ్ఛికంగా కాకినాడ నాటక సమాజంవారి నాటక ప్రదర్శనలు చూడటం తటస్థించింది. ఆ పైన ఆయన మనసు మార్చుకొని నాటక రచనకు ఉపక్రమించారు.

ఆయన మొదటి, రెండవ నాటకాలయిన 'నర్మదాపురుకుత్సీయము', 'సారంగధర' ఆయన లక్ష్మీనరసాపురం ఎస్టేటులో కొలువులో ఉండగా వ్రాసినవి. తరువాత అభిప్రాయ భేదాల వల్ల ఆయన అక్కడ ఉద్యోగం మానివేశారు. పిఠాపురంలో నివాసం ఉంటూ 1906లో కొత్తగా రాజ్యానికి వచ్చిన సూర్యారావుతో సన్నిహితత్వం పెంచుకొన్నారు. అయినా ఏడెనిమిది సంవత్సరాలు జరిగిన తరువాతగాని సూర్యారావు ఆయనను 'నాటకకర్తగా' తన ఆస్థానంలో నియమించలేదు. ఆమధ్య కాలంలో పానుగంటి ఉర్లాము సంస్థానంలో న్యాయ సలహాదారుడుగా, తరువాత అనెగొందిలో దివానుగానూ పనిచేశారు. తన మేనల్లుడు, అల్లుడు అయిన ద్రోణంరాజు వెంకటరమణారావు తణుకు నుంచి నడుపుతున్న 'సువర్ణ లేఖ' పత్రికతో సన్నిహిత సంబంధం పెట్టుకుని వ్యాసాలు, కథలు, ప్రహసనాలు వ్రాసి ఆ సంచికలలో ప్రచురించారు.

అందులోనే మొదటిసారిగా 'సాక్షి' వ్యాసాలు ప్రకటించటం జరిగింది. వెంకటరమణారావు పానుగంటివారి నాటకాలను కూడా గ్రంథమాలగా ప్రచురించారు. పిఠాపుర ప్రభువు పానుగంటివారిని ఆదరించటం ఆరంభించిన తరువాత ఆ గ్రంథమాల నిలిచిపోయింది. పానుగంటివారి రచనల నన్నింటిని సూర్యారావు పూర్తి ద్రవ్య సహాయం చేసి అచ్చువేయించారు.

ఆంధ్రపత్రికాధిపతి అయిన కాశీనాథుని నాగేశ్వరరావు కోరికపై 'సాక్షి' వ్యాసాలను పానుగంటి సారస్వత అనుబంధంలో మొదట 1920-22లోను, ఆ తరువాత రెండు పర్యాయాలను ప్రచురించారు. తన రచనల ద్వారా పానుగంటి విశేష ప్రసిద్ధిని, ద్రవ్యాన్ని కూడా అర్జించారు. అయినా చివరి రోజులలో తన పోషక ప్రభువుతో వచ్చిన వైరుధ్యం వలన, మొదటి నుంచీ డబ్బుకు లెక్కలేకుండా దర్జాగా జీవించిన కారణంగా, ఇక్కట్ల పాలయ్యారు. మతిస్థిమితం కూడా కోల్పోయారు. 1935లో పిఠాపుర ప్రజలు ఆయన సప్తత్యుత్సవాలు జరిపించారు. 1940 జనవరి 1 తెల్లవారు జామున ఆయన కాలధర్మం పొందారు.

పానుగంటి రచనలలో రూపక కృతులు పాదుకా పట్టాభిషేకము, విప్రనారాయణ, కంఠాభరణము. వచన రచనలు: సాక్షి(ఆరు సంపుటాలు), ప్రకీర్ణోపన్యాసములు, కథాలహరి.

భావస్పష్టత, వినూత్న శైలి, మనసు గిలిగింతలు పెట్టే హాస్యము, విషయ వైవిధ్యము వల్ల సాక్షి ఉపన్యాసాలు విశేష ప్రజాదరణ పొందాయి. ప్రక్రియ దృష్ట్యా నూతనత వెలార్చిన 'సాక్షి' సంపుటాలు పానుగంటి కీర్తికి ఉన్నత స్థితి కల్పించాయి.

అయినా, 'ఎడమచేతితో వ్రాసిన సాక్షి వ్యాసాలకంటే' తమ నాటకాలే తమ కీర్తిని చిరస్థాయి చేయగలవని లక్ష్మీనరసింహారావు అభిప్రాయపడ్డారు. నాటకరచనలో సైతం ఆయన ప్రౌఢమూ ప్రజారంజకము అయిన కొత్తశైలిని చూపారు. పానుగంటి స్వస్థాన, వేష, భాషాభిమాని. కందుకూరి వీరేశలింగం ప్రారంభించిన సమాజ సంస్కరణ మహోద్యమాన్ని కొనసాగించిన మహనీయులలో ఆయన ఒకరు.

పెట్టు సమానంగానే చూస్తాం కానీ కృతఘ్నత చూపుతామా? మరి మనిషి సంగతి... మహారాజు శాలువాలిచ్చినపుడు పుచ్చుకుంటాడా, ఒక్కమాట అంటేచాలు విడిచిపెట్టి పోతాడు.''

అలా అధ్యక్షోపన్యాసంలో, నరుల్ని తిట్టి పోసిన మూషిక శిఖామణి ప్రధానోపన్యాసానికి కీచురావు అనే దోమను పిలిచారు. దాని ఉపన్యాసం ఇలా సాగింది. "అధ్యక్షులు చెప్పినట్టు మనిషి భయస్తుడు, దుర్బుద్ధి, విశ్వాసఘాతకుడు మాత్రమేకాదు. పెద్ద తెలివైనవాడిలా పోజుకొడతాడు కూడా. సృష్టి మొదలులో ఉన్నది మనమా? వాడా? మనం పుట్టిన ఎన్నో తరాల తర్వాత పుట్టుకొచ్చాడు. మనను చూసి అనేక విద్యలు నేర్చుకున్నాడు. అసలు గానం ఎవరి దగ్గర నేర్చుకున్నాడు? మన దోమ సోదరుల వద్దనే కదా! 'ఏవియేషన్' అనేది ఇప్పుడు తనే కనిపెట్టినట్టు ఎగిరెగిరి పడుతున్నాడు. అది మా దోమల వద్దనుండి హరించిన కళ కాదా? భూమిని తవ్వే 'జియాలజీ' ఎవరివద్ద సంగ్రహించాడు? మా ఎలుకల వద్దకాదా? ధాన్యపు మరల్లో, ఇతర యంత్రాలలో పెట్టిన పళ్ల చక్రాల ఐడియా ఎలకలను చూసి కదా నేర్చుకున్నది! మేం కరిస్తే మలేరియా వస్తుందన్న కొత్త సిద్ధాంతం లేవదీసి మమ్మల్ని చంపడాన్ని సమర్థించు కుంటున్నాడు. సింహం మొదలు చీమ వరకు మా కాటుతినని జంతువుందా? వాటిన్నింటికి రాని చలి జ్వరం వీడికెలా వచ్చింది? పైగా అందరికీ రాలేదేం? వీళ్లలోనే విషజాతి ఏదైనా ఉందేమో! మాటవరసకి మనవల్ల అతనికి బోదకాలు వచ్చిందనే అనుకుందాం. మరి అతని రక్తం తాగడం వల్ల మనకు ఎన్ని వ్యాధులు వచ్చాయో తెలుసా?



నరరక్తం తాగడం వలన మా పుట్టి మునిగింది. ఆ రక్తంలో ఉన్న దోషాలు మాకు సంక్రమించాయి. మేం ఎప్పుడు వర్ణ భేదం ఎరగం. ఇప్పుడు ఇది ప్రారంభమయింది!? నల్ల దోమలట. ఎర్రదోమలట. ఎర్ర దోమలకంటె నల్ల దోమ లెక్కువట. మశక బ్రహ్మ మూతి మీసాల నుండి పుట్టినదొక జాతిట. రెక్కల నుండి ఒకజాతిట. ఇది సాపడిన పేడకడి అది తాకగూడదు. అది తాగిన మురికి నీరిది తాకకూడదు. దీనికంతా కారణం మానవరక్తం".

ఆ తర్వాత ఉపన్యాసం ఇచ్చినది మత్కుణ మహారాజ మంజులాచార్యుల వారు. "మాకు మనుష్య రక్తంతో కడుపు నింపుకోవడం కంటె తిండికి వేరే మార్గం లేదు. అందుచేత మనిషికి ఉండే అవగుణాలన్నీ మాలో సంపూర్ణంగా ఉన్నాయి. చేతల కంటె మాటలు ఎక్కువయ్యాయి. నల్లిజాతి అభివృద్ధి గురించి ఉపన్యాసాలు దంచుతున్నారు. కానీ ఆచరణ మాటేలేదు. నరుని రక్తం తాగకూడదని ఉపన్యసించేవారే అది త్రాగి త్రాగి అజీర్తి బాధ తెచ్చుకుంటున్నారు. మలేరియా, ప్లేగు పేరు చెప్పి దోమలను, ఎలుకలను చంపినట్టే కాలాహజారును మేము వ్యాపింప చేస్తున్నామని చెప్పి మమ్మల్ని చంపుతున్నాడు. అన్ని జాతి జంతువులను చంపి వీడొక్కడు ప్రపంచంలో ఏం చేయదలచు కున్నాడు?" అని అంటూండగానే తెల్లవార నారంభించింది.

దాంతో కలకలం! 'అమ్మో తెల్లవారితే నరుడులేస్తాడు. మన పని ఆఖరు. అదిగో నరుడు! పొండి పొండి పారిపొండి, ఎగిరిపొండి,.. ' అని అవి అరుస్తూండగానే నాకు మెలకువ వచ్చేసింది. కల కరిగిపోయింది.

లేచిచూస్తే ఒక ఎలుక నా కాలిపైకి ఎక్కింది. అమ్మయ్యో అని లేచిపోయి చూద్దును కదా, నేను చేరవలసిన ఊరు వచ్చేసింది.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

## సిద్ధాంతాలూ - రాద్ధాంతాలూ

**షాపింగ్**

బొమ్మలు: బాలి




నువ్వు డిస్కౌంట్ రేట్లో కొనుక్కుందామనుకున్నదేదీ డిస్కౌంట్ సేల్స్‌లో అమ్మరు.

-'గొప్ప తగ్గింపు ధరల మేళా' అనుభవజ్ఞుడు



నువ్వు కొనుక్కో గలిగినదేదీ నీకు నచ్చదు.

-షాపింగ్ చేసే భార్యపక్కనున్న భర్త గ్రహించే సత్యం

అందరికీ పట్టే 'ఫ్రీ' సైజు అన్నాడంటే, ఆ చొక్కా ఎవరికీ పట్టదని అర్థం అన్నమాట.



-కాలేజీ కుర్రవాడి తండ్రి అనుభవం

# 1-15, అక్టోబరు 2001 సంచికలో శ్రీ పరుచూరి గోపాలకృష్ణ రాసిన 'కుక్క విశ్వాసంగల జంతువు' కథకు వచ్చిన స్పందన



శ్రీలు పొంగే జీవగడ్డపై
పదాలను
రుచికరంగానూ,
చూయింగ్ గమ్ లానూ - స (గు)
రిపెట్టగల మాటల విలుకాడు
గోరంత పాళీతో
పొలిట్రిక్స్‌ను - ఇగో
లట్రిక్స్‌ను - కలిపి చుట్టచుట్టి
కృష్ణానదిలో పారేయగల, సినీరంగ తాండవ -కృ
ష్ణ ఆయన! అతడే పరుచూరి గోపాలకృష్ణ!!

శ్రీ పరుచూరి గారూ! నమస్సుమాలు!

"హాసం" పత్రికలో మీ కథ "కుక్క విశ్వాసము గల జంతువు" చదివిన తర్వాత గొప్ప కథను చదివిన అనుభూతిని మీతో నేరుగా పంచుకోనే ఆలోచనతో ఈ లేఖ. ఈ కథ ఎత్తుగడ నుండి ముగింపు వరకూ శిల్పం, శైలి రెండూ చక్కగా అమరాయి. కుక్క విశ్వాసము గల జంతువే!

అందుకే-

భార్యపట్ల విశ్వాసహీనంగా ప్రవర్తించిన సుబ్రహ్మణ్యాన్ని పీక పట్టుకు గుంజి మరీ చంపింది. రూపవతియైన మహాలక్ష్మి భర్త తనని నిర్లక్ష్యం చేసి తాగుడుకు బానిసయినా భరించింది. తనకు అసహ్యం అయిన కుక్కని తెచ్చి పెంచమన్నా, దానిని అతనికోసం కన్నబిడ్డలా సాకింది.చివరికి ఆ కుక్కనే భర్త చంపబోతే, తనని అతను చావ చితక్కొడుతున్నప్పుడు సైతం ఎప్పుడూ ఎదురు తిరగని ఆమె ఆ కుక్కను రక్షించడం కోసం ఎదురు తిరిగింది.

ఇహ - సుబ్రహ్మణ్యం అతనికి భార్యా, కుక్కా ఇద్దరూ ఒకటే! అసలు ప్రతి భర్తా భార్యను మించిన విశ్వాసము గల జంతువు సృష్టిలో లేదనుకుంటాడు. భార్య 'వంటి'ని కాపలా కాసేదయితే, కుక్క 'ఇంటి'ని కాపలా కాసేదన్నమాట!ఒక రకంగా సుబ్రహ్మణ్యం మృగజాతి మగ అహంకారానికి మోడల్! ఆ ఇంట్లో విశ్వాసానికి ప్రతీకలయిన ఆ ఇద్దరూ సుబ్రహ్మణ్యం చావుతో వేధింపుల్నుంచి బయట పడ్డారు. ఎంతగా అణగద్రొక్కబడి ఉన్నారో, అంతలా తిరగబడ్డారిద్దరూ. ఏ జాతిలోనయినా ఇది సహజ పరిణామం.

అదే జరిగింది. తనని హింసించినా భరించిన భార్య, కుక్కను కూడా (కన్నబిడ్డలా సాకి పెంచిన ప్రేమతో) హింసించడం చూసి, సహించలేక పోయింది. తనని రోకలిబండతో కొడుతున్నా ప్రాణభయంతో గిజగిజలాడి, నేలమీదపడి జాలిగా మూల్గిన కుక్క, తనని పెంచిన (సాక్షాత్తూ కన్న తల్లిలా) మహాలక్ష్మి నెత్తిమీద రోకలి బండతో సుబ్రహ్మణ్యం బాదడం సహించలేక పోయింది. ఏకంగా తిరగబడి తల తెంచేసింది. కుక్క ఈ (మీ) కథలో విశ్వాసము గల జంతువే కాదు. వివేచన కలిగిన జంతువు కూడా!

మీరు కథను ప్రారంభిస్తూ, అడవిలో, అందమైన ఫారెస్టు గెస్ట్ హౌస్ ప్రాంతంలో అద్దం పెట్టి 'ఇప్పుడు మీరు అతి ప్రమాదకరమైన జంతువును చూడబోతున్నారు' అని రాసిపెట్టి, మీరా అద్దంలో చూసుకొనే (కనబడే) 'మనిషే' ప్రపంచంలో అతి భయంకరమైన జంతువని తేల్చి చెప్పారు! గొప్ప ప్రారంభానికి గొప్ప ముగింపు! నవ్వించడమే కాదు, కదిలించిందీ కథ. అయ్యా! పరుచూరి వారూ! మీరు సినిమాల్లోకెళ్లి మాలాంటి వందలు, వేలాది కథకుల్ని బ్రతికించారు! మీరే తరుచూ (ఇలా అకేషనల్‌గా కాక) కథ(లా)స్తూ వుంటే- మా పని ఇంతే సంగతులు!! అయినా - మీరు తరుచూ కథల్రాసి అలరించాలనే కోరుకుంటున్నాను!! మీకు, మీచే రాయించిన 'హాసా'నికి, ఈ అవకాశం కలిగించిన మీ కథలోని గొప్ప భావానికి, నా అనుభూతిని ఆస్వాదిస్తున్న మీకు.... శతధా ధన్యవాదాలు! అభినందన మందారాలు!!

**యన్.కె.నాగేశ్వరరావు,**
**శ్రీ సాయిబాబా టెంపుల్ దగ్గర**
**పెనుగొండ - 534 320**

మీరు హాసం పత్రికకు గాను వ్రాసిన "కుక్క విశ్వాసము గల జంతువు" అనే హాస్య కథానికను చదివాను. మీరు మీ బ్రాండ్‌ను కొంత సేపు ప్రక్కన పెట్టి 'హాసం' ప్రపంచంలో విహరించటం చాలా సంతోషం. ఈ మార్గంలో మీరు ఇంకా హాస్యకథలను వెలువరించవలసినదిగా ప్రార్థన.

**టి.నరసింహారావు, ఖమ్మం.**

నా పేరు పద్మావతి. వయస్సు 20 సం॥ నా పెళ్ళయి 4వ సం॥ ఒక బాబు 2 సం॥ మాది తెనాలి. మీరు 'హాసం'లో వ్రాసిన 'కుక్క విశ్వాసం గల జంతువు' అనే కథని చదివినాను. నాకు అందులో నాకు చివరికి తన యజమానురాలిని గుర్చి చేసిన పని నాకు ఎంతగానో నచ్చింది. నాకు తల్లీ తండ్రి వాళ్ళు లేరు. చనిపోయారు. బాబాయి వాళ్ళు పెంచారు. నేను వారిలో తల్లిని తండ్రిని చూసుకోవాలని అనుకున్నాను. మిమ్ములను గురువుగా భావిస్తూ వున్నాను. నా సమస్య మా పిన్ని! నిత్యం బాధపడుతూనే ఉంది. ఆమె భర్త ఒక శాడిస్టు. ఆమెను వదిలిపోడు. సవ్యంగా ఉండడు. ఆమెను అనుక్షణం ఏదో రకంగా బాధిస్తూ ఉంటాడు. ఎలా పిన్నికి బోధించాలి. ఆ వ్యక్తికి ఎలా సమాధానం చెప్పాలి? చెప్పగలరు. మా ఇంటిలో వ్యక్తుల వలన నా అడ్రసు ఇవ్వటం లేదు. నా స్నేహితురాలి అడ్రసు ఇస్తున్నాను.

**పద్మావతి, హైదరాబాదు.**

'చేతిలో సుత్తి ఉంటే కనబడే ప్రతి వస్తువు మేకులాగే ఉంటుంది. ' నిజమే.... కలం చేతిలో ఉన్న రచయితకి ఏ వస్తువు నైనా కథగా మలచగలిగే చక్కని నేర్పు ఉంటుంది. ఈ కథలో కూడా మీరిచ్చిన ముగింపు బాగుంది. కుక్క విశ్వాసం గల జంతువు... దాని విశ్వాసతని అది చాటుతుంది. ఆ పాటి దయ, కరుణ కట్టుకున్న భర్తలో లేకపోవడం మహాలక్ష్మి పాత్ర ద్వారా చూపారు. ఇలాంటి మహాలక్ష్మిలు ఏరులా ఆల్కాహాలు పారే ఆంధ్రాలో గడపకొకరున్నారు. 'నిప్పు నీ కాలికిందే ఉంది. నింగివైపు చూడడం మెందుకు... సమస్యకు మూల కారణం నీవే.... పరిష్కారం ఎక్కడో ఉందనుకుంటే ఎలా?" అన్నట్లు ఆల్కాహాలికులకు జ్ఞానోదయం కలినప్పుడే మహాలక్ష్మిలు నిండు ముత్తయిదువల్లా ఉంటారు. డబుల్ స్టేట్‌మెంట్లిచ్చే నాయకులు ఎవరికి వారే 'నిషేధిస్తాం సారా' అంటూ, తమ పరిపాలనల్లో తిరిగి పెడుతున్నారు.... 'కుక్కవిశ్వాసం గల జంతువు' అనే కథ ద్వారా కొందరు ఆల్కాహాలికులలోనైనా మార్పురావాలని ఆశిద్దాం.

కథలో చాలాచోట్ల 'పతివ్రత'ల ప్రస్తావన ఉంది... అప్రస్తుతమేమో కదండీ....

**- కె.వి.మధుసూదనరావు, కాకినాడ**

కావ్యాలలో నాటకం, నాటకాలలో శాకుంతలం, శాకుంతలంలో నాల్గవ అంకం, ఆ నాల్గవ అంకంల్లో నాలుగు శ్లోకాలు గొప్పవని అంటారు. అదే మాటను కోట్ చేస్తూ తనకొచ్చిన ఉత్తరాలలో పైన ప్రచురించిన ఈ నాలుగు బావున్నాయనీ, అందులో పెనుగొండ నుంచి యన్.కె. నాగేశ్వరరావు రాసిన ఉత్తరం బహుమతికి అర్హమైన దని తెలిపారు పరుచూరి గోపాలకృష్ణ.

ప్రకటించిన ప్రకారం బహుమతి గ్రహీతకు 6 నెలలపాటు 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతున్నాం. తక్కిన ముగ్గురికీ 'హాసం' 1-15 నవంబరు, 2001 సంచికను సముచితంగా పంపుతున్నాము. - ఎడిటర్

# బండా అటకెక్కటం



"ఆ బీరువా తాళం చెవి ఎక్కడుంది?" అని ఏదో మామూలుగా అడిగినట్లు అడిగాడు బండూ. ఆ ప్రశ్న వేస్తున్నప్పుడు తన ముఖంలో భావం అతి అమాయకంగా కనపడేట్టు జాగ్రత్త పడ్డాడు.

"ఎందుకేం, మీకా తాళం చెవి?" అని ఎదురుప్రశ్న వేసింది లత. మొగుడి ముఖం మీద అతి అమాయకపు ముద్ర చూడగానే తనకి అనుమానం వేసింది.



అడుగుతూనే "ఇప్పుడు మళ్ళా డబ్బెందుకు మీకు? నిన్ననేగా బోల్డంత తీసుకు వెళ్ళారు నా దగ్గరనుంచి?" అని, అంత వరకు గుప్తంగా ఉన్న అతని ఉద్దేశ్యాలమీద బురఖా పీకి వేసింది.

"అయితే ఏమిటి నువ్వనేది? నేను గొడుగుకూడా కొనుక్కో కూడదా ఏమిటి? ఇహ రేపటినుంచి గుడ్డలు కూడా కుట్టించుకో వద్దంటావు గాబోలు! చిరిగినవే వేసుకుని ఆఫీసుకి పొమ్మంటావా ఏమిటి?" అంటూ ఒక్కసారిగా పెద్దస్థాయిలో గందరగోళం చేస్తూ వుపన్యాసం దంచేశాడు బండూ.

"అయినా మీకీ మధ్య సిగరెట్లు మహా యెక్కువయాయి. ముందర అది తగ్గించేస్తాను." అంటూ స్త్రీ సహజమైన చాతుర్యంతో సంభాషణని తన యిష్టం వచ్చిన వేపు మళ్ళించేసింది లత.

"ఊ, ముందర ఓ వంద రూపాయి లిట్లా పడెయ్యి. నీ పోరు నాకనవసరం" అని బండూ అతి ధైర్యంగా అసలు విషయంలోకి వచ్చాడు.

"గొడుగు కొత్తదేం కొనక్కర్లేదు. మీరు క్రిందటి సంవత్సరం కొన్న గొడుగు ఉందింట్లో" అని లత కూడా అంతటి ఖరాఖండీగానూ జవాబు చెప్పింది.

"ఎక్కడుందా గొడుగు?" అంటూ తలెత్తి దూలాలు, వాసాలూ పరీక్ష చేస్తూ ప్రశ్నించాడు బండూ, తన గొడుగు ప్రతి సంవత్సరమూ మాయమై పోతూంటుందని అతనికో నమ్మకం.

"నేను దాన్ని ఒక గుడ్డలో చుట్టి జాగ్రత్తగా అటకమీద దాచాను" అంది ఆ యిల్లాలు.

"ఎప్పటి గొడుగదీ? ఆ పిడి విరిగిపోయిన గొడుగా ఏమిటి? అది నే చచ్చినా వాడను సుమా! నాకు మాత్రం కాస్త డిగ్నిటీ అంటూ ఉండాలా అక్కర్లేదా?"

"ఆ పిడి విరిగిపోయినది, ముందటేటిది. అది మీ రెండో గొడుగు, యిప్పుడు నేను అటకమీద జాగ్రత్త చేసినది. మీ అయిదవ గొడుగులెండి" అంటూ కేవలం తల పంకించినందువల్ల భర్తని తబ్బిబ్బు పెట్టడం ఎలాగో ప్రదర్శించింది లత.

"సరే అయితే, ఉంటే చూపించోసారి, నాకేదయితేనేం గొడుగు వుంటే చాలు" అని చాలా నిష్కామిలాగా మాట్లాడాడు బండూ. ఆ గొడుగుని ఈపాటికి బొద్దింకలు కొట్టేసే వుంటాయని మనసులో మాత్రం గట్టి నమ్మకమే వుంది.

మరుక్షణంలో ఒక స్టూలు తీసుకు వచ్చి, అటక క్రింద పెట్టింది లత.

"దీని మీంచి అటకమీదకెలా ఎక్కటం? ఇంకేదయినా బాగా ఎత్తుగా ఉన్నది వుండాలి" అని అభ్యంతరం లేవదీశాడు బండూ.

"మన పనివాడు రాముడు దీనిమీంచి అటకమీదికెక్కేస్తాడు. ఇట్లా పట్టుకుని, యిలా వేళ్ళాడుతాడు మొదట. ఆ తర్వాత గబుక్కున ఒక పాదం ఇలావేసి, అటకమీదికి తీసుకెళ్ళిపోతాడు". లత యిదంతా యాక్షను చేసి చూపించింది. ఆపని ఎంతో సులభమయినట్లు కూడా ముఖభావం ద్వారా సూచించింది.

బండూ ఆవిడవేపు అమిత సంశయంతో ఓసారి చూశాడు. కాని అంతట్లో అతని ధైర్యం నిద్ర లేచింది. అంచేత స్టూలుమీద నుంచుని అటక అంచు పట్టుకున్నాడు.

"ఆ. అంతే! ఈసారి అలా వేళ్ళాడుతూనే, శరీరం పైకి గుంజుకోండి. యింకా బాగా నడుంవరకూ వెళ్ళిపోవచ్చండీ" అని లత మంచి హుషారుగా ప్రోత్సహిస్తోంది.

బండూ క్రింద వున్న స్టూలు ప్రక్కకి లాగిపారేసి, తనే అక్కడ నుంచుని చేతులు త్రిప్పుతూ బండూకి సలహాలు చెబుతోంది. కానీ ఎంత ప్రయత్నించినా బండూ తన శరీరాన్ని అంతపైకి లాగలేక పోయాడు. ఎంతో ముక్కి మూలిగిన తర్వాత అటక అంచు దగ్గరకి గడ్డం వచ్చేవరకే లేవగలిగాడు.

"ఇంకాపైకి-యింకాపైకి వెళ్ళవచ్చు" లతకి ఉత్సాహం యెక్కువయింది. తను పమిట చెంగు దోపుకుని, తన చేత్తో బండూ అరికాళ్ళకి ఊతం యివ్వడం ఆరంభించింది.

"ఖి కి" - కిచకిచలు ఏర్పడటం వల్ల, బండూ కాళ్ళు గట్టిగా విదిలించుకున్నాడు. అంచేత రెండున్నర అడుగులు పైకి ప్రయాణం చేసిన బండూ గడ్డం రెండుం బావు అడుగులు క్రిందికి జారి వూరుకుంది.

"ఇ శ్ శ్ శ్ శ్శు - అదేమిటండీ మీరు? ఏమంత కష్టం? వొక కాలు యిట్లా వేసెయ్యడం. ఆతర్వాత వొక్కవూపులో పైకి వెళ్ళిపోవడమూను" అని అక్కడవున్న స్టూలే అటక అనుకుని యెక్కి చూపించింది.

బండూ మళ్ళీ తన శక్తినంతటినీ ఉపయోగించి గడ్డం అటక అంచువరకూ వచ్చేలాగా లేచాడు.

"ఆఁ ఆఁ అంతే యింకొంచెం పైకి" అంటూ లత కేకలు వేసింది. బండూ అరికాలికి మళ్ళీ ఊతం యివ్వడానికి ఆరంభించింది.

అప్పుడే వచ్చింది పక్కింటి రాధమ్మగారు. అతి వాగుడుతో బాటు అరువులడిగే దుర్గుణం కూడా ఉందావిడకి. గుమ్మంలో నుండి "అమ్మాయ్

"లతా...." అనబోయి, లత 'పైకి, పైకి' అంటూ వేస్తున్న కేకలు విని ఏం జరుగుతుందో చూద్దామన్న కుతూహలంతో లోపలి గదిలోకి వచ్చేసింది. వచ్చి చూస్తే అప్పుడే అటకపట్టుకు వేళ్ళాడుతున్న బండూ కనిపించాడు. అంచేత ఆశ్చర్యంతో అలాగే నుంచుండి పోయింది.



ఆ సమయంలో మళ్ళీ కితకితలు ఆరంభమయినందువల్ల బండూ బిగ పట్టిన శ్వాస కొంచెం వదిలి, "నా అరికాళ్ళు ముట్టుకోకు, వదిలిపెట్టు'' అని భార్యను హెచ్చరించాడు. అంచేత ఊతం యివ్వడం మానేసి ఆమె ఒక పక్కకు తప్పుకుంది. రాధమ్మ మాత్రం ఇహముందు ఏం జరుగుతుందో తెలియక అక్కడే నుంచుంది.

బండూ శరీరాన్ని ఒక్కసారి గుంజుకుని, ఒక కాలు విసురుగా అటక మీదికి వేసే ప్రయత్నం చేశాడు. నిజానికి అతను కూడా తను త్రికరణ శుద్ధిగా అటక ఎక్కడానికి ప్రయత్నిస్తున్నట్లు భార్యని నమ్మించటం కోసమే అలా కాలు విసిరాడు. అటక మీదికి ఎలాగూ కాలు విసరలేనని అనుకున్నాడేగాని, అలా విసురుగా ఊపిన కాలికి మధ్యలోనే ఏదో తగుల్తుందని కాని, అంచేత తను అడ్డదిడ్డంగా చేతులు పట్టుదప్పిపోయి క్రింద పడిపోతానని గాని అనుకోలేదు.

బండూ నేలమీద కుప్ప కూలిపోగానే వంటింట్లో గోడబల్లమీద నున్న యిత్తడి సామానంతా భూకంపం వచ్చినట్లు గడగడ లాడిపోయింది. అటూ ఇటూ చెల్లాచెదురుగా పరుచుకుపోయిన అవయవాలన్నిటినీ పోగుచేసుకుని. బండూ లేచి కూచోగానే అతనికి కనిపించిన దృశ్యం - రాధమ్మ తన రెండు దవడలు గట్టిగా నొక్కుకుంటూ ఆ గదిలోంచి పారిపోతూండటం! "ఇదేమిటి?" అనే అర్థంతో అతను భార్య కేసి చూస్తే అక్కడకనిపించిన దృశ్యం ఆమె పమిట చెరగు అడ్డం పెట్టుకుని నవ్వుతూండడం! కోపం తెచ్చుకుని మందలించబోతూంటే ఆమె వచ్చి బండూని భుజం పట్టుకుని, కుదుపుతూ "ఏమండోయ్, మీరావిడని బ్రహ్మాండమయిన తాపు తన్నారు. పాపం!" అంది.

"ఏమిటీ, ఆవిడకి నా కాలు తగిలిందా?"

ఆ తర్వాత బండూకి కూడా నవ్వు ఆగలేదు. తను క్రిందపడ్డ సంగతి కూడా మరచిపోయాడు. తనకు తగిలిన దెబ్బలు కూడా నొప్పెట్టలేదు. ఎంచేతంటే అతనికి బ్రహ్మానందం కలిగింది. అసలు ఎన్నాళ్ళనుంచో ఆ అధికప్రసంగపు యిల్లాలికి యిటువంటి శాస్తి ఏదయినా చేయాలని బండూకి మనసులో ఒక కోరిక వుండేది.

ఆఖరికి నవ్వు ఆగిన తర్వాత వళ్ళంతా వంకర టింకరలు తిప్పుతూ లేచినిలబడి, "పద యిప్పుడు కాస్త విశ్రాంతి తీసుకుందాం" అన్నాడు.

లత జంకుతూ "యింతకీ గొడుగు తియ్యనేలేదు, అటకమీంచి" అంది అసలు విషయాన్ని జలగలా పట్టుకుని.

ఇది వరకైతే ఈ విషయాన్ని ఎత్తితే చీదరించుకునేవాడేగాని, ఇప్పుడు తన మనసులో చాలాకాలం నుంచీ వున్న కోరిక తీరినందువల్ల మెత్తపడ్డాడు. అయినా కనుబొమలు మాత్రం కొంచెం ముడిపెట్టి, "ఇదిగో, యిటు చూడు, కాలి క్రిందకి ఏదయినా బాగా ఎత్తుగా ఉన్నది వేస్తేగాని, ఆ అటక ఎక్కే ప్రయత్నం మళ్ళీ చెయ్యను." అని ఖచ్చితంగా చెప్పేశాడు.

"అయితే స్టూలు మీద కుర్చీ పెట్టనా ఏమిటి?'' అంది లత ఎంతో ఉత్సాహంగా.

"కుర్చీ దాని మీద నిలుస్తుందో లేదో అసలు'' అని బండూ అంటూ వున్నా, లత చక చక నడుస్తూ, కుర్చీ తెచ్చి స్టూలుమీద పెట్టింది. ఆ తర్వాత బండూ వేపు చూస్తూ "కుర్చీవి రెండు కాళ్ళు పూర్తిగా ఆనుతాయి బల్లమీద'' అని ధైర్యం చెప్పింది.

"అయితే ఎట్లా మరి? అంతకంటే, హాయిగా కొత్త గొడుగు కొనుక్కోవడమే నయం! వెధవ వంద రూపాయలు ఏం లెక్క మనకి?''

"మిగిలిన ఆ రెండు కాళ్ళూ నేను పట్టుకుంటాలెండి."

"ఏమీ ఒద్దులే'' అని ఖరాఖండిగా చెప్పేశాడు. ఎన్నడూ లేనంత ఖచ్చితంగా చెప్పాడు కదా అని ఆవిడ కూడా ఆ విషయం వదిలేసింది. ఒక్క క్షణం ఆగి, తన జలగ ప్రవృత్తిని అనుసరిస్తూ "పోనీ ఆ కుర్చీ మీద స్టూలు పెట్టనా?'' అంది.

"కుర్చీ మీద స్టూలు పెడతావూ? బుద్ధిలేదా ఏమిటి నీకు? కుర్చీ విరిగిపోదూ?'' అని గట్టిగా కసిరేశాడు. అసలు తన ఉద్దేశం కొత్త గొడుగు కొనుక్కోవటమన్న విషయం ఇప్పటికి జ్ఞాపకం వచ్చింది.

" అయితే కుర్చీ చేతుల మీద ఒక పీట పెట్టి దాని మీద స్టూలు పెడితేనేం పోనీ"

బండూ యీ కొత్త యింజనీరింగ్ అర్థం చేసుకోటానికి ప్రయత్నం చేశాడు. "ఏమిటీ పీటమీద స్టూలు పెట్టి! దానిమీద కుర్చీయా?''

"కాదండి, ఈ కుర్చీ చేతులమీద పెద్దపీట పెట్టి, దానిమీద స్టూలు పెడదాం'' అని స్పష్ట పరచబోయింది లత.

ఒక్క నిమిషం సేపు కళ్ళుమూసుకుని, బండూ ఆ దృశ్యం ఊహించుకున్నాడు. ఆ తర్వాత అతి అనుమానంగా "ఇవన్నీ పట్టుకునేదెవరు?'' అని అడిగాడు.

"నేను పట్టుకుంటానండి'' అంది లత అమితోత్సాహంతో.

"నో'' అని ఖండితంగా చెప్పేశాక, లత ముఖం చిన్నపోవటం చూసి బండూకి కాస్త తృప్తి కలిగింది. ఆమెకు యిప్పుడే కాస్త శృంగభంగం చెయ్యాలనే సంకల్పం కలిగింది. అంచేత "నువ్వీ హంగామా అంతా చేసే బదులు ఆ కుర్చీమీదనే స్టూలు పెట్టకూడదూ? మధ్యన ఆ పీట ఎందుకు మళ్ళీ? హ హ, తెలివయిన దానివే మొత్తానికి?'' అని ఎగతాళి చేశాడు.

"అదేమిటండీ, నేను మొదట్లో అట్లాగే చెప్పాను కదా, మీరే కదూ అలా పెడితే కుర్చీ విరిగిపోతుందన్నారు!?''

"నువ్వు ఉన్నవీ లేనివీ నేనే అన్నానంటున్నావేమిటి? కుర్చీ ఎందుకు విరిగిపోతుంది? మాంచి బలమయిన కుర్చీ అది. హోహోహో'' అంటూ ఒక్క అరక్షణంలో కుర్చీమీద స్టూలు పెట్టేసి, చకచక అటకమీద కెక్కిపోయాడు కూడాను.

ఆ తర్వాత పెద్ద సర్కసు ఫీటు చేసినవాడిలాగ నడుంమీద చేయి పెట్టుకుని, నిటార్గా నుంచోబోయాడు, కాని సరంబీ తలకి తగిలి నడుము దగ్గిర వంగినవాడు వంగినట్టుగానే తొక్కుడు హార్మోనియంలాగా అటకమీద కూలబడిపోయాడు.

కొంచెం సేపయ్యాక వంట్లో నొప్పులు తగ్గి, కళ్ళు కూడా అక్కడి చీకటికి అలవాటు పడ్డాక, ఆ అటక మీద తనకు అత్యంత ప్రియమైన వస్తువులు చాలా వున్నట్లు కనపడ్డాయి.

"అరె, మన టెన్నిస్ బూట్లు వున్నాయే యిక్కడ! ఇంకేం? రేపటి నుంచి మళ్ళీ రన్నింగు మొదలుపెట్టవచ్చు". అంటూ బూట్లు క్రింద పడేశాడు.

"అవెందుకండీ అనవసరంగా" అని లత కేకవేసింది పైకి వినబడేట్టు.

కాని ఆలోచనగా బండూ తన ఛెస్టుఎక్స్పాండరు కూడా క్రిందికి పడేశాడు. తన టెన్నిసు రాకెట్ బాగుచేయించే సంకల్పం పైకి చెబుతూ అదీ క్రిందకు జార్చాడు. అంతట్లో కరేలా కనుపించింది. చిన్నతనంలో దాంతో ఎన్నెన్ని వీరకృత్యాలు చేసాడో జ్ఞాపకం వచ్చింది. అందుచేత ఇకమీదట యిరుగు పొరుగు కుర్రాళ్ళని పోగు చేసి ప్రతిరోజు వాళ్ళకి కరేలా త్రిప్పటం నేర్పే ఉద్దేశంతో ఆ కరేలా కూడా క్రింద పడేశాడు. అది లత పాదాలకి ఒక్క పావంగుళం పక్కగా పడింది.

ఆ తర్వాత క్రికెట్ బ్యాటు చేత్తో పుచ్చుకుని "సిక్సర్" కొట్టే విధానమేమిటో అటక మీదనుంచే లతకి చూపించబోయాడు. అంచేత వేళ్ళాడుతున్న ఎలక్రిక్ బల్బు ఊగడం మొదలు పెట్టింది. అది చూచి బల్బు పాడయిపోయిందేమోనని భయపడి. లత ఒకసారి స్విచ్‌వేసి లైటు వెలిగాక ఊరడిల్లింది. కాని అతి ఆదుర్దాగా అతనిని మందలించటం మొదలు పెట్టింది.

"ఏమిటండీ ఇలా ఆరంభించారూ, ఆ పాత వస్తువులన్నీ ఎందుకు దిగుమతి చేస్తున్నారు? ఇప్పటికే క్రింద కావలసినంత చెత్తవుంది, ఇంటి నిండా. అది చాలదూ?"

కాని, బండూకి యిప్పుడు ఉత్సాహం అపరిమితంగా వృద్ధయిపోయింది. పెళ్ళిచేసుకోక ముందు, తన జీవితం ఎంత హాయిగా, స్వతంత్రంగా ఉండేదో జ్ఞాపకం వచ్చింది. అంచేత అప్పటి ప్రతి వస్తువు క్రిందికి గిరవాటు వేయడం సాగించాడు. ఆఖరికి అతనికి కాలేజీలో ఉన్నప్పుడు కొనుక్కున్న పాఠ్య పుస్తకాలు కనిపించాయి. దుమ్మూ అదీ దులిపి వాటిని పొట్టకి హత్తుకుంటూ "ఈ పుస్తకాలు అసలు అటకమీది కెవరెక్కించారు? యేమిటనుకున్నా రివి... లిటరేచర్! క్లాసిక్సు యివన్నీ! వాటిని తీసుకొచ్చి యిలా దుమ్ములో పారేస్తావూ? మనదేశం యింతటి అధోగతికి ఉత్తపుణ్యానికి దిగజారిపోయిందా? ఏ దేశంలో షెల్లీపద్యాలు మూషికమూత్రంలో నాని పసుపుపచ్చగా అయిపోతాయో, అటువంటి దేశం యింకేమవుతుంది?

"నాబుద్ధే గడ్డితిన్నది, మళ్ళీ నా బొందిలో ప్రాణం వుండగా మిమ్మల్ని అటకెక్కించను: ఇప్పటిమటుకు మిమ్మల్ని కరుణించి ఈ తుక్కువస్తువులన్నీ పైన పారేసి దిగిరండి. మీరా గొడుగు తియ్యకపోయినా మాబాగే" అంది లత చెంపలు వాయించుకుంటూ.

"నువ్విపుడేం మాట్లాడకసలు! ఆహా ఈ మేఘదూతం ఇదిగో, అక్కడే వుండు, అసలు ఈ మహాకావ్యంలో వున్న ఉత్కృష్టత ఏమిటో చెబుతాను నీకు" అని అంటూ బండూ అటకమీద పురాణం చెప్పే పోజులో కూచున్నాడు. ఆ పుస్తకంమీద దుమ్ము మళ్ళీ ఓసారి దులిపాడు. అందులో పేజీలు తిరగేసి "తన్వీశ్యామా" అన్న శ్లోకం గొణగటం మొదలు పెట్టాడు.

"చాలించండి బాబూ! చాలించండింక! క్రిందికి దిగండి దిగుతారా లేరా?" అంటూ లత క్రిందనున్న టెన్నిసు బూటు ఒకటి పైకి విసిరేసింది. కాని, కొన్నాళ్ళు క్రికెట్ ఆడినవాడు గనుక, బండూ ఆ బూట్‌ని సునాయాసంగా "క్యాచ్" పట్టుకుని. "తన్వీ... యేమనుకున్నావు తన్వీ...?!" అని ఉగ్గడిస్తూ, తన వాక్యంలో వున్న వుద్రేకాన్ని స్పష్టం చేసేందుకు ఆ టెన్నిస్ బూట్‌ని జోరుగా క్రిందికి విసిరేశాడు.

"తన్వీ! ఆహా యెంత మధురమయిన శబ్దం! తన్వీ అంటే ఏమిటి? తన్వీ అంటే బక్కపల్చగా, సన్నగా ఉన్న వనిత! నువ్వు పెళ్ళికిముందు ఉన్నట్లు యెముకలపోగూ కాదు, యిప్పుడు ఉన్నట్లు ఉంద్రంముక్కా కాదు, అదీ! విన్నావా?"

ఇక అతన్ని నవుదాయించే ఆశ వదులుకొని, చెవుల్లో వేళ్ళు పెట్టుకుని, అవతలి గదిలోకి వెళ్ళిపోయింది లత.

బండూ అలాగే అటకమీద కూచుని తనలో తానే ఆనందించాడు. ఆతర్వాత ఏమేమిటో గొణుక్కుంటూ ఆ పుస్తకాన్ని పొట్టకి ఆన్చుకుని, క్రిందికి దిగాడు.

కాలికి తగిలిన కరేలాని వొక ప్రక్కకి దొర్లిస్తూ, "ఏం కొంపరా బాబూ! యెక్కడ చూసినా ఏదో వొకటి అడ్డదిడ్డంగా పడేసివుంటుంది." అని కోపంగా సణుక్కుంటూ గుడ్డలు దులుపుకుంటూ, బయటికి వచ్చి కూచున్నాడు. ఒక పది పదిహేను నిముషాలపాటు అలా కోపంతోటే కాళిదాసుకావ్యం చదువుకుని ఆనందించాడు. అంతటితో కావ్యతృష్ణ తృప్తిపడిపోవటంవల్ల కోపంమట్టుకు మిగిలిపోయింది. అంచేత ఆ కోపాన్ని వెంటతీసుకునే వూళ్ళోకి షికారు వెళ్ళాడు.

ఆ మర్నాటి ఉదయం శుభ్రంగా యెండకాసింది. కాని, బండూ ఆఫీసుకి బయలుదేరే వేళకి ఆ యెండ అంతర్ధానమయిపోయి. వెల్తురూ అదీ పోయి వాతావరణం తడిసిన గోనుగుడ్డలా అయిపోయింది. బండూ ఆఫీసు డ్రస్సు వేసుకుని గుమ్మం దిగబోయేటప్పటికి బటాణి గింజ సైజులో చినుకులు పడటం ఆరంభమైంది.

"గొడుగేవ్! గొడుగు సంగతేమైంది? నిన్నటినుంచీ మొత్తుకుంటున్నాను నాకో గొడుగు కావాలని! కాని ఈ ఇంట్లో నామాటంటే లెక్కేలేదేవరికీ!" అని పెద్ద పెట్టున కేకలు మొదలు పెట్టాడు.

"రాముణ్ణి అటకమీద కెక్కించి గొడుగు దింపించాలెండి" అంది లత అతి శాంతంగా! ★

ఈ అనువాద కథకు మూలం శ్రీ గంగాధర్ గాడ్గీళ్ రాసిన మరాఠీ కథ. శ్రీ గాడ్గీళ్ నవ్యమరాఠీ కథకు ఆద్యుడు. వృత్తిరీత్యా ఎకనమిస్టు, ప్రొఫెసర్, ఫైనాన్షియల్ కన్సల్టెన్ట్. ఆయన చేపట్టని సాహితీ ప్రక్రియ లేదు. హాస్య రచనల్లో బండూ కథలు చాలా ప్రాచుర్యం పొందాయి. తెలుగు సేత కీ॥శే॥ ఎన్. జగన్నాథ్. ★

## సిద్ధాంతాలూ - రాద్ధాంతాలూ

షాపింగ్

బొమ్మలు: బాలి




ఒక పుస్తకం రెండు భాగాలుగా వెలువడిందంటే మొదటి భాగం అమ్మేవాడికి రెండో భాగం ఉందనే తెలీదు. రెండో భాగం అమ్మేవాడి దగ్గర మొదటి భాగం కాపీలన్నీ చెల్లిపోయి ఉంటాయి.

-ఒక పుస్తక ప్రియుని గోడు

ఒక వస్తువు ఖరీదు ఎంత ఎక్కువ వుంటే దాన్ని రిపేరుకి పంపేదూరం అంత ఎక్కువ ఉంటుం దన్న మాట.

-ఆఫ్టర్ సేల్స్ సర్వీస్ బాధితుడు



## నువ్వు నాకు నచ్చావ్!

### తారాగణం

**వెంకటేష్, ఆర్తి అగర్వాల్**

ప్రకాష్‌రాజ్, చంద్రమోహన్, బ్రహ్మానందం, సునీల్, అనంత్, ఎం.ఎస్.నారాయణ, పింకి, భరణి, చిట్టిబాబు, కె.కె.శర్మ, కళ్ళు చిదంబరం, సుధ, శ్రీలక్ష్మి, గణేష్, ప్రత్యేక పాత్రలో సుహాసిని, అతిథి పాత్రలలో బాబుమోహన్, మల్లికార్జునరావు, మెల్కొటే తదితరులు

పాటల పుస్తక ప్రియుల కోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' పత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది

### సాంకేతిక వర్గం

రచన: త్రివిక్రమ్ శ్రీనివాస్
పాటలు: సిరివెన్నెల, భువనచంద్ర
సంగీతం: కోటి
కెమెరా: కె.రవీంద్రబాబు
సమర్పణ: సురేష్ ప్రొడక్షన్స్
నిర్మాత: స్రవంతి రవికిషోర్
స్క్రీన్ ప్లే, దర్శకత్వం: కె. విజయభాస్కర్

**బ్యానర్: శ్రీ స్రవంతి మూవీస్**

8

నువ్వు నాకు నచ్చావ్




---

R.B.CHOUDARY PRESENTS

## స్నేహమంటే ఇదేరా

Friends forever

పాటల పుస్తక ప్రియుల కోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' పత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది

**నిర్మాత: ఆర్.బి.చౌదరి,**
**దర్శకత్వం: బాలశేఖరన్**

### తారాగణం

నాగార్జున
సుమంత్
భూమిక
ప్రత్యూష
చలపతిరావు
సత్యప్రియ
సంగీత
సుధాకర్
బ్రహ్మానందం
జయప్రకాష్

### సాంకేతిక వర్గం

కథ: సిద్ధిక్
మాటలు: చింతపల్లి రమణ
పాటలు: కులశేఖర్, చిర్రావూరి విజయకుమార్, మృత్యుంజయుడు
సంగీతం: శివశంకర్
కెమెరా: శ్యామ్ కె.నారాయణ్
ఆర్ట్: సాయికుమార్
ఎడిటింగ్: హరి
ఫైట్స్: కనల్ కణ్ణన్
డాన్సు: రాజశేఖర్, లారెన్స్
ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: వాకాడ అప్పారావు

8

స్నేహమంటే ఇదేరా



రచన: సిరివెన్నెల **1** గానం: టిప్పు, హరిణి

అ : ఉన్నమాట చెప్పనీవు ఊరుకుంటే ఒప్పుకోవు ఇంకెలాగె సత్యభామా
ఆ : నన్నుదాటి వెళ్ళలేవు నిన్నునువ్వు దాచలేవు ఏమి చెయ్యనయ్యొ రామా
అ : అనుకున్నా తప్పు కదా మొమాటం ముప్పు కదా
ఆ : మనసైతే ఉంది కదా మన మాటే వినదు కదా
అ : పంతం మానుకో
ఆ : భయం దేనికో ॥ఉన్నమాట॥
అ : వద్దన్నకొద్ది తుంటరిగా తిరగకలా నా వెనకా
నిద్దర్లో కూడ ఒంటరిగా ఒదలవుగా
ఆ : నన్నస పెట్టి ఈ సరదా నేర్పినదే నువు గనుక
నా కొంగు పట్టి నడవనిదే కుదరదుగా
అ : అడుగడుగున ఎదురైతే ఏ దారీ తోచదుగా
ఆ : అటుయిటు ఎటు తేల్చవుగా మన కథనూ తొందరగా
అ : ప్రతీ చోట నీ నవ్వే పిలుస్తోందిగా ॥నన్నుదాటి॥
అ : అమాయకంగా చూడకలా వేడుకలా చిలిపికలా
అయోమయంగా వెయ్యకలా హాయి వలా
ఆ : నీ మీదకొచ్చి ఉరితాడే వాలదుగా వాలు జడా
దానొంక చూసి ఎందుకటా గుండెదడా
అ : మరిమరి శృతి మించి యిలా నను మైమరిపించకలా
ఆ : తడబడి తలవంచియిలా తలపును అణిచేస్తే ఎలా
అ : మరేం చెయ్యనే నీతో ఎలా వేగనే ॥నన్నుదాటి॥



ఒదిగుండమనక ఒదిలేయమంటు బతిమాలుతున్న వేళా
అ : వెన్నెలేదో వేకువేదో నీకు తెలుసా మరీ
ఓ.. నిదురపోయే మదిని గిల్లి ఎందుకా అల్లరీ
అ : చందమామ మనకందదనీ
ముందుగానే అది తెలుసుకుని
చేయి చాచి పిలవద్దు అని
చంటిపాపలకు చెబుతామా
ఆ : లేని పోని కలలులెందుకని మేలుకుంటే అవి రావు అని
జన్మలోన నిదురోకు అని కంటిపాపలకు చెబుతామా
అ : కలలన్నవి కలలని నమ్మనని అవి కలవని పిలవకు కలవమని
మది మీటుతున్న మధురానుభూతి మననడిగి
చేరుతుందా ॥ఒక్కసారి॥
ఆ : అందమైన హరి విల్లులతో బంతివేసి చిరు జల్లులతో
చుక్కలన్ని దిగి వస్తుంటే కరిగిపోని దూరం ఉందా
అ: అంతు లేని తన అల్లరితో
అలుపులేని తన అలజడితో
కెరటమెగిరి పడుతూ ఉంటే
ఆకాశం తెగిపడుతుందా
ఆ: మనసుంటే మార్గం ఉంది కదా
అనుకుంటే అందనిదుంటుందా
అ : అనుకున్నవన్నీ మనకందినట్ట అనుకుంట
తీరిపోదా ॥ఒక్కసారి॥ ..



రచన: కులశేఖర్ **1** పాడినది: శంకర్ మహాదేవన్, టిప్పు, కృష్ణంరాజు

1. పల్లవి :స్నేహమంటే ఊపిరి కదరా ప్రేమను పంచే గుణమే కదరా
దేవుని గుడిలో హారతిలాగ
తూరుపు దిక్కున వేకువలాగ కిలకిల గువ్వల సవ్వడిలాగ
మధురం కదరా అర్రే
స్నేహముంటే చాలన్నా ఏదీ లేకున్నా కల కాలం ఇట్టా
కలిసుందాం ఎవ్వరు ఏమన్నా
స్నేహమంటే ఇదేరా నమ్మర పెద్దన్న కల కాలం ఇట్టా
కలిసుందాం ఎవ్వరు ఏమన్నా
చరణం :ఊరి చివర ఈత లాడిన చెరువు గురుతుంది
బడిని మాని పడక వేసిన అరుగు గురుతుంది
కొతి కొమ్మచ్చాటల్లోన అల పిల్లంగోడులోన
చిన్నప్పటి స్నేహం బాగుంది
ఏట జరిగే జాతర లోన
మన ఉట్టెల పండగ లోన
ఆ అల్లరి ఇంకా బాగుంది
చూడరా చలాకి స్నేహం
పాడరా హుషారు గీతం
తీరని ఋణాను బంధం, సుమాలగంధం స్నేహమేరా
॥స్నేహముంటే చాలన్నా॥
**చరణం** :వాన చినుకే నేల తల్లితో చెలిమి కోరింది
ఉరకలేసే ఏరు పడవతో చెలిమి చేసింది
అల్ల నింగి నేలల్లోనా కొండా కోనల్లోనా
తియ తీయని స్నేహం దాగుంది



రచన:చిర్రావూరి విజయకుమార్ **6** గానం: దేవన్, సౌమ్య

అ రుక్కు రుక్కు రూప్ క్యా
రెక్కలొచ్చి మనసే ఖోగయా
షయ్యి షయ్యి హో షయ్యా
మేరా దిల్ క్యా హో గయా
శ్వాసించెను ఆశించెను
నీ స్నేహమే అయ్యయ్యో
కదిలించెను నా మనసును
తొలి చూపుకే ఏమయ్యిందో ఏమో
ఆ రుక్కు రుక్కు రూప్ క్యా
రెక్కలొచ్చి మనసే ఖోగయా
షయ్యి షయ్యి హో షయ్యా
మేరే దిల్ క్యా హోగయా
అ మదిలో ఏమున్నదో చూసుకో
అది ఏ మంటున్నదో తెలుసుకో
ఆ వెల్‌కమ్ అంటూ కనులు పలికే
కలలే సైగలు చేయగా
అ ఫ్రీడమ్ అంటూ మనసు పలికే
నవ్వే సిగ్నల్ ఇవ్వగా
ఆ ఛానల్సే మార్చెను వయసు
ఛేజింగ్సే నేర్చెను సొగసు
అ వయసంటే వన్‌వే ట్రాకు
లైఫే ఓ గిన్నిస్ బుక్కు
ఆడాలి డిస్కో థక్కు
వుయ్ హ్యావ్ ది బూమింగ్ నైట్స్
॥రుక్కు॥
శ్వాసించెను ఆశించెను నీ పాటనే
అయ్యయ్యో
కదిలించెను నా మనసుకు నీ స్నేహమే
ఏమయ్యిందో ఏమో
ఆ మనసుకు మందేమిటో తెలుపవా
ప్రేమకు భాషేమిటో చూపవా
అ మనసును కలిపే మెడిసిన్ ప్రేమే
వయసే దానికి డాక్టరూ
ప్రేమను నడిపే మెషినే మనసు
ఆశే దానికి డ్రైవరు
ఆ రూటే మార్చింది స్నేహం
పాటే పాడింది ప్రాయం
ఓపెన్ చెయ్ ఇంటర్ నెట్
ఫ్రీ బర్డ్ అయి కట్టేయ్ జట్టు
ఎంజాయ్ చెయ్ డే ఎండ్ నైటు
నా మనసే టూలెట్టు ॥రుక్కు॥
..

ఓ ప్రియతమా ఇది నిజమా ఈ పరిచయం ఒక వరమా
ఇది మనసు పడిన విరహ వేదనా తొలి ప్రేమలోని మధుర భావనా
ఏ ముత్యమూ ఏమబ్బులో దాగున్నదో తెలిసేదెలా
ఏ స్నేహమూ అనుబంధమై ఒడిచేరునో తెలిపేదెలా
నా గుండె పొదరింట నీ కళ్ళు వాలాక ఏ ఆశ చివురించెనో
వెచ్చన్ని నీ శ్వాస నా మేను తడిమాక ఏ ఊహ శృతి మించెనో
ఎన్ని జన్మాల బంధాలు శ్రీపారిజాతాలై విచ్చాయో చెప్పేదెలా
ఎన్నినయనాలు నా వంక ఎర్రంగ చూసాయో ఆ గుట్టు విప్పేదెలా
ఓ ప్రియతమా దయ గనుమా నీ చూపే చాలు చంద్ర కిరణమా
నా జన్మ ధన్య మౌను ప్రాణమా ॥జుం జుం జుం జుం జుం జుం
జుం జుం జుం జుం జుం జుం జుం జుం జుం జుం జుం జుం జుం ॥
చివురాకులా పొత్తిళ్ళలో వికసించిన సిరిమల్లెవో
చిరుగాలితో సెలయేటిపై నర్తించిన నెలవంకవో
నవ్వేమో నాజూకు నడుమేమో పూరేకు నీ అందమేమందుమే
పలుకేమో రాచిలక నడకేమో రాయంచ ఒళ్ళంత ఒయ్యారమే
నీ నామాన్ని శృంగార వేదంగా భావించి జపియిస్తున్నానే చెలి
నీ పాదాలే నా ప్రేమ సౌధాలుగా ఎంచి పూజించనా నానెచ్చెలి
ఓ ప్రియతమా ఔననుమా కన లేవా ప్రియుని హృదయ వేదనా
కరుణించు నాకు వలపుదీవెనా... ॥ఆ నీలి॥

రచన: సిరివెన్నెల **6** గానం: కుమార్‌సాను, చిత్ర

ఆ : ఒక్కసారి చెప్పలేవా నువ్వు నచ్చావని
ఓ.. చెంత చేరి పంచుకోవా ఆశనీ శ్వాసనీ
మన గుండె గుప్పెడంతా తన ఊహ ఉప్పెనంతా



రచన: సిరివెన్నెల **2** గానం: శంకర్ మహదేవన్

నా చెలియ పాదాలూ హంసలకే పాఠాలు
తాను పలికితే చాలు తేనె జలపాతాలు
ఓ నవ్వుచాలు ఎన్నెన్నో వలలు వేస్తూ అల్లుకుంటుంది
ముత్యాల జల్లు మృదువైన ముల్లు మదిలో గుచ్చుకుంటుంది
ఆ సోగ కళ్ళ ఓ సైగ చాలు మనసే ఆగనంటుంది
చెక్కిళ్ళ లోని నొక్కుల్లోచేరి మళ్ళీ తిరిగి రానంది
పట్టపగలెవ్వరైనా రాతిరిని చూస్తారా
తన కురులు చూపిస్తొ ఔననకా చస్తారా ॥ఓ నవ్వుచాలు॥
గుండెల్లో భోగి మంటలా ఎండల్లో లేత వెన్నెలా
కొండల్లో ఏటి పరుగులా దూకుతున్న లయలో
గుమ్మంలో సంద వెలుగులా కొమ్మల్లో కొత్త చిగురులా
మబ్బుల్లో వెండి మెరుపులా ఆమెకెన్ని హొయలో
అలా నడిచి వస్తుంటే పువ్వులవనం
శిలైపోని మనిషుంటే మనిషే అనం ॥ఓ నవ్వుచాలు॥
గాలుల్లో ఆమె పరిమళం ఊపిరిలో నిండి ప్రతిక్షణం
ఎటువున్నా నన్ను వదలదే ఎలా తప్పుకోను
గుర్తొస్తే ఆమె పరిచయం కవ్వించే పడుచు పసితనం
రెప్పల్లో కైపు కలవరం ఎలా దాచుకోనూ
కలో కాదో నాకే నిజం తేలకా ఎలా చెప్పడం తాను నాకెవ్వరో
అదిరిపడకయ్యా యిది ఆమె మాయ యిది కవిత
కాదబ్బా మన్మథుడి దెబ్బ ॥ఓ నవ్వుచాలు॥



అ ఈ దీవెనే అందుకో కానుకంది
ఆ నువ్వు పక్కనుంటే ఏంటి చల్లగున్నది
అ నువ్వు ముట్టుకుంటే ముళ్ళే మల్లెలైనవి
ఇద్దరు నువ్వు నా ప్రాణమై, నీ ప్రేమతో నడిపించవా ॥నా పెదవికి॥
ఆ నా నుదుటిపై కుంకుమై నిలిచి పోవా
అ నా ఇంటికే దీపమై నడచి రావా
ఆ వేల ఊహాలందు నిన్నే దాచుకుంటినే
అ కోటి ఆశలందు నిన్నే చూసుకుంటిని
ఇద్దరు నువ్వు నా చూపువై, నా ఊపిరై ప్రేమించవా ॥నా పెదవికి॥

రచన: కులశేఖర్ **5** గానం: హరిహరన్

పల్లవి : నేస్తమా నేస్తమా ఇంత శిక్ష న్యాయమా అనురాగమే నేరమా
స్నేహమే ద్రోహమా కానరాని దైవమా బలికోరటం న్యాయమా
బంధమే ఈ వేళ తెంచుకుపోతే కన్నీరే ఏరై పారేనా
నేస్తమే ఈ నాడు శత్రువు అయితే చితిమంటే కాదా
లోలోన ॥నేస్తమా॥

చరణం : రావే ఓ చిరుగాలి, నీవే గాలించాలి నీడే దూరం అయినదే
మేఘం నింగిని వీడి ఎంతో దూరం పోదే స్నేహం
దూరంల అయినదే
ఆ దేవుడు లేని ఆలయములా కెరటాలు లేని సాగరములా
ఊపిరిలేని గుండె లయలా నేస్తము లేక ఉండగలనా
ఓ బ్రహ్మయ్యా నా కంటి పాపను చేర్చి గుండె
కోత తీర్చయ్యా ॥నేస్తమా॥



ఏడడుగుల బంధం కన్నా మన బంధం ఎంతో మిన్న
ఇక ఇంతకు మించిన దేముంది
చూడరా పవిత్ర బంధం
వారేవా ఇదేమి చిత్రం
సృష్టికి అనాదిగాను, పునాది రాయి స్నేహమేరా
॥స్నేహముంటే చాలన్నా॥ ॥స్నేహమంటే ఊపిరి॥

రచన: మృత్యుంజయుడు **2** పాడినది: హరిహరన్, సుజాత

చెలియా నీ ప్రేమలోనే పరవశించి పోయానే ॥చెలియా॥
అ పెదవి మీది సిగ్గులన్నీ పైట చాటు దాచకే
ముద్దు కోరి జంట కొస్తే సిగ్గులెందుకే
నీ నవ్వే సింగారమో, నీ పలుకే బంగారమో
నీ ముద్దే మందారమో
ఓ రోజా రా రా రా రా రా
ఆ ప్రియుడా నీ ప్రేమలోనే పులకరించి పోయానే
అ మాటలన్నీ మాయచేసి ప్రేమకు వలవేశా
ప్రేమ మైకం పొందిన వేళ మౌనం సాధించా
ఆ కన్నులు నాల్గు కలిసినవేళ భాషకు చోటేది
మౌనం పాడే ఆలాపనకు మించినదేముంది
అ మాటలే మనసుకు బరువైతే
మౌనమే కానుక అవుతుంది
మౌనమను భాషే రాకుంటే
ప్రేమ ఇక వ్యర్థం అవుతుంది.
ఆ ఈ ప్రేమ భావనే నిజం నిజం

రచన : సిరివెన్నెల **3** గానం: యస్.పి. బాలు, కోరస్

ఆకాశం దిగివచ్చి మబ్బులతో వెయ్యాలి మన పందిరీ ॥ఆకాశం॥
ఊరంతా చెప్పుకునే ముచ్చటగా జరగాలి పెళ్లంటే మరీ
చెరి సగమవమని మనసులు కలుపుతు తెర తెరిచిన తరుణం
యిదివర కెరగని వరసలు కలుపుతు మురిసిన బంధు జనం
మా ఇళ్ల లేత మావిళ్ళ తోరణాలన్ని పెళ్ళి శుభలేఖలె
అక్షింతలేసి ఆశీర్వదించమను పిలుపులైనవీ గాలులే ॥ఆకాశం॥
చెంపలో విరబూసె అమ్మాయి సిగ్గు దొంతరలు
ఆ సొంపులకు ఎరవేసె అబ్బాయి చూపు తొందరలు
ఏ వరాలు ఈ జవరాలై జతపడు సమయంలో ఓ...
వాన విల్లే వధువుగ మారి ఒదిగిన వేడుకలో
తన సరసన విరిసిన సిరి సిరి సొగసుల కులుకుల కలువకు కానుకగా
ఎదసరసున యెగసిన అలజడి అలలే కానుకగా
ధింతక ధింతక ధింతక
తకధిం ధింతక ధింతక ధింతక తకధీం ॥ఆకాశం॥
విన్న వారెవరసలు సన్నాయి వారి సంగతులూ
సన సన్నగా రుసరుసలు వియ్యాల వారి బుసబుసలు
సందు చూసి చక చక ఆడె జాద శిఖామణులు
పందిరంతా ఘుమఘుమలాడే విందు సువాసనలూ
తమ నిగ నిగ నగలను పదుగురి ఎదురుగా యిదిగిదిగో అని చూపెడుతు
తెగ తిరిగే తరుణుల తిక మక పరుగులు చూడగా ॥ఆకాశం॥



రచన: సిరివెన్నెల **4** గానం: చిత్ర, శ్రీరామ్ ప్రభు

ఆ : నాచూపె నిను వెదికినది నీవైపే నను తరిమినది
నాకెందుకిలా అవుతోంది నామదినడిగితే చెబుతుంది
నువ్వే నువ్వే తనలోన ఉన్నావంటూ నీకే నీకే
చెప్పాలి అంటున్నది ॥నాచూపె నిను॥
నిన్నేతలిచిన ప్రతినిమిషం ఏదో తెలియని తియ్యదనం
నాలో నిలవని నాహృదయం ఏమౌతుందని చిన్న భయం
అ : గుండెలోన చోటిస్తాలే నన్ను చేరుకుంటే
వేలు పట్టి నడిపిస్తాలే నావెంటే నీవుంటే
॥నువ్వే నువ్వే॥ ॥నాచూపె నిను॥
ఆ : పెదవులు దాటని ఈ మౌనం అడిగేదెలాగ ఈ స్నేహం
అడుగులు సాగని సందేహం చెరిపేదెలాగ ఈ దూరం
అ : దిగులు కూడా తీయగ లేదా ఎదురుచూస్తూ ఉంటే
పగలు కూడా రేయైపోదా నీవుంటే నావెంటే
॥నువ్వే నువ్వే॥ ॥నాచూపె॥

రచన: భువనచంద్ర **5** గానం: యస్.పి. బాలు

ఆ నీలి గగనాల మెరిసేటి ఓ దివ్య తారా
ఎన్నన్ని జన్మాలు వేచాను నే నిన్ను చేరా
ఏనాటి స్వప్నం నీ దివ్య రూపం శతకోటి
రాగాలు రవళించే నాగుండెలోనా



ఏదో చెప్పాలని ఉంది గుండె చెలువందే
సిగ్గును చెందని పువ్వులు
అ తుమ్మెద అంటదులే
ముద్దును పొందని సిగ్గులో
బుగ్గలు కందవులే ॥చెలియా నీ ప్రేమ॥
అ ప్రేమ కానుక పొందిన వేళ సర్వం మరిచాను
నా ప్రేమకు నిత్యం ప్రాణం పోసి కవినై పోయాను
ఆ తీయగ పలికిన స్వరముల జల్లున మనసే తడిసింది
నీకై నిలచి నిన్నే తలిచి ప్రాణం ఇస్తుంది
అ యవ్వనము వయసుకు తోడైతే
ఆశలకు పండుగ అవుతుంది
ఆ స్పర్శలో స్వర్గం కనుగొంటే
జీవితం మధురసమౌతుంది
అ ఇక ఊరించకే ప్రియా ప్రియా
నీ అంద చందాలన్నీ చూసి కళ్ళు చెదిరే
ఆ మదిలో దాగిన ఊహాల ఊపిరి నీవైతివి
వద్దని కన్నులు మూసినా ఎదుటే నీవుంటివి ॥చెలియా నీ ప్రేమ॥

రచన: చిర్రావూరి విజయకుమార్ **3** పాడినది:ఉదిత్ నారాయణ్, సుజాత

।ఆ। కన్నె పిల్లలే పక పక మంటే మీకు తిక మకలే
అ కళ్ళే కలిపి మేం కుహు కుహు మంటే మీకు తహ తహలే
ఆ జడ ఊపుకుంటే మేం వెళుతుంటే మీ మనసు జివ్వు మనదా
అ మెలితిప్పి మీసమే కన్ను కొడితే మీ సొగసు కెవ్వు మనదా
ఆ మేమే ముస్తాబై కనిపిస్తే మతిపోదా మీకింక ॥కన్నె॥



అ: కన్నే పలికే కైపు రేపని పన్నే పలికే కాటు వెయ్‌మని
అ కొనగోరే మీటని పలికే చెంత చేరు త్వరగా
ఆ ఈడే పలికే తోడు ఏడని నాడే పలికే వేడి చూడని
ఆ ఫలహారం చేయమని పలికే పాలు పళ్ళు త్వరగా
అ పెదవుల్లో దాహం పలికే తాగనీ త్వరగా
ఆ పరువంలో మోహం పలికే లాగనీ త్వరగా
అ మెడను వొంపు మడతే పలికే తాకమని త్వరగా
ఆ నను విడబోకని ఒడి పలికే మెడలో ముడి వేయ్ త్వరగా ॥కన్నె॥
ఆ బొట్టే పలికే కంది పోకని... బెట్టే పలికే అంటబోకని
ఆ జడ యేవో తెమ్మని పలికే జాజి పూలు త్వరగా
అ మీసం పలికే బుగ్గ ఇమ్మని, రోషం పలికే సిగ్గు పడకని
అ సరసంకై వయసే పలికే జ్వరము చేయి త్వరగా
ఆ చెలరేగే ఊహలు పలికే ఏలుకో త్వరగా
అ ఉసి గొలిపే ఆశలు పలికే చేరుకో త్వరగా
మల్లెపూల మంచు పలికే రమ్మని త్వరగా
ఆ ఇక తలుపెయ్ మని మది పలికే ఆలూ మగలై త్వరగా ॥కన్నె॥

రచన: చిర్రావూరి విజయకుమార్ **4** గానం: రాజేష్, సుజాత

ఆ నా పెదవికి నవ్వులు నేర్పావు ప్రియా నీకు జోహారు
అ నా కనులకు కలలే చూపావే చెలి చెంతకే చేరు
ఎదే ఉండిపో నా మదిలో నిండిపో సుధవై సఖివై
ఆ మన కలయిక కథలుగా సాగాలి
అ మన కథ ఒక చరితగ వెలగాలి ॥నా పెదవికి॥
ఆ ఏ దీవెనా బంధమై అల్లుకుంది



# టీచర్స్ స్టూడెంట్స్ స్పెషల్







"నా కుడి చేతిలో ఎనిమిది ఏపిల్ పండ్లు, ఎడమ చేతిలో పది ఏపిల్ పండ్లు వుంటే... నా రెండు చేతుల్లో ఎన్ని వున్నట్టు?"
"రెండు చేతుల ఏపిల్ పళ్ళు సార్..."



"లెక్కల్లో నీకు అంత తక్కువ మార్కులు ఎందుకు వస్తున్నాయో.... తెలుసా?"
"ఎందుకో... తెలియటం లేదు టీచర్...."
"ఖచ్చితంగా తెలియటం లేదా లేక సరిగ్గా ఆలోచించలేకపోతున్నావా? ఓసారి లెక్కేసుకో"



"నువ్వు పెద్దదానివయ్యాక ఏమవుదామనుకుంటున్నావ్?".
"టీచర్ని అవుదామనుకుంటున్నాను సార్."
"నిజంగానా? టీచరే అవ్వాలని ఎందుకనుకుంటున్నావ్?"
"టీచరైతే ఎంచక్కా యిప్పుడు ఏమీ నేర్చుకోనక్కర్లేదండి. అందర్నీ అడిగి అప్పుడే అన్నీ నేర్చుకోవచ్చు....".



రోడ్డు మీద పోతున్న ఒకతన్ని ఓ కారు ఢీ కొట్టి వెళ్ళిపోయింది. వెంటనే పోలీసాఫీసరు వచ్చి
"మిమ్మల్ని గుద్దేసి వెళ్ళిన ఆ కారు నంబరు ఎంతో చెప్పగలరా?" అని ప్రశ్నించాడు.
"చెప్పటానికి ప్రయత్నిస్తానుండండి. ఆ నంబరుని అదే నంబరు పెట్టి హెచ్చవేసి వచ్చినదాన్ని మూడు పెట్టి భాగించి ఆ వచ్చిన దానికి స్క్వేర్ రూట్ కడితే వచ్చే జవాబు అసలైన కారు నంబరులోని అంకెలను తారుమారు చేస్తే ఎంత వుంటుందో.... అలానే వుంటుంది. పైగా అది పూర్ణ సంఖ్య కూడా...." అంటూ చెప్పాడా ఒకతను.
అన్నట్టు అతను లెక్కల మాస్టారు!



"మీరు జూలియస్ సీజర్ గురించి విన్నారా?"
"విన్నా సార్...."
"ఆయనే కనక బతికుంటే ఇప్పుడు ఏంచేస్తుండేవాడో ఆలోచించగలరా?"
"చెయ్యటానికి ఏముంది టీచర్.... పెన్షన్ తీసుకుంటూ వుండేవాడు...."



"ఏం నాయనా.... పరీక్ష హాల్లో అలా దిక్కులు చూస్తూ కూర్చుండి పోయావ్.... జవాబులు రాయటం లేదేం?" అడిగేరు ఇన్విజిలేటర్.
"ఈ క్రింది ప్రశ్నలకు అయిదింటికి సమాధానాలు వ్రాయుము అని వుందండీ... ఇంకా టైమ్ అయిదు కాలేదు కదండీ.... అందుకే..... " చెప్పాడు పరీక్ష వ్రాసే ఆ కుర్రాడు.



"డెడ్ సీ.... అనే సముద్రం గురించి నీకు తెల్సింది చెప్పరా?"
"అరెరే.... ఆ సముద్రానికి జబ్బు చేసిందన్న సంగతి కూడా నాకు తెలియదు. టీచర్...."

మంచి పనుల గురించి ఇరవై మందికి బోధించడం కంటె వాటిని ఆచరించే ఇరవై మందిలో ఒకడిగా ఉండడం కష్టం
**-షేక్స్పియర్**



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త,
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు
**శ్రీ ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.

# లలిత సంగీతం

రచన, సంగీతం: డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు
గాయని: టంగుటూరి సూర్యకుమారి
రాగం: బిలహరి
**తాళం:** ఆది - కర్ణాటక సంగీతం
కహరువా - హిందుస్తానీ సంగీతం
29వ మేళకర్తయగు ధీర శంకరాభరణ రాగజన్యం
**ఆరోహణ:** స రి గ ప ద స
**అవరోహణ:** స ని ద ప మ గ రి స
**ఆరోహణలో:** షడ్జము, చతుశ్శృతి రిషభం, అంతరగాంధారం, పంచమం, చతుశ్శృతి ధైవతం, తారషడ్జము.
**అవరోహణలో:** తారషడ్జము, కాకలి నిషాదము, చతుశ్శృతి ధైవతం, పంచమం, శుద్ధమధ్యమం, అంతరగాంధారం, చతుశ్శృతి రిషభం, షడ్జము.
ఈ రాగంలో అన్యస్వరమైన కైశికి నిషాదం కూడా అదనంగా వాడబడుతుంది.
ఆ స్వరాన్ని నేను వ్రాస్తున్న కొటేషన్‌లో
"నీ"గా సూచిస్తున్నాను. ఆరోహణలో కాకలి నిషాదం కూడా పూర్వకాలం వాడబడేది.

## మాదీ స్వతంత్ర దేశం

మాదీ స్వతంత్ర దేశం మాదీ స్వతంత్ర జాతి
భరతదేశమే మా దేశం భారతీయులం మా ప్రజలం ॥మాదీ॥
వింధ్య హిమవత్ శ్రీ నీలాదుల సంధ్యారుణిత నవాశలు మావి
గంగా గోదావరీస హ్యాజా తుంగత రంగిత హృదయాల్ మావి ॥మాదీ॥
ఆలయమ్ముల శిల్పవి లాసం ఆరామమ్ముల కళాప్రకాశం.
మొగల్ సమాధుల రసదర హాసం మాకు నిత్యనూత నేతిహాసం ॥మాదీ॥
అహింసా పరమో ధర్మః సత్యం వద ధర్మం చర....
ఆది ఋషుల వేదవాక్కులు మాగాంధి గౌతముల సువాక్కులు ॥మాదీ॥
స్వతంత్రతా భ్రాతృత్వాలు సమతామాసదాశయాలు
జననీ ఓ స్వతంత్ర దేవీ కొను మా నివాళులు మావి ॥మాదీ॥

## డా॥ రజనీకాంతరావు

ప్రముఖ గాయకులు, కవులు, వాగ్గేయకారులు, స్వరకర్త బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన శ్రీ రజని గారు లలిత సంగీత వికాసానికి, అభివృద్ధికి ఎనలేని సేవలందించారు. వారిది, మానాన్న గారిది కూడా జన్మ స్థలం పిఠాపురమే. వారి తండ్రిగారు శ్రీ బాలాంత్రపు వెంకట్రావుగారి (తెలుగు సాహిత్యంలో జంట కవులుగా ప్రసిద్ధి గాంచిన వేంకట పార్వతీశ్వర కవులలో ఒకరు) కాలం నుండి కూడా వారి కుటుంబము, మాకుటుంబము కూడా ఎంతో సన్నిహిత సంబంధముతో వుండినవి. రజని గారు మద్రాసు రేడియో కేంద్రంలో 1941లో ఉద్యోగంలో చేరినప్పటి నుండి ఎన్నెన్నో మధురమైన లలిత గీతాలు, 'చండీ దాసు', 'మేఘ సందేశం' మొదలగు సంగీత నాటికలు ఆయన కలం నుండి జాలువారాయి. ఆయన అలనాటి భావ కవులు రచించిన గేయాలనెన్నింటినో స్వరబద్ధం చేశారు. కృష్ణశాస్త్రి గారి 'అతిథిశాల" (ఉమర్ ఖయ్యాం) సంగీత రూపకానికి పర్షియన్ సంగీత పోకడలను ఉపయోగించి అజరామరమైన బాణీలను సమకూర్చారు. ఆ నాటికను 1963లో తిరిగి ఆకాశవాణి హైదరాబాదు నుండి ప్రసారం చేసినప్పుడు అందులో ఆయనతో పాటు నేను కూడా పాడాను. 1956 నుండి ఆకాశవాణి విజయవాడలోను, ఆ తరువాత హైదరాబాదులోను రజని గారు పనిచేసినప్పుడు ఆయన సంగీత నిర్వహణలో నేను ఎన్నో పాటలు పాడాను. ఆయన రచించిన పలు గేయాలకు నేను కూడా బాణీలను కూర్చాను. 1963లో యన్.ఆర్.నంది రచించిన "మరో మొహంజొదారో" స్టేజి నాటకానికి రజని గారు వ్రాసిన "మరుగు పడిందొక మహీధరం" అనే పాటకు సాధారణంగా లలిత సంగీతానికి ఉపయోగించని "జయంత శ్రీ" రాగాన్ని తీసుకుని బాణీని కూర్చి ఆ నాటకంలో నేనే పాడాను. అదే పాట ఆకాశవాణిలో 'ఈ మాసపు పాట'గా కూడా ప్రసారమై బహుళ జనాదరణ పొందింది.

సంగీతం కూర్చడంలో రజనిగారి దొక విలక్షణమైన పద్ధతి. శాస్త్రీయ సంగీతంలో ఎక్కువగా వాడుకలో లేని అనేకమైన అపూర్వ రాగాలను వెలికి తీసి వాటిని లలిత సంగీతానికి అన్వయించి బాణీలు కూర్చడం ఆయన ప్రత్యేకత. ఆ విధంగా ఆయన లలిత సంగీతాన్ని సుసంపన్నం గావించారు. లలిత సంగీతానికి



ఆద్యులలో ప్రముఖులైన శ్రీ రజని గారిని ఈ ఏడాది ప్రారంభంలో 7.1.2001 నాడు భీమవరంలో అప్పాజోస్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్(అమెరికా) వారు ఘనంగా ఆదరించి సన్మానించారు.

ఈ మధ్యనే "శ్రీ చిత్తరంజనం" అనే నా వాగ్గేయ సంపుటికి, రజనిగారు నాపై ఎంతో వాత్సల్యంతో నా చేత ఆ గ్రంథంలోని కొన్ని కీర్తనలను పాడించుకొని విని ఆత్మీయతతో కూడుకున్న తమ అమూల్యమైన అభిప్రాయాన్ని, ఆశీర్వాభినందనను వ్రాశారు.

పల్లవి॥

[illegible]

1 చరణం

[illegible]

2 చరణం

[illegible]

3 చరణం

[illegible]

4 చరణం

[illegible]



# టంగుటూరి సూర్యకుమారి

సుప్రసిద్ధ గాయని సూర్యకుమారిగారి పాటలు ఎన్నో ఆకాశవాణి మద్రాసు కేంద్రం ద్వారాను, హెచ్.యం.వి. వారి ప్రైవేటు రికార్డుల ద్వారాను 1940-50వ దశ కాలల్లో వెలువడి వెనుకటి తరంవారి హృదయాలలో సుస్థిరస్థానాన్ని సంపాదించుకున్నాయి. రజని గారి పాటలు ఆమె ఎన్నో పాడారు. శంకరంబాడి సుందరాచారి గారి 'మా తెనుగు తల్లికి మల్లెపూదండ" పాట 40 దశకంలో సూర్యకుమారి గారు పాడగా బహుళ జనాదరణ పొందింది.

1960 ప్రాంతంలో ఆవిడ ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ఆదిశంకరుల 'నిర్వాణ షట్కమ్' గానం చేవారు. అది చాలా పాప్యులర్ అయింది. 1972లో ఆమె లండన్ నుండి హైదరాబాదు వచ్చినప్పుడు ఆవిడతో మూడు లలిత గీతాలను నేనే రికార్డు చేశాను. ఆ కార్యక్రమం చాలాసార్లు రేడియోలో ప్రసారమై ఎంతో మంది శ్రోతలను ఆకట్టుకుంది. తిరిగి 1975లో లాల్ బహదూర్ స్టేడియంలో జరిగిన "ప్రపంచ తెలుగు మహాసభల"కు సూర్యకుమారి గారిని ఆహ్వానించగా, ఆకాశవాణి హైదరాబాదులో ఆవిడ చేత "మా తెనుగు తల్లికి మల్లె పూదండ" పాటను పాడించి మరల రికార్డు చేసి ప్రసారం చేశాము.




మహారాష్ట్రలోని కొంకణ్ ప్రాంతానికి చెందిన భగవాన్ కుటుంబం బొంబాయికి తరలివచ్చింది. అతని తండ్రి ఒక టెక్స్‌టైల్ మిల్లులో వర్కరు. దాదర్, పరేల్ ప్రాంతాలలో గుడిసెల్లో నివాసం. కటిక దారిద్ర్యంలో పెరిగిన భగవాన్‌కి చదువు అబ్బలేదు. క్లాసులు ఎగ్గొట్టి, సినిమాలకు చెక్కేసేవాడు. చుట్టూ ఉన్న కష్టాల వాతావరణం నుంచి ఊహల్లోకి పారిపోవడానికి అతనికి సినిమాయాజాలం ఎంతో ఉపకరించింది. నాల్గవ క్లాసు తర్వాత చదువు సాగలేదు. అయినా సినిమా రంగానికి వచ్చిన తర్వాత అతడు ఎంతో సంపాదించ గలిగేడు. కాలానుగుణంగా మార గలిగేడు. సినిమాలకు దర్శకత్వం వహించడమే కాక, నిర్మాణ వ్యవహారాలు కూడ చూసుకోగలిగేడు.

# అమితాబ్, గోవిందా స్టెప్పుల్లో అనుకరించేది భగవాన్‌నే!



హిందీ చలనచిత్ర సీమను సుసంపన్నం చేసిన హాస్యనటులు ఎందరో ఉన్నారు. వయోభారంతో రిటైరయినా, కీర్తిశేషులయినా - వారు ప్రజల స్మృతిపథంలో నుండి క్రమంగా తొలగిపోతారు. కానీ భగవాన్ విషయంలో అది ఎన్నటికీ జరగదు. కనీసం గణేశ్ నిమజ్జనోత్సవాలు జరిగేటంతటి కాలం అతడిని ఎవరూ మరవలేరు. కారణం - గణేశ ఉత్సవాలలో జనసందోహం చేసే డాన్సుకి ఆద్యుడు అతనే కాబట్టి. "అల్‌బేలా" చిత్రంలోని 'షోలా జో భడ్కే...' పాటలో - ఒక చేయి వెనుకనుండి టోపీ మీదకు పెట్టుకుని మరో చేయి నడుం మీద పెట్టుకుని కొద్దిపాటి జర్కులతో నడుం ఊపుతూ అతను చేసిన డాన్సు గణేశ భక్తుల ఫేవరెట్. ఇప్పుడు గోవిందా, అప్పుడప్పుడు అమితాబ్ బచ్చన్ అనుకరించేది అతని స్టయిలునే. కమెడియన్‌గా, డాన్సర్‌గా, దర్శక నిర్మాతగా పేరుకెక్కిన భగవాన్ గురించి కొన్ని ముచ్చట్లు.

## భగవాన్

## జీవితంలో కొన్ని మైలు రాళ్లు



భగవాన్ సినిమాలు చూసే కాలం సైలెంట్ సినిమాల యుగం. అప్పట్లో అన్నీ ఏక్షన్ సినిమాలు వచ్చాయి. కుర్రవాడైన భగవాన్‌ను ఆకర్షించినవీ అవే. పెద్దయ్యాక కమెడియన్ అవుదామని అనుకోలేదతను. అప్పట్లో (1920లలో) హీరో అయిన మాస్టర్ విఠల్ అతని ఆరాధ్య దైవం. అతనిలాగ సినిమాలలో చేరి సాహసోపేతమైన పనులు చేసేద్దామని తాలింఖానాకు వెళ్లి కండలు పెంచుకున్నాడు. సినిమాలలో చేరేక అనేక యాక్షన్ సినిమాలలో నటించి తన ఉబలాటం తీర్చుకున్నాడు. అప్పట్లో సాహసానికి మారుపేరుగా నిల్చిన నటీమణి - నాడియా. హోమీవాడియా వారి చిత్రాలలో ఆమె ఎన్నో దుస్సాధ్యమైన వీరకృత్యాలు చేసేది. చాలా చిత్రాలలో భగవాన్ ఆమెకు తోడుగా నటించాడు.



చదువు మానేసాక, పొట్టకూటికోసం భగవాన్ ఎన్నో చిన్నా, చితకా ఉద్యోగాలు చేసాడు. చేసేన్తానే స్టూడియోల చుట్టూ ప్రదక్షిణలు చేసే వాడు. ఎట్టకేలకు 1930లో సిరాజ్ అలీ హకీమ్ అనే నిర్మాత దయతలచి తన మూకీ సినిమా "బేవఫా ఆషిక్"లో చిన్న పాత్ర ఇచ్చాడు. భగవాన్ ఆనందానికి పట్టపగ్గాలు లేవు. షూటింగ్ అయిపోయి, స్టూడియో మూసేసినా అక్కడి నుండి కదలడానికి ఒప్పుకోలేదు. సినిమాలంటే అతనికి ఉన్న పిచ్చి ఇంకా పోలేదనే అనాలి. 80 ఏళ్ల వయస్సు వచ్చినా ఏవేవో వేషాలు వేస్తూనే ఉన్నాడు. మొన్న ఆగస్టు 1కి 88 ఏళ్లు నిండాయి. అనారోగ్యంతో బాధపడుతున్నాడు. అయినా వేషం ఇస్తానంటే వద్దనడు.



జానపద సినిమాలు, యాక్షన్ సినిమాల నుండి భగవాన్ సాంఘిక చిత్రాల వైపు మళ్లడానికి ఓ కారణం ఉంది. అతను నటుడయిన కొద్ది రోజుల్లోనే 'బహదూర్ కిసాన్', 'క్రిమినల్' వంటి స్టంటు సినిమాల్లో ముఖ్యపాత్రలు నటించడం, అవి హిట్ కావడం జరిగింది. దాంతో చాలామంది పెట్టుబడిదారులు సినిమా నిర్మాణంపై ఆసక్తి చూపారు. దర్శకుల కొరత ఏర్పడింది. సినిమా స్టూడియోలను పట్టుకుని వేళ్లాడుతూ సినీ నిర్మాణంలో అన్ని అంశాలను అధ్యయనం చేసిన భగవాన్‌కు దర్శకత్వం పెద్దకష్టం అనిపించలేదు. "ఆ రోజుల్లో దర్శకుడంటే కాస్ట్యూమ్స్ డిజైన్ చేయడం దగ్గర్నుంచి యూనిట్‌కు భోజనాలు పెట్టించడం వరకు అన్నీ చూడాల్సి వచ్చేది. ఇవన్నీ కలిపి 65,000 రూ॥ల్లో సినిమా తీసేసే వాళ్లం" అంటాడు భగవాన్. ఆ సినిమాలు గొప్పవని చెప్పలేం కానీ డబ్బు చేసుకున్నాయి. 'దోస్త్', 'జలన్', 'భేడీబంగ్లా' ఇవన్నీ 1950కు ముందు భగవాన్ డైరెక్ట్ చేసినవే. 1950 పాటికి రాజ్‌కపూర్ హెచ్చరించాడు. 'దాదా (భగవాన్ అసలు పేరు భగవాన్ అబాజీ పాలవ్, చిత్రసీమలో అందరూ ఆయనను పెద్దన్నగా సంభావించి దాదా అంటారు) 'జమానా బదల్ గయా, సోషల్ పిక్చర్ బనావో' అన్నాడు. సి.రామచంద్ర కూడా అదే కరక్టేనన్నాడు. ఫలితంగానే "అల్‌బేలా" రూపు దిద్దుకుంది.

హాలీవుడ్‌లో తరచుగా వినబడే మ్యూజికల్ పదానికి సరైన నిర్వచనం - "అల్‌బేలా". పాటలు, డ్యాన్సులు అద్భుతం. పాటలకు ప్రాణం పోసిన సి.రామచంద్ర భగవాన్‌కి ప్రాణమిత్రుడు. 'నా శక్తి అంతా ధారపోసి, నీకో సంగీతభరితమైన చిత్రాన్ని అందిస్తాను' అని హామీ ఇచ్చాడు రామచంద్ర. అప్పట్లో భగవాన్ మహా బిజీస్టార్. అయినా సాయంత్రాలు ఇద్దరూ కూచుని విదేశీ సంగీతం వినడం, రామచంద్ర హార్మోనియం వాయిస్తూ పాడుతూంటే భగవాన్ సలహాలివ్వడం జరుగుతూండేది. లతా మంగేష్కర్ అప్పుడప్పుడే ఖ్యాతిలోకి వస్తున్న గాయని. రామచంద్ర అంటే ఆమెకు ఎంతో ఇష్టం. ఆమెను చక్కగా ఉపయోగించుకుని అజరామరమైన పాటలు అందించాడు సి.రామచంద్ర. సంగీతం సమకూర్చడమే కాక కొన్ని పాటలు పాడేడు కూడా. గాయకుడిగా తను ఉపయోగించిన పేరు చితల్కర్. అది అతని ఇంటిపేరు.



భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన కొత్త రోజుల్లో వచ్చిన సినిమా "అల్‌బేలా". చేవవుంటే పల్లెటూరి గబ్బిలాయి కూడా తారాపథంలో దూసుకు పోగలడన్న ఆశ రగిలించింది యువతరానికి. 50 వారాలు ఆడింది. కొన్నిచోట్ల రాజ్‌కపూర్ 'బర్సాత్'ను మించి ఆడింది. డబ్బు కురిసింది. భగవాన్ చుట్టూ భజనపరులు చేరారు. 7 కార్లు, చెంబూరులో బంగళా - ఇలా సకల సౌకర్యాలు అనుభవించాడు. దరిమిలా అన్నీ పోయాయి. 600 చిత్రాలలో నటించి, 27 సినిమాలు నిర్మించిన ఈ కురువృద్ధుడు ఈ రోజు దాదర్‌లో ఒక చాల్‌లో తలదాచుకున్నాడు. పెళ్లి కాని ఓ కూతురు. అందరికంటె చిన్నకొడుకు సచిన్ అతనితో ఉంటున్నారు. సచిన్ ఏడ్ ఫిల్మ్సులో అసిస్టెంట్ కెమెరామన్‌గా పని చేసి, తండ్రి బాగోగులు చూసుకోవడానికి ఉద్యోగం వదిలేసాడు. బాగున్న రోజుల్లో భగవాన్ వెంట తిరిగిన మిత్రులందరూ కంటికి కనబడకుండాపోయారు. ఇప్పటికీ అతన్ని పలకరించేవారు - సునీల్‌దత్, జానీలీవర్, సత్యేన్‌కప్పూ, రజామురాద్, దిలీప్ కుమారైతే మరీను. ఆ వీధిలోంచి వెళుతుంటే ఆగి కారు హారన్ కొట్టి భగవాన్ బయటకు వచ్చి పలకరించేదాకా ముందుకు సాగడు.



భగవాన్ అనగానే గుర్తుకు వచ్చేది - "అల్‌బేలా" (1951) చిత్రం. సూపర్, డూపర్ హిట్. అప్పటికే భగవాన్ నలభయ్యవ పడిలో పడ్డాడు. స్థూలకాయం. ఒళ్లు కదల్చలేకుండా ఉన్నాడు. అందం అసలే అంతంతమాత్రం. హీరోయిన్ చూడబోతే గీతాబాలి. అందగత్తె, యౌవనంలో ఉంది. వీరిద్దరి జోడీని చూపి ప్రేక్షకులను కన్విన్స్ చేయడం ఎలా? పాత్రధారుల కనుగుణంగానే కథ రూపొందింది. ఒక పల్లెటూరి బైతు (భగవాన్ అలాగే ఉంటాడుగా) నాటకాల పిచ్చితో బొంబాయి పారిపోయి వచ్చి నాటకాల్లో హీరోయిన్ వేషాలేసే అమ్మాయి ఇంట్లో వంటపనికి కుదురుతాడు. అతని అమాయకత్వం ఆమెను ఆకట్టుకుంటుంది. తన డాన్సు ట్రూప్‌లో ఛాన్సు ఇస్తుంది. అతన్ని తీర్చిదిద్దుతుంది. చివరికి తను ఎంతో ఆరాధించే ఆ అమ్మాయే తనను ప్రేమిస్తోందని తెలిసి కథ నాయకుడు ఆశ్చర్యపడతాడు. పెళ్లాడతాడు.

తెలుగు చిత్రసీమలో నాగభూషణం యవ్వనంలో ఉన్నప్పుడు పెద్దగా వేషాలు రాలేదు. 'ఉమ్మడి కుటుంబం'లో నడివయస్సు పాత్రలు వేసిన దగ్గర్నుంచి చాలా ఆఫర్లు వచ్చాయి. హీరో వేయాలన్న కోర్కె తీర్చుకోవడానికి స్వంత సినిమా తీద్దామనుకున్నాడు. కాంచన హీరోయిన్, నాగభూషణం హీరో అంటే ఎవరు చూస్తారు? వాళ్లకు సరైన కథ దొరుకుతుందా? దొరికింది. "అల్‌బేలా" అందివచ్చింది. "నాటకాలరాయుడు"గా పునర్నిర్మించారు. పాటల్లో కొన్నిటిని యథాతథంగా తీసుకున్నారు. "నీలాల కన్నుల్లో మెలమెల్లగా" పాట "ధీరే సే అజారే అఖియన్ మే" 'ఓ బుచ్చిబాబు' పాట 'ఓ బాబూజీ' పాటకు అనుకరణ.



"అల్‌బేలా" హిట్ అయ్యాక అదే ఊపులో అదే టీముతో "ఝమేలా" (1953) తీసాడు. అది ఫెయిలయింది. "భాగంభాగ్" (1956) కిశోర్ కుమార్‌తో తీసాడు. "లాబేలా" (1966) తీసాడు. అల్‌బేలా మంత్రం మళ్లీ పారలేదు. ఉన్నదంతా ఊడ్చుకు పోయింది. సినీ ఆర్టిస్టు అసోసియేషన్ వాళ్లు 6 ఏళ్లుగా నెలకు 3,000 రూ॥లు పంపుతున్నారు. రెండు మాసాల క్రితమే ఇండియన్ మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్ అసోసియేషన్ వారు నెలకు 5,000/- రూ॥లు ఇవ్వడానికి నిశ్చయించుకున్నారు. అక్కరకు రాని మిత్రుల గురించి అడిగితే 'పోనీయండి, అందర్నీ క్షమించేయండి' అంటాడు తేలిగ్గా. ★




బాపూ రమణల స్నేహబృందంలో ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం ఒకరు. వయస్సులో వారికంటే చిన్నవాడైనా బాలు అంటే వారికి ఎంతో ఆదరాభిమానాలే కాక గౌరవం కూడా! 'మాకు ఆయన పరిచయం కలగడం భగవంతుడిచ్చిన వరం' అని పబ్లిగ్గా అనేటంత గౌరవం అన్నమాట!!.

బాలూ చక్కటి గాయకుడిగా పేరు తెచ్చుకున్నాక, సంగీత దర్శకుడిగా కూడా తన ప్రతిభను చూపించే ప్రయత్నం చేశారు. ఆ రోజుల్లో అంటే 1979లో 'తూర్పువెళ్ళే రైలు' సినిమాకి సంగీతాన్ని అందించే బాధ్యతను బాలూకిచ్చారు బాపూ రమణలు. వారి కాంబినేషన్‌లో అద్భుతమైన పాటలు రూపు దిద్దుకున్నాయి. బాలూకి తొలిసారి ఉత్తమ సంగీత దర్శకుడి అవార్డు ('సినీ హెరాల్డు'వారిది)ని సంపాదించి పెట్టాయి. "ఆసినిమాలో 'చుట్టూ చెంగావి చీర' పాటకి బాపూగారు 'రఫ్ తా రఫ్ తా' గజల్ వినిపించి దాన్ని అనుసరించమన్నారు, చక్కటి పాట తయారయింది" అంటారు బాలు-తన సంగీతంలో వారి పాత్ర గురించి చెబుతూ!



తెలుగులోనే కాదు హిందీ చిత్రసీమకు వెళ్ళినప్పుడు కూడా బాపు రమణలు బాలూను వెంట తీసుకెళ్ళారు. 'హమ్ పాంచ్' సినిమాకి బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ బాలూ చేత ఇప్పించారు, 'బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ స్కోర్డ్ బై యస్.పి. బాలసుబ్రహ్మణ్యం' అని టైటిల్స్‌లో వేయించారు. బాలూ సర్వతోముఖ ప్రతిభను ఎలా వాడుకోవాలో బాపు రమణలకు బాగా తెలుసు. 'జాకీ'(ఓ స్వారీ చేసే నారీ'పాటలో బాపూ గారు అడిగి మరీ ఈలపాట రఘురామయ్యలా గమకం తీయించారు) 'సీతమ్మ పెళ్ళి' సినిమాలకు మ్యూజిక్ డైరక్షన్ అప్పగించడమే కాక 'వంశ వృక్షం' ద్వారా తెలుగు వాళ్ళకి అనిల్‌కుమార్‌గా పరిచయమైన బాలీవుడ్ హీరో అనిల్ కపూర్‌కి బాలూ చేత డబ్బింగ్ చెప్పించారు.

వీరి మధ్య అల్లుకున్న స్నేహలత మరొక మొగ్గవేసింది ఇటీవలే! దాని పేరే 'లీలా జనార్దనమ్'! రమణ గారి వ్యాసంతో బాపూ బొమ్మలతో (వేరే విశేషణాలు అక్కర్లేదు) రూపొందించిన ఈ అరుదైన పుస్తకాన్ని ఒక కలక్టర్స్ ఐటమ్‌గా ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం సమర్పించారు.

ఆ పుస్తకం ఇంట్రోలో బాలూ సహృదయాన్ని, సరసహృదయాన్ని చక్కటి మాటల్లో ఆవిష్కరించారు రమణగారు-'బాలు గోపాలుడికి మేలు మేలు' అంటూ!

"...ఇంతకు ముందు-మూడు పుష్కరాల" నాడు జనార్దనాష్టకం పేరిట బాపు చిత్రాలు వేశారు. దానిని ఆనంద కావ్యమాల ప్రచురణగా -శ్రీ వి.ఎ.కె. రంగారావు గారు ప్రచురించారు. తిరిగి ఇన్నాళ్ళకు శ్రీ బాలుగారు పూనుకొని బాపుగారిచే మరల చిత్రకల్పన చేయించారు. ఈ రాగ రంజిత ప్రబంధాన్ని 'లీలా జనార్దనం' పేరిట సమర్పిస్తున్నారు.

ఆ నాడు రాజులూ ఈ నాడు ప్రజలూ కళాపోషకులు. కానీ ఒక కళాకారుడు మరొక కళను ఈ విధంగా ఆదరించి గౌరవించడం విశిష్టం.

ఒక ఊర్వశి ఒక తిలోత్తమను మెచ్చుకోవడం... ఒక వేణువు మరొక



వేణువుతో శృతి కలపడం.. ఒక రాగం అనురాగంతో జత కలపడం.. ఆ బాలగోపాలుని చేతివేణువై వెలిగే ఈ బాలుగోపాలునికి మేలు మేలు.

ఒక రచయితగా నావందనాలు.

ఇవీ ఆ ఇంట్రోలో కొన్ని భాగాలు.

రమణ వాడిన 'బాలగోపాలుని చేతి వేణువై వెలిగే' అన్న వర్ణన ఖచ్చితంగా బాలూను పులకింపచేసి ఉంటుంది. ఎందుకంటే రమణ రాసిన 'కానుక' బాలూకి అతి ఇష్టమైన కథ ...! ఆ కథలో నాయకుడు శ్రీకృష్ణుడి బాల్య మిత్రుడు. తన మిత్రుని పుట్టిన రోజు కానుకగా అతడు ఒక శృతిశుద్ధమైన వేణువును తయారు చేయడానికి ఒక జీవిత కాలం వెచ్చిస్తాడు. చివరిలో సృష్టిలో పనికిరాని వస్తువు ఏదీ లేదనీ, తాను తిరస్కరించిన వేణువులన్నింటినీ సంస్కరించగల శక్తి ఆ కృష్ణభగవానుడికి ఉందనీ గ్రహిస్తాడు.



బాలూకి ఆ కథ కంఠోపాఠం. ఆకథను ఉద్వేగంతో మిత్రులకు చదివి వినిపించడం ఆయన కిష్టం.

బాలూకు, ఫ్లూటుపై అంత ప్రేమ ఉండడానికి కారణం ఆయన స్వతహాగా ఫ్లూటిస్టు కనుక. ఫ్లూట్ వాయించే రోజుల్లో ఎస్.జానకి సలహాపై తన రూటు మార్చుకుని గాయకుడి మార్గంలో ముందుకి సాగి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్నారు. అయినా ఇప్పటికీ ఫ్లూటు వాయిస్తారాయన.

ఈ పుస్తకంలో బాపు బొమ్మలకు రమణ రాసిన 'శృంగార శాఖా చంక్రమణం'వ్యాసాన్ని అదనపు ఆకర్షణగా అందరికీ అందుబాటులోకి తెచ్చిన బాలుకి వేణుగానలోలుని భక్తులందరి తరపున అభినందనలు!.

ఒడేటి శ్రీ నాగ్




# మెట్టుపల్లాలెన్ని ఎదురైనా లెజెండ్‌గా మిగిలిపోయిన జెర్రీ లూయిస్



జిమ్ క్యారీ వ్యాసంలోను, ఎడ్డీ మర్ఫీ వ్యాసంలోనూ కూడా జెర్రీ లూయిస్ ప్రస్తావన వచ్చింది. జిమ్ క్యారీ ఫిజికల్ కామెడీ జెర్రీ లూయిస్‌ని జ్ఞప్తికి తెస్తుందని మొదటి వ్యాసంలో రాయడం జరిగితే, సినిమాలు ఫ్లాప్ అవుతున్న దశలో జెర్రీ లూయిస్ 'నట్టీ ప్రొఫసరు'ని పునర్నిర్మించి ఎడ్డీ మర్ఫీ పునర్జీవితం.పొందాడని రెండవ వ్యాసంలో ప్రస్తావించడం జరిగింది. 75 ఏళ్ల జెర్రీ లూయిస్ ఇప్పటికీ వార్తలలో కనిపిస్తున్నాడంటే దానికి కారణం అతని బహుముఖ ప్రజ్ఞయే.

జెర్రీ లూయిస్ తన నటజీవితంలో ఎన్నో ఉత్థానపతనాలను ఎదుర్కొన్నాడు. ఒకరంగంలో అంతా అయిపోయిందనుకున్నప్పుడు కొత్తరంగంలో తన ప్రతిభను కనబరచాడు. 'నెవర్ సే డై' అని ఇతనిలాటి వాళ్లను చూసే అంటారనిపిస్తుంది అతని జీవితాన్ని పరికించబోతే...





జెర్రీ లూయీస్ తల్లిదండ్రులు పెట్టిన పేరు కాదు. అమెరికాలోని న్యూజెర్సీలోని నెవార్క్‌లో 1926 మార్చి 16 న పుట్టినపుడు అతని పేరు జోసెఫ్ లెవిచ్. 20ఏళ్లు రాకుండానే అతను షో బిజినెస్ లోకి విరుచుకు పడ్డాడు. ఒంటరిగా కాదు, డీన్ మార్టిన్ అనే సహ హాస్యనటుడితో కలిసి 1945 నుండి ప్రదర్శన లివ్వసాగేడు - నైట్ క్లబ్‌లలో, నాటకవేదికలపై, టెలివిజన్ పై ఇద్దరూ కలిసి ఝంఝామారుతంలా చుట్టుముట్టారు. ఆ జంట అందించిన కొత్తరకం హాస్యం చూసి జనాలు వెర్రెక్కిపోయారు. డీన్ మార్టిన్ మంచి పాటగాడు కూడా. ఉన్నట్టుండి పాట అందుకునేవాడు. జెర్రీ ఓ చిన్నపిల్లవాడు హఠాత్తుగా పెద్దవాడయిపోతే ఎలా ఉంటాడో అలా నటించేవాడు. ('హాఫ్ టికెట్' సినిమాలో కిశోర్ కుమార్ ఇలాటి పాత్రే వేసాడు). జెర్రీ ముఖవికారాలు ఎక్కువగా ప్రదర్శిస్తే, డీన్ మార్టిన్ అందంతో, చక్కని గాత్రంతో ఆకట్టుకునేవాడు.

1949 పాటికి వీరి కీర్తి విపరీతంగా పెరిగిపోవడంతో, హాల్ వాలిస్ అనే నిర్మాత వీళ్లిద్దరినీ వెండితెరకు పరిచయం చేద్దామనుకున్నాడు. ఆ విధంగా 'మై ఫ్రెండ్ ఇర్మా' అనే సినిమాలో వీరు కామిక్ రిలీఫ్ అందించారు. దాన్ని సినీ ప్రేక్షకులు బాగా ఆదరించడంతో ఆ సినిమాకు సీక్వెల్ గా వచ్చిన 'మై ఫ్రెండ్ ఇర్మా గోస్ వెస్ట్' (1950) లో కూడా నటించారు. ఇక అప్పటినుండీ వీళ్లకు ఎదురే లేకపోయింది. 1952 లో 'రోడ్ టు బాలి' 'జంపింగ్ జాక్స్', 1953 లో 'స్కేర్‌డ్ స్టిఫ్', 'ది క్యాడీ', 'మనీ ఫ్రమ్ హోమ్', 1954 లో 'త్రీ రింగ్ సర్కస్' - ఇలా ఎన్నో చిత్రాలు వీరి ప్రతిభకు అద్దం పట్టాయి .

ఈ సినిమాలలో వీరి హాస్యం ఎంత బాగున్నా రంగస్థలంపై వీరి 'లైవ్' ప్రదర్శనలలో ఉన్న జీవం వీటిలో కనబడలేదంటారు విజ్ఞులు. పైగా ఈ సినిమాలలో వీరి పాత్రలు బొత్తిగా మూసపోసినట్టు తయారయ్యాయి. కానీ వీటివల్ల జెర్రీ హాస్యచతురత ప్రస్ఫుటంగా అందరికీ తెలియవచ్చింది. ముఖ్యంగా పేర్కొనదగినవి - 'ఏట్ వార్ విత్ ది ఆర్మీ' (1950) లో 'డ్రాగ్' (ఆడవేషంలో కనబడడం)లో సిల్లీ నటన, 'సైలర్ బివేర్' (1951) లో బాక్సింగ్, 'యూ ఆర్ నెవర్ టూ యంగ్' (1955) లో ఫన్నీగా కోరస్ పాడించడం, 'ఆర్టిస్ట్స్ అండ్ మోడల్స్' (1955) లో కామిక్ బుక్ కలలు కనడం, 'హాలీవుడ్ ఆర్ బస్ట్' (1956) లో సినిమా ప్రేక్షకులను అనుకరించడం,, - ఇవన్నీ జెర్రీ నటనా ప్రతిభకు గీటురాళ్లు.

జెర్రీ లూయీస్, డీన్ మార్టిన్ జంటకు రీమేకులు కలిసివచ్చాయి. 'యూ ఆర్ నెవర్ టూ యంగ్' పాత 'ది మేజర్ అండ్ ది మైనర్' (1942) చిత్రం రీమేకే. 1954 నాటి 'లివింగ్ ఇట్ అప్' 1937 నాటి 'నథింగ్ సేక్రెడ్' రీమేకే. విజయం మనుష్యులను - ముఖ్యంగా కళాకారులను - విడదీస్తుంది కాబోలు. డీన్, జెర్రీల జంట కూడా ఎక్కువకాలం మనలేదు. కొద్ది, కొద్దిగా మనస్పర్థలున్నా పదేళ్లపాటు కొనసాగిన వారి వ్యాపారబంధం చివరికి 1956లో తెగిపోయింది.

జెర్రీ మొదటి సోలో సినిమా 'ది డెలికేట్ డెలింక్వెంట్' 1957 లో రిలీజయ్యింది. అంతకు ముందు నుండీ తను వేస్తున్న పాత్రనే డీన్ మార్టిన్ సహాయం లేకుండా విజయవంతం చేయగలనని నిరూపించుకున్నాడు. "ది శాడ్ సాక్"(1957), 'రాక్-ఎ-బై బేబీ, (1958), 'ది గైషా బాయ్' (1958), 'డోంట్ గివప్ ది షిప్' (1959) వెంట వెంటనే వచ్చాయి. సక్సెస్ అయ్యాయి. పారమౌంట్ స్టూడియోకి కనక వర్షం కురిపించాయి.

1960లో జెర్రీ లూయీస్ డైరక్టరయ్యాడు. అదీ చిత్రంగా, అనుకోకుండా జరిగింది. ఆ ఏడాది క్రిస్‌మస్ సెలవులలో రిలీజవ్వడానికి జెర్రీ లూయీస్ సినిమా ఏదీ పారమౌంట్ స్టూడియో రెడీ చేయలేక పోయింది. దాంతో అతనే ఒక ఐడియా వేసాడు. మియామీలో ఓ హోటల్లో ఒక బెల్‌బాయ్ కేంద్ర బిందువుగా కొన్ని సంఘటనలను గుదిగుచ్చి సినిమాగా తీసాడు. కథ అదీ ఏమీ ఉండదు. ఈ సరికొత్త ప్రయోగంతో సినిమా తీయడానికి జెర్రీలూయీస్ (అతనే హీరో, అతనే కో-రైటరు, అతనే డైరక్టరు)కు ఒక్క నెల పట్టిందంతే! సినిమా బ్రహ్మాండమైన హిట్ అయింది.

ఆ తర్వాత నుండి ఒకపక్క స్వంత చిత్రాలు తీసుకుంటూ మరో పక్క ఇతరుల దర్శకత్వంలో నటించసాగాడు. దర్శకులలో కార్టూన్ డైరెక్టరు, అతని మార్గదర్శి ఫ్రాంక్ తష్లిన్ అతని ఫేవరేట్. పోనుపోను జెర్రీ లూయీస్‌కి అహంకారం పెరిగిపోయి సినిమా అంతా తనే కనబడసాగేడు. దాంతో హాస్యం తగ్గిపోసాగింది. సినిమాలు ఫెయిలవసాగేయి.

ఆ దశలో వెలువడింది 'ది నట్టీ ప్రొఫెసర్' (1963). 'డా॥జెకిల్ అండ్ మిస్టర్ హైడ్' కథ జగద్విదితం. మనిషిలో ఉండే ద్వంద్వ ప్రవృత్తి (మంచీ, చెడూ)ని



ప్రదర్శించిన నవల అది. డా॥జెకిల్ అనే ఒక సైంటిస్ట్ అతి సౌమ్యుడు. అతను ఒక మందు తయారు చేసి తాగుతాడు. దానివల్ల అతని భౌతికంగా, మానసికంగా మార్పులు వచ్చి ఇంకొక వ్యక్తిత్వం బయటపడుతుంది. క్రూరత్వానికి ప్రతిరూపమైన ఆ వ్యక్తి పేరు మిస్టర్ హైడ్. మందుకు విరుగుడు తాగడం ద్వారా మిస్టర్ హైడ్ డా॥జెకిల్‌గా మారిపోతుంటాడు. పెద్ద మనిషిగా తను చేయలేని అకృత్యాలన్నీ ఆ సైంటిస్టు మిస్టర్ హైడ్ రూపంలో చేస్తూంటాడు. చివరికి ఆ వ్యక్తిత్వం రెండుగా చీలిపోయి (స్ప్లిట్ పెర్సనాలిటీ అంటారు) మిస్టర్ హైడ్‌ది పైచేయి అయి కథ విషాదాంత మవుతుంది.

ఈ కథను సరదాగా తన దర్శకత్వంలో తీసాడు జెర్రీ లూయిస్. ముసలి ప్రొఫెసర్‌గా ఒక వేషం. మందు తాగి మారిన కుర్రకారు పాటగాడిగా మరో వేషం. ఈ రెండో పాత్రను డీన్ మార్టిన్ క్యారికేచర్‌గా మలిచేడంటారు కొందరు. వారిద్దరి మధ్య గొడవలొచ్చి విడిపోయేరు కాబట్టి వెక్కిరించినా వెక్కిరించి ఉండవచ్చు. 'ది నట్టీ ప్రొఫెసర్' జెర్రీలూయిస్ మాస్టర్ పీస్ అంటారు విమర్శకులు. ఆ కథ నాలుగు దశాబ్దాల తర్వాత ఎడ్డీ మర్ఫీకు కూడా ఉపయోగించింది.

సినిమాల నుండి టీవీ వైపుకు దృష్టి మరల్చాడు జెర్రీ. అంతకు ముందే అతనూ, డీన్ మార్టిన్ కలిసి 'ది కాల్గేట్ కామెడీ అవర్' 'డీన్ మార్టిన్, జెర్రీ లూయిస్ షో'లు చేసారు పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. తిరిగి టెలివిజన్ రంగానికి వచ్చినప్పుడు, అంటే 1963లో ప్రతీ శనివారం రాత్రి 'టాక్ అండ్ వెరైటీ ప్రోగ్రాం'(ఈ రోజుల్లో శేఖర్ సుమన్ చేసే మూవర్స్ అండ్ షేకర్స్ వంటిది) రెండు గంటలపాటు నిర్వహించడానికి ముందు కొచ్చాడు. ముందు తనే డైరక్టు చేద్దామనుకున్నాడు. కానీ షో ప్రొడ్యూసర్లు ఆఖరి క్షణంలో 'మీరు డైరక్టు చేయక్కరలేదు లెండి' అనేశారు. అతని అహం దెబ్బతింది. అది టివి తెరమీద ప్రేక్షకులకు స్ఫుటంగా తెలిసి పోయినట్టుంది. ప్రోగ్రాం అట్టర్ ఫ్లాపయింది.

చిన్న తెరమీద కనబడిన అసలైన జెర్రీ లూయిస్ ప్రేక్షకులకు నచ్చక పోవడంతో ఆ ప్రభావం అతని సినిమాలమీద కూడా పడింది. అతని మ్యాజిక్ పనిచేయడం మానేసింది. కానీ అది అతను గ్రహించలేక పోయాడు. 1970లో 'హుచ్ వే టు ది ఫ్రంట్?' అనే సినిమా తీసాడు కోటీశ్వరుడైన ప్లేబాయ్ హిట్లర్‌ను ఎదిరించడానికి సైన్యాన్ని సమీకరించడం అనే కథను అల్లుకుని స్వీయ దర్శకత్వంలో సినిమా నిర్మించాడు. తనే ముఖ్య పాత్రధారి. సినిమా ఘోరంగా దెబ్బతింది. దాంతో పదేళ్ళ పాటు సినిమా తెరకు దూరం అయిపోయాడు.

అతను వేషం వేయకుండా డైరక్టు చేసిన ఏకైక చిత్రం 'ఒన్ మోర్ టైమ్'(1970). అతని మిత్రుడు శామీ డేవిస్ జూనియర్ అంతకు ముందే 'సాల్ట్ అండ్ పెపర్'(1968) అనే ఓ నైట్ క్లబ్ కామెడీ తీసాడు. దానికి సీక్వెల్‌గా ఇది తయారయింది. జెర్రీలూయిస్, పీటర్ లా ఫోర్డ్ ఇద్దరూ కలిసి దర్శకత్వం వహించారు. అదీ ఫెయిలయింది. 1967 నుండి 1969 దాకా సాగిన 'జెర్రీ లూయిస్ షో' ఒకటే ప్రజాదరణకు నోచుకుంది.

1980లో జెర్రీ మళ్ళీ తల ఎత్తాడు. 'హార్డ్లీ వర్కింగ్' అనే సినిమా తీసాడు. ఉద్యోగం పోగొట్టుకున్న ఒక సర్కస్ బఫూన్ ఒక దాని తర్వాత మరో ఉద్యోగం చేయబోతాడు. అ సంఘటనలన్నీ (బెల్ బాయ్ గుర్తుకు వస్తోందా?) కలిపి ఇంచుమించు 'వన్‌మాన్ షో' లాటి సినిమా తయారు చేసాడు. ఆ సినిమా మొదట్లో తన పాత చిత్రాలలోని భాగాలు చూపిస్తే 'అసలు సినిమాకన్నా అవే బాగున్నాయి' అన్నారు ప్రేక్షకులు.

జెర్రీ ధైర్యం పుంజుకుని 'క్రాకింగ్ అప్' (స్మార్ గాస్ బోర్డ్ అనే ఇంకో పేరు కూడా ఉంది) అనే సినిమా తీసాడు. తనే హీరో. రకరకాల పాత్రలు వేసాడు. కొన్ని ఊళ్ళల్లో ప్రదర్శించాక ఫెయిలవడంతో వెనక్కి తెప్పించేసుకున్నాడు. అతనికి మళ్ళీ ఊపిరి పోసినది 'ది కింగ్ ఆఫ్ కామెడీ'(1983) అనే సినిమా. దానిలో ఒక టీవీ ఏంకర్-హోస్ట్ (జెర్రీలూయిస్) అంటే వెర్రి పెంచుకున్న వీరాభిమాని (రాబర్ట్ డి నీరో వేసాడీ పాత్ర) ఆ షోలో పడడానికి ఓ అఘాయిత్యం చేస్తాడు. ఇద్దరు నటులూ అద్భుతంగా అభినయించి సినిమాను హిట్ చేసారు. దీనివల్ల మరిన్ని టీవీ సీరియల్స్ వచ్చాయి.

1988-89ల నాటి 'వైజ్ గై' వాటిల్లో ఒకటి. దానితో సినిమా ఛాన్సులు మళ్ళీ వచ్చాయి. 'మిస్టర్ సాటర్ డే నైట్'(1992)లో తన పాత్ర తనే(అంటే జెర్రీ లూయిస్‌గా జెర్రీ లూయిస్) వేసాడు. 'అరిజోనా డ్రీమ్'(1995)'ఫన్నీ బోన్స్' (1995)లో నటించాడు. ఏది ఏమైనా జెర్రీ లూయిస్‌ని ఇప్పటికీ స్మృతిపథంలో నుండి చెరిగిపోకుండా చేస్తున్నవి అతను నిర్మించిన టీవీ సీరియల్సే! అవి చూసిన వాళ్ళందరికీ అతడు ఒక లెజండ్‌గా ఎందుకు నిలిచిపోయాడో అర్థమవుతుంది.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

# ఫాల్కే అవార్డు గ్రహీత ఆశాభోంస్లే



**2000వ సంవత్సరపు దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు ఆశాభోంస్లేకు ప్రదానం చేస్తున్నట్లు గత పక్షంలోనే ప్రకటన వెలువడింది. చలన చిత్రరంగంలో అత్యుత్తమ సేవలు అందించినందుకు వివిధ విభాగాలలోని నిష్ణాతులను సన్మానించడానికి ఉద్దేశించిన ఆ అవార్డు ఆశాకు చాలా ఆలస్యంగా వచ్చిందన్న వ్యాఖ్యలు వినబడ్డాయి.**

వీటిపై ఆశా అభిప్రాయం అడిగితే, "అందరూ అదే అంటున్నారు. నేను ఆశ పెట్టుకోకపోయినా, అన్యాయం జరుగుతోందన్న ఆలోచన నా మనసులో మెదలకపోలేదు. కిశోర్‌కుమార్ వంటి గొప్ప గాయకుడికి కూడా ఈ సత్కారం లభించలేదు. లాబీయింగు చేసి అవార్డు తెచ్చుకోవడం నాకిష్టం లేదు. ప్రతీసారీ నాకు అడ్డుపడే వ్యక్తి ఈసారి సెలక్షన్ కమిటీ జ్యూరీలో లేకపోవడం వల్ల నాకు దక్కింది కాబోలు." అంది.

అవార్డు వచ్చే సమయానికి ఆమె ముంబయ్‌లో తన పిల్లలతో ఉన్నారు. తక్కిన మంగేష్కర్ కుటుంబ సభ్యులందరూ పూనాలో ఉన్నారు. దీనానాథ్ మంగేష్కర్ పేరిట అక్కడ నెలకొల్పిన హాస్పిటల్ ప్రారంభోత్సవానికి వెళ్లారందరూ. నిజానికి ఇది సెంటిమెంటల్‌గా ఫీల్ కావలసిన సమయమే. ఎందుకంటే దీనానాథ్ ఆశా తండ్రి మాత్రమే కాదు, తొలిగురువు కూడా.

దీనానాథ్ మంగేష్కర్ సంతానం అయిదుగురు - లత, మీనా, ఆశ, ఉష కూతుళ్లు. కొడుకు హృదయనాథ్. మద్యపానం కారణంగా చిన్నవయస్సులోనే దీనానాథ్ మరణించారు. ఇంట్లో డబ్బు లేదు. పెద్దకూతురు లత తన కుటుంబభారాన్ని తలకెత్తుకుంది. సినిమాల్లో నటిగా, గాయనిగా పనిచేసి కుటుంబాన్ని పోషించింది. పొట్టకూటికై ఆశా కూడా సంగీతాన్ని ఆశ్రయించింది. 1943లో పదో ఏట ఓ మరాఠీచిత్రం 'మజబల్' లో 'చలాచలా మార్యూనవ్యాబాలా' అనే పాట పాడింది. హిందీలో 'బడీ మా' (1944/45) కోరస్‌లో పాడింది. చెప్పుకోవడానికి తొలి హిందీ చిత్రం 'చునరియా' (1948) అనుకోవచ్చు. మొట్టమొదటిగా సోలో పాడే అవకాశం 'రాత్ కీ రాణీ' (1949)లో వచ్చింది. పెద్దక్క లత అవివాహితగా మిగిలినా ఆశా పదహారేళ్ల వయస్సులో గణపతిరావు భోంస్లే అనే రేషనింగ్ ఇన్‌స్పెక్టర్‌ను పెళ్లాడి కష్టాలు గట్టెక్కుతాయని ఆశించింది. కానీ అక్కడ దారిద్ర్యమే. ఇక మళ్లీ గానకళను ఆశ్రయించక తప్పలేదు. దానికి తండ్రి నేర్పిన విద్య అక్కరకు వచ్చింది.

అవార్డు వచ్చినట్టు తెలియగానే లతా ఫోన్ చేసి అభినందించారు. 'నీకిది ఎప్పుడో రావలసినది' అన్నారట. నిజానికి లతా - ఆశాల బంధం చిత్రమైనదే. స్వంత అక్కచెల్లెళ్లే అయినా వృత్తిరీత్యా పోటీదార్లే. ఆశా లత కంటె ఏడేళ్లు చిన్నది. అక్క చెల్లెళ్ల సంగీతరీతులు వేర్వేరు దారులు పట్టాయి. లతాది మెలోడి ప్రధానం. ఆశాది రసప్రధానం. అక్క నీడనుండి బయటకు రావడానికి ఆశ చాలా ప్రయత్నించి సఫలురాలైంది. అన్ని రకాల పాటలు పాడి తనకు రానిదేదీ లేదని నిరూపించుకుంది. లతా చాలాకాలం క్యాబరే పాటలు పాడేది కాదు. చెల్లెలికే వదిలేసేది. చివరికి



లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ పట్టుదలతో "ఇంతకామ్" సినిమాలో "ఆజానే జా" అనే హెలెన్ డ్యాన్స్‌కి పాటపాడి తనూ తన చెల్లిలికి తీసిపోనని నిరూపించుకుంది. లతా, ఆశా కలిసి హిందీ సంగీత ప్రపంచాన్ని మోనోపలైజ్ చేసేశారనీ, తక్కినవారిని నెవరినీ పాడనిచ్చేవారు కారనీ ఫిర్యాదులున్నాయి. చిత్రం ఏమిటంటే అక్కా చెల్లెళ్లకు కొన్నేళ్లపాటు మాటలే లేవుట. ప్రస్తుతానికి లత గొంతులో జీర వచ్చినా ఆశ గొంతు ఇంకా ఫ్రెష్‌గానే ఉండి కొత్తవాళ్లతో పోటీ పడుతోంది. ఇండీపాప్ పాటల సంగతే కాదు, ఇటీవలి 'లగాన్'లో 'రాధా కైసే సజలే' పాట చూడండి, తీగసాగినట్టు ఎంత అందంగా పాడిందో! స్పర్ధయా వర్ధతే విద్యా అంటారు ఇదే కాబోలు! అక్క ఫోన్ రాగానే ఆశా చాలా గర్వపడిందట.

అవార్డు రాగానే సహజంగానే చాలా ఫోన్లు వచ్చాయి. అందరికంటే ఎక్కువగా ఆమె సంతోషించినది చోప్డా సోదరుల నుండి వచ్చిన ఫోన్‌కాల్స్‌కు, బి.ఆర్.చోప్డా, యశ్‌చోప్డాలు తొలి రోజుల్లో ఆమె అభివృద్ధికి ఎంతో తోడ్పడ్డారు. మొదట్లో ఆశాకే వచ్చినవన్నీ చిన్న బడ్జెట్ సినిమాలే. చాలాభాగం విడుదలకు నోచుకోలేదు. అప్పుడే ఆమె గళంలోని విలక్షణతను గుర్తించిన ఓ.పి.నయ్యర్ చోప్డా సోదరులకు పరిచయం చేసారు. గట్టిగా రికమెండ్ చేశారు. చోప్డా సోదరులు అప్పుడు 'నయాదౌర్' (1957) తీస్తున్నారు. హీరోయిన్ వైజయంతిమాలకు పాడడానికి ఆశాకు అవకాశం ఇచ్చారు. హీరోయిన్‌కు గొంతు ఎరువివ్వగల స్థాయికి ఎదిగిపోయిన ఆశా ఇక తిరిగిచూడలేదు. వెంటనే వచ్చింది 'తుమ్‌సా నహీ దేఖా'. అదీ ఓపినయ్యర్ పుణ్యమే. అప్పటి నుండి గాయనిగా ఆమెకు ఒక వ్యక్తిత్వం ఏర్పడింది.

లతాతో అస్సలు పాటలు పాడించని సంగీత దర్శకుడు ఓపినయ్యర్. ముందులో ఆయన షంషాద్ బేగం, గీతాదత్‌లచే పాడించేవారు. తర్వాత ఆశాతో పరిచయమయ్యాక గీతాను వదిలేసి ఆశాను చేరదీసి పెంచారు. లతాతో ఎందుకు పాడించలేదేమని అడిగినా చాలాకాలం సమాధానం చెప్పని నయ్యర్ ఈ మధ్య మాత్రం "లతా మదన్‌మోహన్ లాటి వారికై పుట్టింది, నా కోసం కాదు" అంటున్నారు. ఆశాలో ఉన్న ప్రత్యేకమైన హస్కీ వాయిస్‌ను డెవలప్ చేసి ఆమెను లతాకంటె విభిన్నంగా తీర్చిదిద్దారు. వారి కాంబినేషన్‌లో అనేక అద్భుతమైన పాటలు వెలువడ్డాయి. 'కల్పనా', 'మేరేసనమ్', 'కాశ్మీర్ కి కలీ' 'ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా', - ఇలా ఎన్నో



## ఆశా గురించి ఇతరులు

"ఏ విషయంలోనైనా అమీతుమీ తేల్చుకోవడం ఆశా తత్వం. వెనకడుగు వేయడం ఆమెకు తెలియదు. ఆ పట్టుదల వల్లనే ఆమె నిరంతరం యౌవనంతో భాసిస్తూ విలక్షణమైన గాత్రంతో ఉన్నతశిఖరాలు అధిరోహిస్తోంది. ఇవాళ ఆమె ఆ స్థానంలో ఉందంటే దాని వెనుక ఎన్నో కష్టనష్టాలు ఉన్నాయి"

**-లతా మంగేష్కర్.**

"ఆమె ఎప్పుడూ ఒక అడుగుముందే ఉంటున్నారు. ఒక అంచనా ప్రకారం ఒకింత రిస్క్‌కు సిద్ధపడి ఆమె నవతరం సంగీత ప్రపంచం లోకి ప్రవేశించారు. గాయనిగా ఆమెకున్న అపూర్వమైన అనుభవం ఈ సరికొత్త అవతారానికి అండగా నిలిచింది."

**-'రాహుల్ అండ్ ఐ' ఆల్బమ్‌ను కంపోజ్ చేసిన లూయిజ్**

"ఆమె హృదయానికి ఇంకా పదహారేళ్లే"

**-ఎ.ఆర్.రెహమాన్**

చిత్రాలు...ఎన్నెన్నో పాటలు. 1972లో ఓపినయ్యర్‌తో విడిపోయాక మళ్లీ ఆయనకు పాడలేదు. వారి కాంబినేషన్‌లో తొలిహిట్ సాంగ్ 'నయాదౌర్'లోని 'మాంగ్‌కే సాథ్ తుమ్హారా' ('నీ తోడు కోరి....) అయితే చివరిపాట 'ప్రాణ్ జాయె పర్ వచన్ న జాయే' (1974)లోని 'చైన్‌సే హమ్‌కో కబీ ఆప్‌నే జీనేన దియా' (నన్ను నువ్వు ఎన్నడూ ప్రశాంతంగా బతకనీయలేదు)! అన్నీ మాధుర్య భరితాలే! అర్థశతాబ్ది దాటినా ఆ మాధుర్యం వన్నె తరక్కపోవడమే ఆశా ప్రత్యేకత! కుర్రకారుతో పోటీపడుతూ 68 ఏళ్ల ఈ గాయని తన గొంతుకి ముసలితనం రాలేదని నిరూపించారు. ఆశా గొప్ప స్టేజి ప్రెజెన్స్ ఉన్న కళాకారిణి. ఏపాటి అసభ్యత లేకుండా ప్రోగ్రాంను లైవ్లీగా రక్తికట్టించడం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య. పాతతరం వాళ్లు ఆశా - ఓపీ పాటలను 'హమ్' చేస్తే, మధ్యతరం వాళ్లు- ఆశా - ఆర్డీ పాటలకు ఉర్రూతలూగితే, కొత్తతరం వాళ్లు ఇండిపాప్ ఆశా పాటలకు ఆడిపాడుతున్నారు. "కొంటెతనాన్ని, శృంగారాన్ని మేళవించి పాడే సామర్థ్యాన్ని ఆమె పదిలంగా కాపాడుకుంటూ వస్తున్నారు. ఆ సామర్థ్యమే మార్కెట్‌ను శాసిస్తోంది'' అంటారు పోలీగ్రామ్ చీఫ్ ప్రోగ్రామర్ వినయ్ సప్రూ.

పాటల్లో ఇంత శృంగారాన్ని ఒలికించగల ఆశా వైవాహిక జీవితం అంత సజావుగా సాగలేదు. ఆమెకు తొలిభర్త ద్వారా ముగ్గురు పిల్లలు- హేమంత్, వర్ష, ఆనంద్. భర్తతో విడిపోయినా (ఆయన 1966లో మరణించాడు) పిల్లల సంరక్షణ బాధ్యత ఆశా స్వీకరించింది. 1952లో ఓపి నయ్యర్ పరిచయ మయ్యారు. 1972లో వారిద్దరి మధ్య మనస్పర్థలు రావడంతో దూరమయిపోయారు. రాహుల్‌దేవ్ బర్మన్‌తో సాన్నిహిత్యం పెరిగింది. వారిద్దరి కాంబినేషన్‌లో తీస్రీమంజిల్ (ఓ మేరే సోనారే), ట్రెయిన్ (మోనికా ఓ మై డార్లింగ్), కారవాన్ (పియా తూ అబ్‌తో ఆజా) వంటి అనేక అద్భుతమైన పాటలు వెలువడ్డాయి. అతను అప్పటికే వివాహితుడైనప్పటికీ పెళ్లాడింది. ఆ వైవాహిక జీవితం కూడా సవ్యంగా సాగలేదు. 1994లో రాహుల్ మరణించాడు. ఇవేవి ఉత్తమ గాయనిగా ఆమె ఎదగడానికి అడ్డు రాలేదు. "నాకు ఏది ముఖ్యమో స్పష్టంగా తెలుసు. ముందు నేను తల్లిని. ఆ తరువాత గాయనిని. భార్యగా లేదా ప్రేయసిగా నా పాత్ర ఆ రెండింటి తరువాతే. మొదటి రెండు

# 'పాటల నవబాల ఆశాభోంస్లే'

"హమ్ ఆఖిరీ మొగల్ హై, పురానే జమానేకి హమ్‌దో హీ హై, మీఠా వో గాతీ థీ, నమ్‌కిన్ మై గాతీ థీ'' (గత కాలపు వైభవాలకు చిహ్నాలం మేం. తియ్యటి పాటలు తను పాడితే, మసాలా పాటలు నేను పాడేదాన్ని). ఈ మాటలు ఆశాభోంస్లేవి. అన్నది తన గురించీ, తన సోదరి లత గురించి, నిజమే, భారతీయ సినీసంగీతానికి వారిద్దరూ సామ్రాజ్ఞులే! ఆ తరానికి, సంప్రదాయానికి చెందినవారు వీరే! మనసుకు ఇంపైన పాటలు లత పాడితే, మనసును పరుగులు తీయించే పాటలు ఆశా పాడింది. పైగా ఇద్దరూ శతాబ్దాల మధ్య వారధిగా నిలిచారు. ఇటీవల మే నెలలో ఆమె విడుదల చేసిన "ఆప్‌కీ ఆశా" ఆసేతుశీతాచలమే కాదు, ప్రపంచం మొత్తం మీద పరుగులు తీస్తోంది.

## ఆమె జీవిత విశేషాలు-

**జననం:** మహారాష్ట్రలోని సాంగ్లీలోని 'గోవర్', 1933 సెప్టెంబరు 8న.

**గురువులు:** నవరంగ్, తండ్రి దీనానాథ్ మంగేష్కర్,

పాడిన పాటలు: హిందీలో 8000, మరాఠీలో 1200, గుజరాతీలో 450లతో కలుపుకుని 14 భాషల్లో మొత్తం 12,000 పాటలు పాడింది. ఇప్పటికి కూడా ఆశా గొంతు వసివాడలేదనడానికి తార్కాణం - రంగీలా, దిల్‌తో పాగల్ హై, తాల్, దౌడ్, ప్యారే తూనే క్యాకియా లలో ఆమె పాడిన సోలో నంబర్లు. ఆమె ఆల్బమ్స్ - రాహుల్ అండ్ ఐ, ఒన్స్‌మోర్, జానమ్ సమఝా కరో(తొలి ఆల్బమ్) - ఇవన్నీ హిట్సే. అద్నన్ శామీతో కలిసి చేసిన కభీతో నజర్ మిలావో ఆల్బమ్ టాప్ చార్ట్‌లో ప్రథమస్థానం నుండి చాలా వారాల పాటు దిగను పొమ్మంది.

ఇంగ్లండు వెళ్లినప్పుడు బాయ్ జార్జ్‌తో కలిసి "బౌ డౌన్ మిస్టర్" అనే గీతాన్ని పాడింది. ఇటీవల కోడ్‌రెడ్‌తో కూడా కలిసి ఓ పాట పాడింది.

**ఏవార్డులు** - ఫిలింఫేర్ అవార్డులు - 8, జాతీయ ఉత్తమగాయనిగా - 2 లతామంగేష్కర్ అవార్డ్ (మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఇచ్చేది)

**చెప్పుకోదగ్గ ఇంకో విషయం** - 'ప్లానెట్ హాలివుడ్' అనే సంస్థ ప్రసిద్ధి చెందిన హాలివుడ్ నటీనటులను ఆహ్వానించి వారి చేతి ముద్రలను తడిమట్టిలో భద్రపరుస్తోంది. ఆ గౌరవం తొలిసారిగా భారతీయుల్లో దక్కినది ఆశాభోంస్లేకే!

**నటన** - మరాఠీ చిత్రం మజబుల్ (1944), హిందీ చిత్రాలు బడీ మా (1945) టాక్సీ టాక్సీ (1977)లోను నటించింది.

## తనకు నచ్చిన పాటలు

టాప్‌టెన్

1) చురాలియా (యాదోం కీ బరాత్)
2) కంబఖ్త్ ఇశ్క్ (ప్యార్ తూనే క్యాకియా)
3) ఇన్ ఆంఖోంకి మస్తీ (ఉమ్రావ్ జాన్)
4) ఓ మేరే సోనారే (తీస్రీమంజిల్)

విషయాలలో అడ్డంకులు ఎదురైతే, వ్యక్తిగత అనుబంధాలను నిర్దాక్షిణ్యంగా తెంచుకున్నాను'' అంటుంది ఆశా.

అందుకే 1969లో రాక్, '80లలో డిస్కో, '90లలో పాప్ - భజన్, ఘజల్స్‌ల సంగతి సరేసరి - ఇలా అడుగుపెట్టిన చోటల్లా ఆశా ఉన్నత శిఖరాలు అధిరోహిస్తూనే పోయింది. తన ముద్ర తరతరాలు నిలిచేట్లు చూసుకుంది. ఇక చేయడానికి ఆమెకు మిగిలిందేముంది? అనిపిస్తుంది.ఉందనే అంటోంది ఆశా. "పిల్లల గురించి ఏదైనా చేయాలి. ఏం చేస్తానో ఇప్పుడే చెప్పను. ఈ రంగంలో వడియాలు కాజేయడం ఎక్కువ'' అంది ఆశా నవ్వుతూ''.

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**

# తెలుగులో ఆశా

తెలుగులో 'పాలు నీళ్లు' చిత్రంలో సత్యం సంగీత దర్శకత్వంలో తొలిసారిగా ఆశా పాడింది. (పాట పల్లవి 'ఇది మౌనగీతం') తర్వాత చిన్ని కృష్ణుడు, అంతం, పవిత్రబంధం, అశ్వమేధం చిత్రాల్లో పాడడం జరిగింది. జంధ్యాల దర్శకత్వంలో తీద్దామనుకున్న 'హరి కీర్తనాచార్య అన్నమయ్య' చిత్రానికై రమేష్‌నాయుడు సంగీత దర్శకత్వంలో ఆశాపాడిన 'సత్యభామ సరసపు నగవు' వంటి అన్నమయ్య గీతాలు పరమాద్భుతంగా ఉంటాయి. తెలుగేతరులు పాడినట్టు ఉండవు. తెలుగు మాతృభాషగా గల వారికే నోరు తిరగడం కష్టమైన 'లాలనుచుపోసేరు లలన లిరుగడల' పాటను ఆశా సునాయాసంగా పాడడం చూస్తే అబ్బురమనిపిస్తుంది.

తనతో తెలుగుపాట తొలిసారిగా పాడించిన సంగీత దర్శకుడు కీ॥శే॥ సత్యం అంటే ఆశాకు ఎంతో గౌరవం. మద్రాసుకి ఆవిడ ఎప్పుడైనా వస్తే ఎన్నాళ్లు ఉంటే అన్ని రోజులూ బ్రేక్‌ఫాస్ట్‌కి సత్యం ఇంటి నుంచి ఉప్మా వెళ్లి తీరాల్సిందే. 'అది లేనిదే ప్రభువులు ముద్దయినా ముట్టరు తెలుసా?, అని మాయాబజార్‌లోని డైలాగ్ లాగ సత్యం ఇంటినుంచి వచ్చే ఉప్మా తిన్న తర్వాతే ఆమెకు మిగిలిన దినచర్య సాగేది - సం॥

5) ఆయియే మోహర్‌బాన్ (హౌరా బ్రిజ్)
6) భవ్‌రా బడా నాదాన్‌హై (సాహిబ్ బీబీ ఔర్ గులామ్)
7) జానే జా (జవానీ దివానీ)
8) సాథీ రే భూల్ న జానా
9) నిగాహే మిలానేకో జీ చాహతా హై (దిల్ హీ హై)
10) రంగ్ దే (తక్షక్)

తరువాత -పియా పియా మోరా జియా పుకారే (బాప్‌రే బాప్ - 1955)
ఛోడ్ దో అంచల్ జమానా క్యా కహేగా (పేయింగ్ గెస్ట్ - 1957)
అబ్‌కే బరస్ (బందిని - 1963)
కాలీ ఘటాయే (సుజాత - 1959)
ఆంఖోంమే క్యాజీ (నౌదో గ్యారా - 1957)
యే రాతే, యే మౌసమ్ (ఢిల్లీ కా ఠగ్ - 1958)
ఉడే జబ్ జబ్ జుల్ఫే తేరీ (నయాదౌర్ - 1957)
భవరాఁ బడా నాదాన్ హై (సాహిబ్ బీబీ ఔర్ గులామ్ - 1962 )
అవో హుజూర్‌తుమ్‌కో (కిస్మత్ - 1968)
హాల్ కైసా హై జనాబ్‌కా (చల్తీకానామ్ గాడీ - 1958)
అరెయారోం మేరీ తుమ్‌భీ హో గజబ్ (తీన్ దేవియా - 1965)
ఆంఖోంసే జో ఉత్‌రీ హై దిల్‌మే (ఫిర్ వహీ దిల్ లాయా హూఁ 1963)
తుమ్‌కో తో కరోడోం సాల్ హువే (సంబంధ్ - 1970)
భలీభలీ సీ ఎక్ సూరత్ (బుడ్డా మిల్‌గయా - 1971)
ఓ సాథీ చల్ (సీతా ఔర్ గీతా - 1972)



నీంద్ చురాకే రాతోమేఁ (షరీఫ్ బద్మాష్ - 1973)
చైన్ సే హమ్‌కో కభీ (ప్రాణ్ జాయే పర్ వచన్ న జాయే - 1974)
పియా తూ అబ్ తూ ఆజా (కార్‌వాన్ - 1971)
యేహై రేశ్మీ జుల్ఫోంకా అంధేరా (మేరే సనమ్ 1965)
పర్దేమే రహనే దో (షికార్ - 1968)
దమ్ మారో దమ్ (హరేరామ హరేకృష్ణ - 1971)
యహ్ లడ్కా హై అల్లా (హమ్ కిసీసే కమ్ నహీ - 1977)
యహ్ మేరా దిల్ ప్యార్‌కా దీవానా (డాన్ - 1978)
సునియే కహియే (బాతోం బాతోం మే - 1979)
జాయియే ఆప్ కహా జాయేంగే (మేరే సనమ్ - 1965)
ఝుమ్కా గిరారే బరేలికీ బజార్ మే (మేరా సాయా - 1966)
దునియా మేఁ లోగోంకో (అప్నాదేశ్ - 1972)
మన్‌క్యోం బహ్‌కారే (ఉత్సవ్ - 1985)
కత్రా కత్రా (ఇజాజత్ - 1987)
తన్హాతన్హా (రంగీలా - 1995)

**- సి. హెచ్. లక్ష్మి**

# ఆశాగురించి ఓపి నయ్యర్‌తో






**ఆశాను గాయనిగా మలిచిన ఓపినయ్యర్ వాళ్లు విడిపోయిన తర్వాత నిశ్శబ్దాన్నే పాటించారు. 1997లో ఒక పత్రికకు ఇచ్చిన అరుదైన ఇంటర్వ్యూలో మాత్రం కొన్ని విశేషాలు వెల్లడించారు.**

**ఆ ఇంటర్వ్యూలో కొన్ని భాగాలు-**

**వ్యక్తిగతంగా, వృత్తి రీత్యా తన జీవితంలో అత్యంత ప్రధాన పాత్ర పోషించినదెవరంటే....**

"అన్నీ పోగొట్టుకున్న తర్వాత, జీవితంలో వసంతం, శిశిరం అన్నీ చూసేసిన ఈ 72 ఏళ్ల వయస్సులో నేను దాచేది ఏముంది? నా జీవితంలో అతి ముఖ్యమైన వ్యక్తి ఆశా భోంస్లేయే. నాకు తారసిల్లిన ఉత్తమ స్త్రీ ఆమె".

**ఆశాతో పరిచయం గురించి-**

"1952లో 'చమ్ చమా చమ్" సినిమాకు సంగీత దర్శకత్వం వహిస్తుండగా ఆమె నాకు పరిచయమయ్యింది. ఓ పాట రికార్డయ్యాక, నేను ఆమె వీపుతట్టి 'నువ్వు బాగా పాడతావు' అన్నాను. అప్పుడు నా భార్య కూడా నా పక్కనే ఉంది. ఆ తర్వాత పరపురుషులు తనను తాకడం ఇష్టం ఉండదని ఆశా నా భార్యకు చెప్పిందట. మా ఆవిడ నాకా విషయం చెప్పి ఆడవాళ్లను మెచ్చుకొనేటప్పుడు జాగ్రత్తగా ఉండండని హెచ్చరించింది. దరిమిలా ఆశా నా ఫేవరెట్ సింగర్ అయిపోయింది. 1959 నుండి వృత్తిరీత్యానే కాకుండా, ఎమోషనల్‌గా కూడా ఇన్వాల్వ్ అయింది. 1972 ఆగస్టు 5న మేమిద్దరం విడిపోయాం".

**గాయనిగా, స్త్రీగా ఆశా గురించి-**

"స్త్రీగా, తల్లిగా ఆమె ఒక అద్భుతమైన వ్యక్తి. ముందులో చాలా అమాయకురాలిగా ఉండేది. సూటిగా మాట్లాడేది. క్రమేపీ లోకం పోకడ నేర్చింది. ఫ్రాడ్‌గా తయారయిందది. అది సహజమే! గాయనిగా నా పాటలకు పూర్తి న్యాయం చేకూర్చింది. అలాగే ఆమె తక్కిన వారికి పాడినా నా పాటల్లో పాడినంత అందంగా వుండవని అంటారు నా అభిమానులు".

**తక్కిన గాయనీమణులను వదిలివేయడం గురించి-**

"ఆశా కారణంగానే నేను షంషాద్‌బేగం, గీతాదత్‌ల పాడించడం మానేసేనన్న విషయం వాస్తవమే! ఓ రోజు రాత్రి 1.30కు గీతా ఫోన్ చేసి "నేనేం తప్పు చేశానని నా చేత పాటలు పాడించడం లేదు?" అని అడిగింది. నేను చాలా గిల్టీగా ఫీలయ్యాను. ఇది 1964లో జరిగింది. అప్పటి నుండి ఇప్పటిదాకా ఆ ప్రశ్న నన్ను వెంటాడుతూనే ఉంది".

**విడిపోవడానికి కారణం ఏమిటని అడిగితే-**

"నాకు జ్యోతిష్యం తెలుసు. ఎన్నడో ఓ నాడు మేం విడిపోతామని తెలుసు. నన్ను అప్‌సెట్ చేసే ఒక విషయం జరిగింది. ఇక నేను ఆమెను విడిచి పెట్టేశాను".

**ఆర్‌డీ బర్మన్ ఆశాకు ఇచ్చిన ప్రాధాన్యత గురించి-**

"ఆర్‌డి తన బెస్ట్ కాంపోజిషన్స్ లతాకే ఇచ్చాడు. 'అమర్‌ప్రేమ్' 'కటీపతంగ్' పాటలు చూడండి. రెండో రకంవే ఆశాకు ఇచ్చాడు".

**మళ్ళీ కలిసిపనిచేస్తారా అన్న ప్రశ్నకు-**

"1996లో జావేద్ అఖ్తర్ ఒక ఆల్బమ్ తెస్తానని ప్రతిపాదన చేశాడు. ఆయన రాసిన పాటలు ఆశా పాడాలిట. నేను సంగీతం సమకూర్చాలట. నేను రిటైరయిపోయాను కాబట్టి వద్దనేశాను".

**ఆశాతో కలిసి పనిచేసిన పది మంచిపాటలు చెప్పమంటే**

"ఛోటాసా బలమా" - రాగిణి (1958)
"బేకసీ హద్‌సే" - కల్పనా (1966)
"జాయే జహా॰ మేరీ నజర్" - కల్పనా (1966)
"ఫిర్ తేస్ లగీ దిల్ కో" - కాశ్మీర్ కీ కలీ (1964)
"జాయియే ఆప్ కహా॰ జాయింగే" - మేరే సనమ్ (1965)
"హమ్‌నే తో దిల్ కో ఆప్‌కే కద్మోం పర్ రఖ్ దియా" - (రఫీతో కలిసి) - మేరే సనమ్ (1965)
"యేహై రేశమీ జుల్ఫోంకా అంధేరా" - మేరే సనమ్ (1965)
"వో హస్‌కే మిలే హమ్‌సే" - బహారే॰ ఫిర్ భీ ఆయేగి (1966)
"అకేలీ హూ॰ మై॰ పియా ఆ" - సంబంధ్ (1970)
"చైన్ సే హమ్ కో కభీ" - ప్రాణ్ జాయే పర్ పచన్ నా జాయే (1974)

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**



గాయనిగా ఆశాపై ఒక సువెనీర్‌లో ఓపినయ్యర్ వెలిబుచ్చిన అభిప్రాయం ఆయన స్వదస్తూర్తిలోనే చూడండి.....





9 T 9 = 99

-బి.రమేష్, ఎలమంచిలి.

, క్షి .... చీర కట్టుకుని ——ఇంటికి 1/4రాలను చూడడానికి వెళ్ళింది.

(కామాక్షి చుక్కల చీర కట్టుకుని గీత ఇంటికి పావురాలను చూడ డానికి వెళ్ళింది)

1/2 టి = అరటి

-ఆర్.ప్రసాద్‌రావు, రెడ్డిపల్లి.

## డబుల్ రోల్



నా 'వాచి పోయింది' అని చెప్పగానే
మానాన్న కొట్టిన దెబ్బకు నా గూబ 'వాచి పోయింది'

-వి. రవితేజ, సూర్యాపేట.

'కల్పనా' ఈ పాలలో నీళ్ళు 'కల్పనా' !?

-ఎం. శ్రీతేజ, విజయవాడ.

రామన్న 'చేపలు' పట్టే పనిని 'చేప'ట్టాడు

-ఎం. హరీష్, విజయవాడ..



## పేరు-రిపేరు

- ఆకాశ వీధిలో- జాబిలి - చాలా బాగుంది
- సఖి - మనసంతా నువ్వే - ప్రేమ సాక్షిగా -ఇదే నా మొదటి ప్రేమలేఖ
- అమ్మాయే నవ్వితే -నాలోవున్న ప్రేమ - చెప్పాలనివుంది

- భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్




## ఈ రూటే వేరు




చుట్టాలు : చుట్ట తాగు భార్య

వై జాగు : ఎందుకు ఆలస్యం !?

-జి.యమ్. మధుక

బీట్రూటు : బీటు కొట్టుటకు అనువైన మార్గము

జె.పి.వి. సుబ్బయ్య, అనంతపురం



## కొంటె కొశ్నెన్లు

## తుంటరి జవాబులు

**బి. శాండిల్య - బరోడా**

వాయిదావెయ్యలేనిది?

దురద పుడుతుంటే గోక్కోవడం

**డి. మురళి -అమీర్‌పేట**

ఫస్ట్ డిటెక్టివ్, ఫస్ట్ హిప్నాటిస్ట్, ఫస్ట్ మెజీషియన్, ఫస్ట్ వెంట్రిలాక్విస్ట్, ఫస్ట్ మిమిక్రీ ఆర్టిస్టు, ఫస్ట్ టెస్ట్‌ట్యూబ్ బేబి ఎవరో మీకు తెలుసా?

తెలుసు. సీత ఎక్కడుందో కనుక్కున్న హనుమంతుడు ఫస్ట్ డిటెక్టివ్, అతని బలాన్ని అతనికి తెలియజెప్పి నమ్మకం కలిగించిన జాంబవంతుడు ఫస్ట్ హిప్నాటిస్ట్, నోట్లోనే పధ్నాలుగు లోకాలు చూపించిన శ్రీకృష్ణుడు ఫస్ట్ మెజీషియన్, కోడి గొంతును అహల్య కోసం అనుకరించిన ఇంద్రుడు ఫస్ట్ మిమిక్రీ ఆర్టిస్టు, రాముడి గొంతును మిమిక్రీ చేసి వాయిస్‌ని త్రో చేసిన మారీచుడు ఫస్ట్ వెంట్రిలాక్విస్ట్, తల్లి గర్భంలో కాకుండా కుండలో జీవం పోసుకున్న ద్రోణాచార్యుడు ఫస్ట్ టెస్ట్‌ట్యూబ్ బేబి!.

## పేరడీ పెరేడ్



(హఠాత్తుగా మద్యనిషేధం వచ్చేస్తే అనే ఊహకు స్టూడెంట్ నెం. 1 సినిమాలో 'ఇక్కడే పుట్టి' అనే పాటను జోడించగా వచ్చిన పేరడీ ఇది.....)

మందుబాబులు:

ఓ "మైడియర్" ఫ్రెండ్స్.... డియర్ బూజర్స్...డియర్ ఓనర్స్
మందు మిత్రులారా
ఇక్కడే తాగి ఇక్కడే తూలి ఇక్కడే దొర్లాము
మందులమ్మ కల్లుపాకలో
వీడలేమంటు వీడుకోలంటూ వీడిపోతున్నాము
మద్యనిషేధమ్ము దెబ్బతో
వుయ్ మిస్ ఆల్ ది లక్ వియ్ మిస్ ఆల్ ది కిక్
వుయ్ విస్ యూ
కిడ్డీ బాంకులోన పిల్లలు దాచిన చిల్లర పైసలు
పోపు డబ్బాలోన పెళ్ళాలు ఉంచిన పొదుపు డబ్బులు
ఫ్యూచర్ కోసం పెద్దలు ఇచ్చిన ఆస్తిపాస్తులు
పెళ్ళి టైములోన అత్తారుపెట్టిన నగలు, పుస్తెలు
బామ్మర్ది పెట్టిన గొడుగు, చెప్పులు
బిందెలు చెంబులు వెండి గ్లాసులు
బంధువులు ఇచ్చిన పెళ్ళిగిఫ్టులు
స్నేహితులిచ్చిన హ్యాండులోనులు
మందుకొరకు అమ్మినట్టు గురుతులుండి
ఇంకేమైనా మిగిలుంటే మన్నించండి



కల్లుపాక యజమానులు:

సెంటిమెంటు మాటలింక ఒగ్గేయండి
ఈ సిగ్గు ఎగ్గులన్ని ఒదిలి పెగ్గేయండి
వుయ్ మిస్ ఆల్‌ది లక్
వుయ్ మిస్ ఆల్ ది కిక్
వుయ్ మిస్ యూ.

-పంపినవారు: రాజా అండ్ గోపి, శ్రీకాకుళం

## చిలిపి కవిత

ప్రేమిస్తే థిల్లు
పెళ్ళయితే డ్రిల్లు
ప్రేమిస్తే అంధత్వం
పెళ్ళయితే బధిరత్వం
ప్రేమ పెళ్ళికి పునాది
పెళ్ళి ప్రేమకు సమాధి.

-కుంచంరాజశేఖర్, విజయవాడ

మా పెళ్ళయిపోయింది



## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

# మెహబూబా...

**చిత్రం : అజ్‌నబీ**
**బేనర్ : ఫిల్మ్ ఫోక్స్**
**గీత రచన : సమీర్**
**సంగీతం : అనూ మల్లిక్**
**పాడినది : అద్నన్ శామీ, సునిధి చౌహాన్**
**అభినయించినది : అక్షయ్ కుమార్, బిపాశా బసు, బాబీ దేవల్, కరీనా కపూర్**

ఈ నాడు ఓ మాదిరిగా హిట్ అయిన హిందీ సినిమాలలో అజ్‌నబీ ఒకటి. మన వాతావరణానికి సరిపడని కథను చాలా ధైర్యంగా తెరకెక్కించారని చెప్పాలి. చివరికి క్రైమ్, మిస్టరీ సినిమాగా మలిచినా ముందంతా భార్యల్ని మార్చుకోవడం మీదే కథ నడుస్తుంది. ఆంగ్లచిత్రం 'కన్సెన్‌టింగ్ అడల్ట్స్' ఆధారంగా తీసిన సినిమా కాబట్టి ఆ పాత్రల్ని దిగుమతి చేసుకోబోయి తబ్బిబ్బు పడ్డారనిపిస్తుంది. దర్శకులు అబ్బాస్-మస్తాన్‌కి ఈ సినిమా తీయడానికి మూడు సంవత్సరాలు పట్టింది.

బాబీ దేవల్, కరీనాకపూర్ ప్రేమించుకుని పెళ్ళి చేసుకుంటారు. బాబీకు స్విజర్లండ్‌లో పోలో క్లబ్‌లో కోచ్‌గా ఉద్యోగం. అక్కడికి వెళ్తారిద్దరూ. అక్కడ అక్షయ్‌కుమార్, బిపాశా జంట పరిచయమవుతారు. అంతా కలిసి తిరుగుతారు. హాలీడేయింగ్‌కి మారిషస్ వెళతారు. అక్కడ బిపాశా బాబీకి లైను వేస్తుంది. బాబీ ఇబ్బందిపడతాడు. ఇది చాలనట్టు ఓ రోజు అక్షయ్ వచ్చి ఓ రాత్రికి భార్యల్ని మార్చుకుందామని ప్రపోజ్ చేస్తాడు. బాబీ అసహ్యించుకుని, అతనితో పోట్లాడి స్విజర్లండ్‌కి తిరిగివచ్చేస్తాడు. తర్వాత దంపతులిద్దరూ క్షమాపణ చెప్పుకుని మళ్ళీ స్నేహం కలుపుకుంటారు. తర్వాత పుట్టినరోజు పార్టీనాడు అక్షయ్ తన ప్రతిపాదనను మళ్ళీ ముందుంచుతాడు. బాబీ అతన్ని కొడతాడు కానీ ఆశ్చర్యకరంగా బిపాశా బెడ్‌రూమ్‌లో తేలతాడు. మర్నాటికి బిపాశా చచ్చిపడి వుంటుంది. బాబీయే హంతకుడంటాడు అక్షయ్...



ఇలాటి కథ జనాలకు నచ్చుతుందో లేదో తెలియక, ఎందుకైనా మంచిదని ఆఖరినిమిషంలో అద్నన్ శామీ పాట ఒకటి చేర్చారు, డ్యూయెట్‌గా... 'కభీతో నజర్ మిలావో' పాప్ సాంగ్ హిట్ అయిన తర్వాత హిందీ సినిమాలకై తొలిసారిగా పాడడం 'లిఫ్ట్ కరాదే' అంత హిట్ కావడం అద్నన్‌శామీ అభిమానులను అలరించింది. సునీధి చౌహాన్ కూడా అద్నన్ శామీకి తీసిపోకుండా గొంతు కలిపింది.

ఈ పాటకు ముఖ్య ఆకర్షణ అద్నన్‌శామీ పాడడం. పాటలో గొప్ప కవిత్వం, కానీ గొప్ప భావాలు గానీ ఉన్నాయని అనలేం. కొన్ని అందమైన పదాల కూర్పు మాత్రం కనబడుతుంది. హిందీపాటల్లో తరచుగా తారసిల్లే పదాల అర్థం వివరించడానికి ఈ పాట ఉపయోగపడుతుంది. పాట ఎత్తుగడలో వినబడే హోయ్‌లా హిందీ మాత్రమే వచ్చినవాళ్ళను ఇబ్బంది పెడుతుంది. అది నిజానికి మరాఠీ నుండి బొంబాయి హిందీలోకి, తద్వారా హిందీ సినిమాలలోకి దిగుమతి అయింది. హిందీలో 'ఆయా'(వచ్చాడు)ను మరాఠీలో 'ఆలా' అంటారు. 'గోవిందా ఆలారే' (బ్లఫ్‌మాస్టర్‌లో పాట) లో 'ఆలా' ఇదే అర్థంలో వాడారు. అలాగే హిందీ సినిమాల్లో బొంబాయి యాసలో మాట్లాడే పాత్రలు 'హమ్ కరేలా హై' లాటి పదాలు ఉపయోగిస్తాయి. ఇక్కడ తేరా దిల్ హోయ్‌లా (హోగయా అనే అర్థంలో) అని ఉపయోగించారు.

'మెహబూబ్' మాట వినని శ్రోత ఉండడు. మేరే మెహబూబ్ సినిమా కూడా వచ్చింది. సూపర్‌హిట్ పాట 'మేరే మెహబూబ్ తుఝే'వల్ల ఆ పదం

మర్చిపోవడం అసాధ్యం. మెహబూబ్ అంటే అనురాగం గలవారని అర్థం. ప్రేమికులకు పర్యాయపదంగానే వాడతారు. 'సమా' అంటే సమయం. 'సమా హై సుహానా సుహానా' అనే కిశోర్‌కుమార్ పాట (ఘర్ ఘర్‌కీ కహానీ) వినేవుంటారు. యార్ అంటే స్నేహితుడు, ప్రేమికుడు కూడా. 'ఖతా' అంటే పొరబాటు, నేరం అని అర్థం. 'అదా' అనేది అనేక అర్థాల్లో వాడతారు. ఒక వ్యక్తి ప్రత్యేక శైలిని, హావభావాలను ఆదా అంటారు. అందుకే కళాకారుడు అనడానికి అదాకార్ అంటారు. ఆఫ్‌సానా(ఫసానా అన్నా ఇదే అర్థం) అంటే కథ. ఆఫ్‌సానా బన్‌గయా అంటే నా గురించి కథలు, కథలుగా చెబుతున్నారని వాపోయినట్టు. దీవానా అంటే ప్రేమలో పిచ్చివాడు కావడం. మతిభ్రమించి పిచ్చి ఎక్కినవాడిని పాగల్ అంటారు. ఆ పాగల్‌ని ప్రేమపిచ్చికి వాడవచ్చు కానీ ఈ దీవానాను ఆ పిచ్చికి వాడకూడదు. 'వఫా' అంటే విశ్వసపాత్రత, నిజాయితీ. అజూబా అంటే కుతూహలం, అద్భుతం. 'సాత్ అజూబే హై ఇస్ దునియా మేఁ' పాట వినేవుంటారు. బేఖుదీ అంటే మైకం, పరవశం. ప్రేమవల్ల కావచ్చు, మదిరాపానం వల్ల కావచ్చు. 'హమ్ బేఖుదీ మేఁ తుఝుకో పుకారే' అని 'కాలాపానీ'లో పాట గుర్తుండేవుంటుంది.

జిగర్ అంటే హృదయం అని అర్థం. కాలేయం అని కూడా అర్థం ఉంది కానీ, ఇక్కడ హృదయమనే తీసుకోవాలి, ఇది ప్రేమగీతం కాబట్టి, 'జిగర్ కా టుక్‌డా'(హృదయపు తునక) అనని పిల్లలను ఉద్దేశించి మాట్లాడడం సినిమాలలో వినే వుంటారు. ఆ పేరుతో ఓ సినిమా కూడా వచ్చింది. జానే జిగర్, అంతకు ముందు జానే వఫా అని వచ్చిన విషయం గమనించి వుంటారు. అలాగే జానేమన్ అని కూడా అనేక సార్లు వస్తూ ఉంటుంది. జాన్ అంటే ప్రాణం అని అర్థమూ ఉంది. సారం అనే అర్థమూ ఉంది. ఆషిక్ అంటే ప్రేమికుడు. ఆ పేరుతోనూ ఓ సినిమా వచ్చింది. ఆషికీ (ప్రేమ) అనే పేరుతోనూ సినిమా వచ్చింది. సినిమాలో తక్కిన పాటలు కాలక్రమేణా మర్చిపోయినా, ఈ పాట మాత్రం అద్నన్‌శామీ కారణంగా గుర్తుండి పోతుందంటున్నారు విమర్శకులు.



## పాట

అ: ఓయ్లా ఓయ్లా ఓయ్లా ఓయ్లా ఓయ్లా
ఓయ్లా ఓయ్లా ఓయ్లా దిల్ తేరా అబ్ హోయ్‌లా
అ: మెహబూబా మెహబూబా మెహబూబా మెహబూబా
ఆ: తూ సిర్ఫ్ మేరా మెహబూబ్ మైఁ తేరీ మెహబూబా
తుఝే చాహెంగీబడా ఖూబ్ తేరీ మెహబూబా
అ: మైఁ సిర్ఫ్ తేరా మెహబూబ్ తూ మేరీ మెహబూబా
ముఝే చాహెంగీ బడా ఖూబ్ మేరీ మెహబూబా
ఆ: మైఁ జవాఁ జవాఁ యే హసీన్ సమా
ఆ గలే లగా లే యారా
హై ముఝే పతా నా తేరీ ఖతా
తుఝే మేరీ అదా నే మారా
అ: అఫ్సానా బనా దీవానా బనా మైఁ తేరీ లియె దీవానీ
ఓ జానె వఫా హై జుదా జుదా తేరీ మేరీ యహ్ ప్రేమ్ కహానీ
ఆ: సాసోఁ మేఁ మేఁ తూ
అ: మేరీ బాతోం మేఁ తూ
ఆ: కోయీ మానే నహీఁ
అ: కోయీ జానే నహీఁ
అ: తూహీ పెహ్లే తూహీ ఆఖ్రీ అజూబా
ఆ: తూ సిర్ఫ్ మేరా మెహబూబ్ మైఁ తేరీ మెహబూబా
తుఝే చాహెంగీ బడా ఖూబ్ తేరీ మెహబూబా
అ: మైఁ సిర్ఫ్ తేరా మెహబూబ్ తూ మేరీ మెహబూబా
ముఝే చాహెంగీ బడా ఖూబ్ మేరీ మెహబూబా
ఆ: జో దేఖా తుఝే జో సోచా తుఝే మేరా దిల్ యే తుఝ్‌పె ఆయా
హర్ ఖుషీ మిలీ బేఖుదీ మిలీ జో మాంగా థా మైఁ పాయా
అ: తూ కహే అగర్ ఓ జానే జిగర్ తుఝే సోనే సే ఆజ్ సజావూఁ
దిల్ చాహే కరూఁ బాహెూ మేఁ భరూఁ తుఝే తారోం కి సైర్ కరావూఁ
ఆ: మేరా యే దిల్
అ: అబ్ తేరా నహీ
ఆ: యే ఆషికీ
అ: దివాన్‌గీ
మై తేరే ప్యార్ కి సాగర్ మేఁ డూబా
ఆ: తూ సిర్ఫ్ మేరా మెహబూబ్ మైఁ తేరీ మెహబూబా
తుఝే చాహెంగీ బడా ఖూబ్ తేరీ మెహబూబా

## స్వేచ్ఛానువాదం:

అ: ప్రియతమా, ప్రియతమా మనసు
నీదయిందే ప్రియతమా
ఆ: ప్రియతమా, ప్రియతమా
నువ్వు నా వాడివే, నేను నీ దానినే
అ: నిన్నే కోరుతున్నా ఓ నా ప్రియా
నన్నే కోరుతున్నావు ఓ నా ప్రియా
ఆ: పక్కనున్న చిన్నదానిని
చక్కనైన వేళ
కౌగిలికి రా చెలికాడా
నాకు తెలుసు నీ వీక్నెస్సు
నా స్టయిల్‌కి బోల్తాపడ్డావులే
అ: ఓ పిచ్చిదానా నీకై
వెర్రివాడనయ్యా
కట్టుకథగా మిగిలిపోయా
నీదీ, నాదీ ఈ ప్రేమగాథ
నమ్మినదాన, వేర్వేరు కానీయకు
ఆ: ఊపిరిలో నువ్వే
అ: ఊసుల్లో నువ్వే
ఆ: ఎవరైనా కాదన్నా
అ: తెలియదు పొమ్మన్నా
నా తొలిమోజు నువ్వే
నా తుదిమోజు నువ్వే ॥ఆ: నువ్వు॥
అ: నిన్ను చూసాక
నిన్ను తలచాక
నా మనసు నీపై వాలిందే
ఆనందమంతా నాదయిందే
ప్రేమమైకం తోడయిందే
కోరినదల్లా దొరికిందే
అ: నువ్వు సై అంటే, ఓ నా హృదయరాణీ,
బంగారంతో నిన్ను సింగారిస్తా
కోరుకున్నదల్లా చేసేస్తా, బాహువుల్లో బంధిస్తా
తారాలోకంలో షైరు చేయిస్తా
ఆ: నా మనసు
అ: ఇక నీది కాదులే
ఆ: ఈ ప్రేమా
అ: ఈ పిచ్చీ
నీ అనురాగసాగరంలో
తలమునకలై పోయాలే ॥ఆ: నువ్వు॥

# 'వలపుల కథకిది తొలి పలుకు'

ఆరుద్ర ప్రజ్ఞ బహుముఖం. 'సమగ్ర ఆంధ్ర సాహిత్య' రచయితగా సాహితీలోకంలో తన స్థానం పదిలం చేసుకున్న ఆరుద్ర సామాన్యుడికి సినీపాటల రచయితగా ప్రసిద్ధుడు. 'త్వమేవాహం' వంటి క్లిష్ట కావ్యాలు పండితులను మాత్రమే మెప్పించాయి. సినీగీతాలు పామరులను సైతం అలరించాయి. మల్లాది రామకృష్ణశాస్త్రి కవితా భాషా ప్రయోగాలు తమ పాటల్లో అలవోకగా దొర్లించారు. అవి కొంత మందికి అందాయి, కొంత మందికి అందలేదు. కానీ వారి శిష్యుడు ఆరుద్ర తన పాటలు అందరికీ అందుబాటులో ఉండేటట్లు చూసుకున్నారు.




ఆరుద్ర రాసిన 'ఎవరు కన్నారెవరు పెంచారు'(ముద్దు బిడ్డ - 1950) పాటవిని 'పిల్లలు ఎదిగొచ్చారు. ఇక మేము వ్రాయక పోయినా పర్వాలేదు అన్నారట మల్లాది రామకృష్ణశాస్త్రిగారు. ఆయన నమ్మకాన్ని వమ్ముచేయలేదు ఆరుద్ర. రకరకాల పాటలు రాసి, అన్ని రకాల శ్రోతలను మెప్పించారు.

ఈ పుస్తకంలో ముందుమాట రాసిన కె. రామలక్ష్మిగారి మాటల్లో చెప్పాలంటే - "సినిమా పాట విషయంలో ఆరుద్రది చాలా నిర్లిప్తమైన అనురాగం. నేనెప్పుడూ అతని చేతిలో పూర్తి సినిమా పాట కాగితాన్ని చూడలేదు. అతనికి పాట రచన వృత్తి. సాహిత్యం ప్రవృత్తి. ఈ ప్రవృత్తికి సినిమాపాట - బంగారు పళ్ళేనికి గోడదాపు. సినిమా పాటల రచనవల్ల వచ్చిన దానిలో చాలా మటుకు - సాహితీ సంపద సేకరించడానికే వినియోగించాడు ఆరుద్ర, ఎక్కడేనా ' మంచి పాట' రాస్తే ఆ సంగతి నాకు తెలిసిన రచయితలు, నిర్మాతలు చెప్పినదే, కాని తనకై తానెప్పుడూ చెప్పలేదు. క్లబ్బు సాంగ్‌నయినా, భక్తిపాటనైనా, హాస్య గీతినైనా - ఒకే అభిమానంతో రాసిన వ్యక్తి ఆరుద్ర. దేని మీద చిన్నచూపులేదు. 'రాయవలసి వచ్చిందన్న బాధలేదు".

'సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర' రాయడానికి ఆరుద్ర కొంతకాలం పాటు సినిమా పాటలు రాయడం మానేసారని గుర్తుచేసుకున్నవారికి ఆరుద్ర ప్రాధాన్యతలు తెలుస్తాయి. అయినా ఆయన సినిమారంగానికి తన పాటలద్వారా ఎంతో సేవ చేశారు. చిరకాలం నిల్చిపోయే గీతాలు సృష్టించారు.

ఆరుద్ర మిత్రులు, సంగీత, నృత్య విమర్శకులు వి.ఎ.కె. రంగారావు గారు ఆరుద్ర పాటలను 'కొండగాలి తిరిగింది' పేరుతో పుస్తకం వేశారు మూడు దశాబ్దాల క్రితం. దాన్ని పాకెట్ బుక్ సైజులో ఎమెస్కోవారు ప్రచురించారు. ఆ పుస్తకంలో రంగారావుగారు ఆయా పాటలు లభించే గ్రామఫోన్ రికార్డు నెంబర్లతో బాటుయిస్తూ చిత్రాల పరంగా, గీతాల పరంగా అకారాది పట్టిక కూడా చేర్చారు. ఆ తర్వాత ఆరుద్ర ఎన్నో చక్కటి పాటలు రాసారు కానీ అవి పుస్తక రూపంలో రాలేదు. సినిమా నిర్మాతలు, పంపిణీదారులు సినిమా పాటల పుస్తకాలు ప్రచురించే సంప్రదాయాన్ని విడిచి పెట్టేసారు. కాబట్టి ఆ పాటల స్క్రిప్టు సరైన రూపంలో లభించటంలేదు. ఆ లోటు తీర్చబోతున్నారు ఆరుద్ర సతీమణి కె. రామలక్ష్మిగారు.

ఈ పుస్తకం 'ముందు మాట' లో ఆవిడ 'సినీగీతం వినాలి. చూడాలి. చదివితే కనిపించే కవిత్వం తక్కువ', అనేశారు. తగినవారు పాడక, సరైన చిత్రీకరణ జరగక, లేదా సినిమా విజయవంతం కాక ఎన్నో చక్కటి గీతాలు మరుగున పడవచ్చు. సినిమా కోసం కాకుండా విడిగా రాసుకున్న అనేక మధురగీతాలు సినిమాలకు తీసుకున్నప్పుడు సాహితీ సౌరబాలు వెదజల్లడం మానేస్తాయా!?

'సినిమా పాట సాహిత్య ప్రావీణ్యం కలది కాదు' అంటూనే రామలక్ష్మిగారు భర్త సినిమా పాటలను గ్రంథస్తం చేసి ఉంచవలసిన అవసరాన్ని గమనించారులాగుంది. అందుకే నాలుగు సంపుటాలుగా వాటినన్నింటినీ తీసుకువస్తున్నారు. వి.ఎ.కె. రంగారావు గారి సూచన మేరకు ఈ సంపుటాలకు విడివిడిగా పేర్లు పెట్టారు. పేర్లు కూడా ఆయన సూచించినవే.

ఆ ప్రకారం మొదటి సంపుటంలో 1950-1959లలో వెలువడిన సినిమాలలోని పాటలు చోటు చేసుకున్నాయి. సంపుటం పేరు 'వలపుల కథకిది తొలి పలుకు' రెండవ సంపుటంలో 1960-1964 పాటలు -పేరు 'తళతళా మిలమిలా పగటి పూట వెన్నెలా'. 'నవ్వుల నదిలో పువ్వుల పడవ' అనే మూడవ సంపుటంలో 1965-70 పాటలుంటాయి. 1971-76 నాటి పాటలు నాల్గవ సంపుటంగా 'సెలయేటి గలగలా చిరుగాలి కిలకిలా' అనే పేరుతో 1971-76 నాటి పాటలు వస్తాయి.

ఈ సంపుటం 'బీదల పాట్లు'(1950)తో మొదలై 'భక్త అంబరీష'(1959)తో ముగుస్తుంది. ఇవేకాక సౌదామిని, కన్నతల్లి, పరోపకారం, అంతే కావాలి, ప్రేమ లేఖలు, కొంటె కిష్టయ్య, అమర సందేశం, పల్లె పడుచు, బాలానందం, రాజయోగం, బాలానందం, ఆడబిడ్డ, ఆలీబాబా 40 దొంగలు, పెంకి పెళ్ళాం, ముద్దుబిడ్డ, అక్కా చెల్లెళ్ళు, అల్లాఉద్దీన్ అద్భుత దీపం, ఎమ్.ఎల్.ఏ, దాంపత్యం, సతీ

అనసూయ, వీర కంకణం, స్వయంప్రభ, సంపూర్ణ రామాయణం, వీర ఖడ్గం, ఆడ పెత్తనం, దొంగలున్నారు జాగ్రత్త, అత్తా ఒకింటి కోడలే, కూతురి కాపురం, సతీ తులసి, జయభేరి, ఇల్లరికం, చెంచు లక్ష్మి, మా ఇంటి మహాలక్ష్మి, బండ రాముడు, శ్రీ కృష్ణ లీలలు సినిమాలలోని పాటలు మొత్తం 255 పాటలు ఉన్నాయి.

సాధారణంగా సంకలనాలలో కొన్ని ఎంపిక చేసిన పాటలు మాత్రం వేస్తారు. సంకలనకర్త అభిరుచిపై ఆ ఎంపిక ఆధారపడి వుంటుంది. కానీ సినిమాలోని పాటలు మొత్తం ఇవ్వడం చాలా బాగుంది. "ప్రేమ లేఖలు" విషయమే తీసుకోండి ఆ పాటల ప్రాచుర్యం గుర్తించి, హెచ్.ఎమ్.వి. వారు ఇటీవలే ఆ పాటల క్యాసెట్‌ను రిలీజ్ చేశారు. ఆ పాటల టెక్స్ట్ కావాలంటే ఈ పుస్తకం చూడాల్సిందే.

అర్థ శతాబ్దం క్రిందటివైనా ఈ సంపుటంలోని పాటలు ఈ నాటికీ ప్రజల నాలుకలపై ఆడుతున్నాయి. వాటిలో కొన్ని:

| | |
|---|---|
| 'పందిట్లో పెళ్ళవుతున్నది' | (ప్రేమలేఖలు) |
| 'పాడు జీవితమూ యవ్వనమూ' | (ప్రేమ లేఖలు) |
| 'చూడాలని వుంది' | (ముద్దు బిడ్డ) |
| 'నీ ఆశా అడియాసా' | (ఎం.ఎల్.ఏ) |
| 'అశోక వనమున సీత' | (అత్తా ఒకింటి కోడలే) |
| 'యమునా తీరమున' | (జయభేరి) |
| 'నేడు శ్రీవారికి మేమంటే పరాకా' | (ఇల్లరికం) |
| 'చెట్టు లెక్కగలవా' | (చెంచులక్ష్మి) |
| 'చిలకా గోరింక కులికే పకాపకా' | (చెంచులక్ష్మి) |

పాటలు తెలియక పోయినా సాహిత్య పరంగానైనా చదువుకునేలా వుందీ పుస్తకం. అలా చదువుతుంటే 'అఖిల జగముల మేలు ఆశించు నీ అరుణ పతాకం' అనే లైను కనబడి, ఆగి చూస్తే అది 'సంపూర్ణ రామాయణం (1957) చిత్రంలోని పాట! రెండో లైను చూడబోతే 'ఆర్య భూముల నేల దివ్య సూర్య వంశజుల కేతనం'! అంటే విప్లవ రచయిత ఆరుద్ర ఎర్ర జెండా ఎగరేసే ఏ సందర్భాన్నీ విడిచి పెట్టలేదన్న మాట అనిపించింది.

'పెంకిపెళ్ళాం' (1950)లోని పడుచుదనం రైలు బండి పోతున్నది'లో 'బండిలోన విచారాన్ని ...' అన్నలైను గురించి ఇదివరకు కొంత చర్చ జరిగింది. 'ఉమ్మ కూడదు' అన్న అర్థంలో 'ఉగళ బారదు' అని కన్నడంలో రైల్లో రాసి ఉండడం చూసిన ఆరుద్ర అది పాటలో ఉపయోగించారు. కానీ కన్నడ 'ఉ', తెలుగు 'లు'ని పోలి ఉండడంతో 'లుగళబారదు' అనని ఆరుద్ర రాసేశారు. సినిమాలో అలాగే పాడించేశారు కూడా.

ఆ పాట వెలువడ్డాక కొందరు విమర్శించడంతో ఆరుద్ర పొరపాటు గ్రహించారు కానీ ఏమీ చేయలేక పోయారు. కానీ ఈ పుస్తకం సంకలన కర్తలు మాత్రం 'లుగళబారదు'ను మార్చి 'యుగళబారదు' అని వేయించారు. మరి దీని అర్థం ఏమిటో!?

'ముద్దు బిడ్డ'లోని 'చూడాలనివుంది' పాట వైదేహి పాడారని పేర్కొన్నారు. ఆపాట పాడినది 'సుశీల' అని పెండ్యాల ఒక అభిమానికి రాసిన ఉత్తరంలో ఉంది. మరి గ్రామఫోను రికార్డులో వైదేహి పేరు ఉందేమో! ఇలా ఎవరెవరి పాటలో ఎవరెవరి పేరనో చెలామణీ అయిపోవడం గురించి రామలక్ష్మి గారు ముందు మాటలో ప్రస్తావించారు. ఇండియన్ పెర్‌ఫార్మింగ్ రైట్స్ సొసైటీ (ఐ.ఆర్.పి.ఎస్) ఏర్పాటు గురించి, అది మేధో. హక్కుల పరిరక్షణకై చేసే కృషి గురించి వివరించారు. అన్నీ వివరించి 'పల్లెపడుచు'లోని 'ఏరు నవ్విందోయ్ - ఊరు నవ్విందోయ్' పాటను ఈ సంకలనంలో చేర్చారు. ఈ పాట గురించి ఆరుద్ర స్వయంగా రాసిన వ్యాసం 16-6-1993 నాటి ఆంధ్రప్రభ వీక్లీలో ప్రచురితమైంది. ప్రక్కనున్న బాక్స్‌లో గల ఆ వ్యాసాన్ని చూస్తే సినిమా రచనల కర్తృత్వం నిర్ధారించడం ఎంత కష్టమో తెలుస్తుంది.

ఈ పుస్తకం ధర 75/- రూ॥లు. విశాలాంధ్ర ప్రచురణ.

-ఎమ్బీయస్ ప్రసాద్

## సినీ-మినీ కబుర్లు

సినిమా రంగంలో చాలా విచిత్రాలు జరుగుతూ ఉంటాయి. ఒకరు పనిచేస్తే ఇంకొకరికి పేరు వస్తుంది. చిత్రం ప్రారంభంలో కనబడే క్రెడిట్స్‌లో నూటికి తొంభైపాళ్ళు నిజం ఉండొచ్చు గాని, పదిపాళ్ళు వ్యాపారరీత్యా చోటు చేసుకునే అవాస్తవికాలు ఉండొచ్చు. ఈ సంగతి రుజువు చేయడానికి నా అనుభవాలే చాలు.

నేను చిత్ర రంగంలో ప్రవేశించి పని చేసిన తొలి చిత్రం రాజరాజేశ్వరి ఫిలింస్ వారి 'సౌదామిని'. ఆ సంస్థలోని స్టోరీ డిపార్టుమెంటులో రచయితగా నేను మొదట కుదురుకున్నాను. చిత్ర కథను రాసి, ట్రీట్‌మెంట్ పూర్తి చేశాను. ఆ చిత్రానికి పాటలు, మాటలు రాయడానికి సముద్రాల రాఘవాచార్యులు గారిని నిర్మాతలు ఎన్నుకున్నారు. సముద్రాల వారికి చేదోడు వాదోడుగా మల్లాది రామకృష్ణ శాస్త్రి గారు ఉండేవారు. ఈ ఇద్దరూ నాకు పెద్దలే. ఆప్తులే. సముద్రాల వారిని 'అన్నగారు' అనీ, మల్లాది వారిని 'గురూజీ' అని పిలిచేవాణ్ణి.

మల్లాది వారి దస్తూరిలో సముద్రాల వారి రచన మా ఆఫీసుకు చేరింది. చిత్రంలో రెండొంతులు నా అదనపు డైలాగులు ఉన్నాయి. కొన్ని పాటలు కూడా నేను రాసినవే. కానీ క్రెడిట్స్‌లో సముద్రాల వారి ఒక్కరి పేరే వేశారు. అది చూసుకున్నాక సముద్రాల "ఏం తమ్మయ్యా ! నీ పేరు కూడా వేయమనలేకపోయావా" అని నన్ను అడిగారు. "మీరు రాసినది ఎప్పుడైనా నా పేరుతో ఏదో ఒక సినిమాలో రాకపోదు లెండి" అంటూ ఛలోక్తిగా అని ఊరుకున్నాను. అది చాలాకాలం తర్వాత నిజమైంది.

కొన్నాళ్ళ తర్వాత నేను చిత్ర రంగంలో స్థిరపడ్డాక బోళ్ళ సుబ్బారావు గారు ఒక చిత్రం తీస్తూ నన్ను పాటల రచయితగా పెట్టుకున్నారు. అది పినిశెట్టి శ్రీరామమూర్తి రచించిన 'పల్లెపడుచు'. ఆ చిత్రంలో తొమ్మిది పాటలున్నాయి. ఎనిమిది పాటలు రాశాను. సంగీత దర్శకుడు ఎం.ఎస్.రామారావు బాణీ కట్టాడు. పాటలు రికార్డయ్యాయి. చిత్రీకరణ సాగిపోతోంది. అయితే చివరి రోజుల్లో డబ్బు ఇబ్బందులు వచ్చాయి. ఆ చిత్రానికి 'వినోదా' వారు డిస్ట్రిబ్యూటర్లు. వారు డబ్బు సర్దడానికి వ్యవధి కావాలన్నారు.

చిత్రంలో మిగిలి పోయిన పాటను రికార్డు చేసి చిత్రీకరణ చేయవలసిన అవసరం వచ్చింది. 'వినోదా' పేరుతో పంపిణీ సంస్థ మాత్రమే కాక, నిర్మాణ సంస్థ కూడా ఉంది. దాని భాగస్వామి డి.ఎల్. నారాయణ ఒకరు. (ఈయన 'దేవదాసు నిర్మాత.) "మీకు పాటే కదా కావాలి. మేము ఓ చిత్రంలో పెట్టాలనుకుని ఒక పాట రికార్డు చేశాం కాని పెట్టలేదు. దాన్ని వాడుకోండి" అని ఆయన సౌండ్ ట్రాక్ ఇచ్చేశారు. బోళ్ళ సుబ్బారావుగారు దాన్ని చిత్రంలో పెట్టుకున్నారు. ఆ పాట నేను రాయక పోయినా మొదటి రీలులోని క్రెడిట్స్‌లో పాటల పుస్తకంలోనూ పాటలకు పూర్తిగా నా ఒక్కడికే క్రెడిట్స్ ఇచ్చారు. ఆ పాట చూడండి

"ఏరు నవ్విందోయ్ - ఊరు నవ్విందోయ్
ఏటిలో చిటి చేప ఇట్టే నవ్విందోయ్"

ఈ పాటలో సముద్రాల వారికి చేదోడు వాదోడుగా ఉన్న మల్లాది రామకృష్ణ శాస్త్రి గారి ముద్ర స్పష్టంగా కనబడుతుంది. 'పల్లెపడుచు' ప్రివ్యూ చూశాక "అన్నగారూ! లోగడ నేను రాసిన వాటికి మీకు క్రెడిట్ వస్తే ఇప్పుడు మీరు రాసిన ఒక దానికి నాకు క్రెడిట్ వచ్చింది. దానికీ దీనికీ చెల్లు" అని సముద్రాల వారితో చెప్పాను.

ఆయనా, పక్కనున్న మల్లాదివారూ, నేనూ నవ్వుకున్నాం, మాతోపాటు వారూ-ఊరూ-చిటిచేపా, చిటిపాపా కూడా నవ్వుకుని ఉంటాయి.

-ఆరుద్ర

# ఆడియో చాట్



పి. అరుణ్‌కుమార్ బాబు, మణుగూరు.

**'అక్కినేని ఆలోచనలు' పేరిట ఆడియో క్యాసెట్ విడుదలయిట్టుగా పత్రికల్లో చదివాం. అంటే... అక్కినేని గారి ఆలోచనలను ఏ గాయకుడి చేతనైనా పాడించారా లేక ఆయనే పాడారా? ఆ క్యాసెట్ ఆడియో షాపుల్లో దొరుకుతుందా?**

అక్కినేని ఎప్పట్నించో తనలో కలిగిన స్పందనలకు అక్షర రూపం ఇస్తూ 'అక్కినేని ఆలోచనలు' పేరిట 'అ ఆ'లుగా భద్రపరుచుకుంటూ వస్తున్నారు. చిన్న పుస్తకాలుగా ఒకటి రెండుసార్లు వెలువడడం జరిగింది కూడా. అవన్నీ కలిపి నాగేశ్వరరావుగారే చెపుతూ ఉంటే ఒక ఆడియో క్యాసెట్‌గా రిలీజ్ చేస్తే ఎలా వుంటుందన్న ఐడియా ప్రముఖ నిర్మాత ఎమ్మెస్ రెడ్డి గారబ్బాయి, మరో ప్రముఖ నిర్మాత అయిన శ్యామ్ ప్రసాద్ రెడ్డి గారికి వచ్చింది. శబ్దాలయ థియేటర్‌లో రికార్డు చేయించి ఆడియో క్యాసెట్‌గా రూపొందేట్టు చేశారు. నిజానికి ఆ ఆడియో క్యాసెట్ అక్కినేని పుట్టిన రోజైన సెప్టెంబర్ 20న రిలీజ్ అవాల్సింది. కానీ అక్కినేనికి, ఎమ్మెస్ రెడ్డికి అత్యంత ఆప్తుడైన కోట్ల విజయభాస్కర రెడ్డిగారు సెప్టెంబర్ 19న కోమాలోకి వెళ్ళిపోయి పరిస్థితి విషమించటం వలన ఫంక్షన్ అప్పుడు వద్దనుకున్నారు. ఇటీవల విడుదలైన ఆ 'అక్కినేని ఆలోచనలు' ఆడియో క్యాసెట్ ఆదిత్య మ్యూజిక్ కంపెనీ వారి క్యాసెట్లు అమ్మే ప్రతి షాపులోనూ లభిస్తుంది.

**బి.శ్రీనివాసా చారి,**

**ఓరియంట్ సిమెంట్ - హైదరాబాద్**

హెచ్.ఎం.వి, ద్వారా వెలువడ్డ 'గోల్డెన్ హిట్స్ ఆఫ్ మన్నాడే' ఆడియో క్యాసెట్‌లో పాటలన్నీ సింప్లీ సుపర్బ్... మన్నాడే పాటల్లో అతి ముఖ్యమైన 'లాగా చున్‌రీమే దాగ్... యా ఛుపా వూ కైసే' పాట ఎలా మిస్సయింది? దీనికి సమాధానం హెచ్.ఎం.వి. వారి ద్వారా తెలియజేయగలరు..



ఈ ప్రశ్నకు హెచ్.ఎం.వి. హైదరాబాద్ బ్రాంచ్ మేనేజర్, ఉమేశ్ పాయ్ ఇచ్చిన సమాధానం ఇది.

ఒక కళాకారుడువి అయిదు గాని పదిగాని క్యాసెట్లు ఒక బంచ్‌గా వెయ్యాలనుకున్నప్పుడు మొత్తం ఆయన బెస్ట్‌లు అన్నీ తీసుకొని పొందు పరుస్తాం. కానీ 'మన్నాడే గోల్డెన్‌హిట్స్'కి వచ్చేసరికి మరో వాల్యూమ్‌కి రిలీజ్ చెయ్యాలన్న కోరికతో కొన్ని మంచి పాటల్ని అట్టిపెట్టు కోవటం జరిగింది. మీరు సింప్లీ సుపర్బ్ అన్న విధంగా వాల్యూమ్-1 బాగా అమ్ముడయి వాల్యూమ్-2 పట్ల మా నమ్మకాన్ని ధైర్యాన్ని పెంచింది. డిసెంబర్‌లో ఆ వాల్యూమ్-2ని రిలీజ్ చేస్తున్నాం. అందులో మీరడిగిన 'లాగా చున్‌రీమేదాగ్' పాట ఉంది. థాంక్యూ ఫర్‌ది ఎఫెక్షన్ ఆన్ మన్నాడే అండ్ హెచ్.ఎం.వి.

బి.స్వర్ణలత
బేగంపేట, హైదరాబాద్

**నేను రెండేళ్ల క్రితం 'టి' సీరిస్ వారి కె.యల్.సైగల్ పాటల సెట్ కొన్నాను. ఆయన పాటల్లో ముఖ్యమైన 'మై నహి మఖన్ ఖాయో మయ్యా మోరే' అనే పాట ఆ క్యాసెట్‌లో చోటు చేసుకొన లేదు. అది ఎలా మిస్ అయి ఉంటుంది?**



ఈ ప్రశ్నకు 'టి' సీరిస్‌కి చెందిన సూపర్ క్యాసెట్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ బ్రాంచ్ మేనేజర్ జె.మురళీధర్ గారి సమాధానం ఇలా వుంది.

సాధారణంగా ఇటువంటి సంకలనాలు క్యాసెట్టుగా వేసేటప్పుడు ఆ పాటల లిస్ట్ ఢిల్లీ దగ్గర గల నొయిడాలోని టి సీరిస్ వారి కార్పొరేట్ ఆఫీసుకు పంపిస్తూ ఉంటాం. తుది నిర్ణయం వారు తీసుకుని క్యాసెట్లను రూపొందిస్తూ ఉంటారు. మీరు సూచించిన ఆ పాటను నెక్స్ట్ బంచ్‌లో చేర్చమని రికమెండ్ చేస్తూ టి సీరిస్ వారి కార్పొరేట్ ఆఫీసుకు లెటర్ పంపిస్తున్నాం. నెక్స్ట్ బంచ్‌లో వారు ఆ పాటను చేర్చిన పక్షంలో 'హాసం' పత్రిక ద్వారా తెలియజేస్తాం.



# టీచర్స్ స్టూడెంట్స్ స్పెషల్







"పిల్లలూ.... మీరంతా నిశ్శబ్దంగా వుండాలి. ఎంత నిశ్శబ్దంగా వుండాలో తెల్సా.... సూది కింద పడిన శబ్దం కూడా మనం వినగలగాలి" చెప్పారు టీచర్.
పిల్లలంతా కదలకుండా నిశ్శబ్దంగా కూర్చున్నారు టీచర్ చెప్పినట్లుగానే. ఉన్నట్టుండి ఓ పిల్లాడు'' టీచర్. మేమంతా నిశ్శబ్దంగానే వున్నాం. ఇంక మీరు సూది క్రింద పడెయ్యవచ్చు" అని గట్టిగా అరిచాడు.

---



"రోడ్డుకి స్పెల్లింగ్ చెప్పు"
"తెలీదు టీచర్"
"అయితే ఆ పుస్తకంలో చూసి చెప్పు"
"అందులో కూడా లేదు టీచర్...."
"అదేంట్రా...."
"అందరూ మాటిమాటికీ నడవటం మూలాన్న అరిగిపోయి ఉంటుంది టీచర్....."



క్లాసులో పిల్లలకి ఓ హాస్య కథ చెప్పారు టీచర్. వాళ్ళంతా పగలబడి నవ్వుతారని ఊహించారాయన, తీరా ఎవ్వరూ నవ్వకపోయే సరికి "పిల్లలూ మీరంతా ఇప్పుడు హాస్య కథ విన్నారు కదూ.... వచ్చే వేసవి సెలవుల్లో మీరు నవ్వుతారని అనుకుంటున్నాను'' అన్నారాయన వెక్కిరింతగా.
"లేదు సార్... కిందటి వేసవి కాలంలోనే నవ్వేశాం...." గట్టిగా అరిచాడు ఓ కొంటె కోణంగి.

చేయగలిగిన వాళ్ల చేసేస్తారు, చేయలేని వాళ్ల ఉపదేశాలు మొదలెడతారు
-బెర్నార్డ్ షా

నేర్చుకోవడం రాని వాళ్లందరూ బోధించడానికి దిగబడతారు.
-ఆస్కార్‌వైల్డ్



"అన్నీ తెలిసున్నట్టుగా నటించే వాడిని ఏమని పిలుస్తారో చెప్పగలరా?"
"టీచర్ అంటారండీ".

---



"ఒరేయ్, పౌష్టికాహారమంటే ఏంటో చెప్పగలరా" అడిగాడు సైన్స్ టీచర్.
"రుచీ పచీ లేకుండా వుండి కేవలం కడుపు నిండటం కోసం తినే తిండి సార్...."

---



"పిల్లలూ! ముల్లు మీద అరిటాకు పడ్డా అరిటాకు మీద ముల్లు పడ్డా నష్టం అరిటాకుకే అనే సామెత విన్నారు కదా అలాటిదే ఒకటి ఊహించి చెప్పండి చూద్దాం."
"మేం అడిగిన ప్రశ్నలకి మీరు సమాధానం చెప్పినా, మీరడిగిన ప్రశ్నలకి మేం సమాధానం చెప్పినా జీతం మీకే వస్తుందండి".
"ఓరి నా పిచ్చి విద్యార్థులారా..... నేనడిగింది నష్టం గురించి.... మీరు చెప్తోంది లాభం గురించి....! అర్థమైందా... నష్టం గురించి చెప్పండి".
"సరే సార్.... బురదలో ఉన్న పంది మీమీద పడ్డా, మీరెళ్ళి ఆ పంది మీద పడ్డా మీ బట్టలే పాడవుతాయండి."




**చిత్రంలోని కథ, నటీనటులు మొదలైన వాటికి ఎంతటి ప్రాధాన్యతనీయాలో సంగీత సాహిత్యాలకు కూడా అంతే విలువనిచ్చే విజయా సంస్థ నుంచి వెలువడిన సంపూర్ణ హాస్య చిత్రం**

# పెళ్ళి చేసి చూడు

ఈ చిత్రం 1952లో విడుదలయింది. ఎన్.టి.రామారావు, జి.వరలక్ష్మి హీరో హీరోయిన్లు కాగా సావిత్రి సెకండ్ హీరోయిన్ పాత్ర ధరించింది. ఈ చిత్రం యస్వీరంగారావుకు మరింత పేరుతెచ్చింది. 'దూపాటి వియ్యన్న' గా ఆయన స్థానాన్ని మరింత పటిష్టం చేసింది. ఒక్క రంగారావే కాదు రామారావు, జి. వరలక్ష్మి అప్పట్లో హాస్యనటుడుగా మంచి పేరున్న జోగారావు., సావిత్రి, డాక్టర్ శివరామకృష్ణయ్య, మహంకాళి వెంకయ్య మొదలైన వారంతా ఈ చిత్రాన్ని సంపూర్ణ హాస్యరస భరితంగా తీర్చిదిద్దారు. ఈ చిత్రంలో బాలనటుడిగా నటించిన కందామోహన్ 'మోహన్ కందా'గా ఐ.ఏ.యస్. ఆఫీసరై చాలా ఉన్నత పదవులను నిర్వహించారు. యల్వీ ప్రసాద్ దర్శకత్వం వహించిన ఈ 'పెళ్ళి చేసి చూడు' చిత్రానికి సంగీతం ఘంటసాల. పాటలను పింగళి నాగేంద్రరావు, ఊటుకూరి సత్యనారాయణ వ్రాశారు. అసలు 'పెళ్ళి చేసి చూడు' అని ఎవరైనా అంటే చటుక్కని స్ఫురించే పాటలివి:

ఓ... భావి భారత భాగ్య విధాతలారా
యువతీ యువకులారా
స్వానుభవమున చాటు నా సందేశమిదే
వారెవ్వా ......
తాదిన్న తకదిన్న తాంగిటకతక తరికిటకతోం
పెళ్ళి చేసుకుని ఇల్లు చూసుకుని
చల్లగ కాలం గడపాలోయ్
ఎల్లరి సుఖము చూడాలోయ్
మీరెల్లరు హాయిగ ఉండాలోయ్
కట్నాల మోజులో మనజీవితాలనే బలిచేసి
కాపురములు కూల్చు ఘనులకు శాస్తి కాగా
పట్నాల పల్లెల దేశదేశాల
మనపేరు చెప్పుకొని



ప్రజలు సుఖపడగా
తాధిన్న తకధిన్న తాంగిటకతక తరికిట కతోం
ఇంటా బయటా జంట కవులవలె
అంటుకు తిరగాలోయ్..... తరంపం...... ॥ఇంటా॥
కంటి పాపలై దంపతులెపుడు
చంటి పాపలను సాకాలోయ్ ॥కంటి॥ ॥పెళ్లి॥
నవ భావములా నవరాగములా
నవ జీవనమే నడపాలోయ్
నవ భావములా నవరాగములా
నవ జీవనమే నడపాలోయ్
భావ కవుల వలె ఎవరికి తెలియని
ఏవో పాటలు పాడాలోయ్ ॥భావ॥ ॥పెళ్లి॥

ఇవ్వదలచుకున్న సందేశాన్ని వ్యంగ్యంతో ముడిపెట్టి అతి చతురంగా చెప్పడంలో పింగళి వారి పాళీకున్న శక్తిని తెలిపే పాటలలో ప్రథమ స్థానం ఇవ్వదగ్గ పాట ఇది. 'ఇంటా బయటా జంట కవులవలె అంటుకు తిరగాలోయ్', 'భావ కవుల వలె ఎవరికి తెలియని ఏవో పాటలు పాడాలోయ్', వంటి వాక్యాలు మచ్చుకి ఓ రెండు మెచ్చుతునకలు. కళ్యాణి రాగం ప్రధానంగా సాగిన ఈ పాటను ఘంటసాల ఆలపించగా ఎన్.టి. రామారావుతో పాటు జోగారావు, మాస్టర్ కుందు, జి. వరలక్ష్మి, బాలకృష్ణ అభినయించారు. కళ్యాణి రాగంలో ఘంటసాల చేసిన పాటలు ఒకటా.... రెండా... ఎన్నో..... రావే నా చెలియా, తలనిండ పూదండ దాల్చిన రాణి, బహుదూరపు బాటసారీ ఇటురావో ఒక్కసారి, నా సరినీవని నీగురి నేనని, విరిసె చల్లని వెన్నెల వంటి పాటలు అందులో కొన్ని...... వీటన్నిటితో పోలుస్తూ 'పెళ్లి చేసుకుని ఇల్లు చూసుకుని' పాటకు లభించిన జనాదరణ, ఈనాటికి నిత్యనూతనంగా ఉన్న ఆనాటి ఆ వరుస-ఇవన్నీ ఒక్కసారి పునశ్చరణ చేసుకుంటే ఘంటసాల పట్ల గౌరవం ఎన్నింతలుగా పెరుగుతుందో వర్ణించలేం.

ఓ .... మనసులోని మనసా...... ఆ... ఆ...
ఏమిటే నీ రభస
ఏమిటే నీ రభస నా మనసులోని మనసా ॥2॥
ఇల్లలికిన పండుగనటే ఒళ్ళు తెలిసి మెలగరటే ॥2॥
పాలు గాచి చేజేతుల ఒలకబోసుకుందురటే ॥2॥ ॥ఏమిటే॥
నిజము తెలియ నంతవరకె ఆట పాట లెన్నైనా ॥2॥
అసలు రూపు పసిగడితే అధోగతి తప్పునటే ॥2॥ ॥ఏమిటే॥
హద్దు పద్దు లేకుండా పెద్దలతో ఆటలటే ॥2॥
శాణతనము చాలింపుము జాణవులే నెరజాణవులే ॥2॥ ॥ఏమిటే॥



ఈ పాటను ఘంటసాల పాడగా ఎన్.టి.రామారావు, జి.వరలక్ష్మిపై చిత్రీకరించారు. డాక్టర్ శివరామ కృష్ణయ్య, బాలకృష్ణ కూడా పాటలో కనిపిస్తారు.

పాటలోని మూడు చరణాల సాహిత్యం కథా గమనానికి సంబంధించినది. ఈమూడు చరణాల సందర్భం విడమరచి చెపితే కథ తెలిసి పోయినట్టే. హీరో హీరోయిన్లకు పెళ్ళి జరిగినా కాపురం చేసే అదృష్టం ఉండదు. కథానాయకుడు పిచ్చివానిలా నటిస్తే అతన్ని నయం చేసే నర్సుగా కథానాయిక అతని ఇంట్లో ప్రవేశిస్తుంది. అతని తండ్రి మెప్పుని సంపాదించుకుంటుంది. ఆ విషయాన్నే కథానాయకుడు - 'పెళ్ళి చేసుకోగానే సరిపోతుందా కాపురం చెయ్యొద్దూ' అనే అర్థంలో 'పాలుగాచి చేజేతుల ఒలకపోసుకొందురటే' అని మొదటి చరణంలోనూ 'ఈ నాటకం సంగతి తెలిస్తే ఏం అవుతుంది...? ఈ అథోగతి మనకు తప్పుతుంది అయినా మీ మామగారిని (మా నాన్నగారిని)అలా మోసం చెయ్యొచ్చా... తప్పు కదూ... హన్నా'... అనే చిలిపి ధోరణి రెండవ, మూడవ చరణాలలోను ఉండేట్టు రాశారు పింగళి. ఇంత వివరణ ఎందుకంటే పాటల రచయితకి కథ పూర్తిగా తెలిసుండడంఎంత ముఖ్యమో ఈ పాట ద్వారా మరోసారి తెలుసుకోవాలని పాట చివరలో వచ్చే 'శాణతనం' పింగళివారి పనితనం.

గాయకుడిగానే కాక సంగీత దర్శకుడిగా కూడా ఘంటసాల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి ఈ పాటలో. ఈ పాటకు ఆయన హరికాంభోజి రాగాన్ని ఆధార రాగంగా తీసుకున్నారు. 'అందం కోసం హరికాంభోజిలో లేని 'కాకలి నిషాద' స్వరాన్ని కూడా ప్రయోగించారు'. అని ప్రముఖ లలిత సంగీత విద్వాంసులు 'శ్రీ ఎమ్. చిత్తరంజన్ తెలిపారు. శాస్త్రీయ రాగాల్ని లలిత సంగీతంలో ఉపయోగించేటప్పుడు రస, భావాలకోసం అన్య స్వరాలను చేర్చటం 1940 ప్రాంతాలలో మొదలయింది. దానికి ఇంచుమించుగా యస్.రాజేశ్వరరావే ఆద్యుడు. ఆ తరువాత సి.ఆర్. సుబ్బరామన్, ఘంటసాల, మొదలైన వారంతా ఆ ఒరవడిని కొనసాగించారు. ఈ 'మనసులోని మనసా ఏమిటే నీ రభసా' పాటతో పాటు ఆరోజుల్లో వచ్చిన పాటల్ని వరసగా పెట్టుకొని వినగలిస్తే ఈ అనుభవం అవగాహనలోకి వస్తుంది. ఈ పాట నడక, ఇంటర్లూడ్‌లు అన్నీ బాగా గమనిస్తే ఘంటసాల ప్రఖ్యాత గీతం 'మరువలేనురా నిన్నునేను మరువలేనురా ఓ పంచదార వంటి పోలీసెంకటసామి నిను నేను మరువలేనురా' అనే పాట జ్ఞప్తికి వస్తుంది. మనసులోని మనసా, పంచదారవంటి పోలీసెంకటసామి పాటలు దొరుకుతాయి కనుక ఒకదాని తర్వాత ఒకటి విని చూడండి. రెండింటికీ ఎంత పోలిక ఉందో తెలుస్తుంది.

ఏడు కొండల వాడ వెంకటారమణా
సద్దు సేయక నీవు నిదురపోవయ్యా
పాలసంద్రపు టలలు పట్టెమంచముగా
పున్నమి వెన్నెలలు పూలపానుపుగా
కనులనొలికే వలపు పన్నీటి జల్లుగా
అన్ని అమరించెనీ అలిమేలు మంగా ॥ఏడు॥

మా పాలి దైవమని నమ్ముకున్నామయ్య
నా భాగ్యదేవతా ననుమరువకయ్య
బీబి నాంచారమ్మ పొంచి ఉన్నాదయ్య
చాటు చేసుకు ఎటులో చెంతచేరెదనయ్య
ఏడు కొండల వాడ వెంకటారమణా
సద్దు శాయక... దొంగా....నిదురపోవయ్య

ఈ పాటను పి.లీల పాడగా జి. వరలక్ష్మి అభినయించారు. చక్రవాక రాగానికి సంబంధించినంత వరకూ మన తెలుగు సినిమాల్లో పాటల సంఖ్య తక్కువే అని చెప్పాలి. చక్రవాక రాగం అనగానే బాలమురళీ పాడిన 'పిబరే రామరసం' పాట అందరికీ గుర్తుకు రావటం సహజం. ఈ పాటను 'పివరే రామరసం'గా 'పడమటి సంధ్యారాగం' సినిమాలో ఉపయోగించినా-అంతకు ముందు అదే పద్ధతిలో 'జగమే రామమయం' పాటగా 'కథానాయక మొల్ల' చిత్రం లోనూ, 'రాధకు నీవేరా ప్రాణం' పాటగా 'తులాభారం' చిత్రంలోనూ ఉపయోగించి చక్రవాక రాగానికి కొన్ని ఉదాహరణలుగా చేర్చదగ్గ ప్రయత్నాలు జరిగినా... అవన్నీ 'ఏడుకొండలవాడ వెంకటారమణా'' పాట చేరుకున్న స్థాయి అందుకోలేక పోయాయి.

ఈ పాటలో గమనించ దగ్గ విషయం మరొకటుంది. అది 'సద్దు శాయక' అనే ప్రయోగం. ఇది పూర్తిగా పింగళి వారు మాత్రమే చేసే ప్రయోగం. 'పాతాళ భైరవి' చిత్రంలో 'సాహసం శాయరా' అనే డైలాగు ద్వారాను, 'గుండమ్మ కథ' చిత్రంలో 'ప్రేమ యాత్రలకు బృందావనము' పాటలో 'సఖి నెరి చూపుల చల్లదనంతో జగమునె ఊటీ శాయగా' అనే వాక్యం ద్వారాను ఈ ప్రయోగాన్ని మనం మరొకసారి నిర్ధారించుకోవచ్చు. 'చేయ' అనే మాటకి 'శాయ' మాటను వాడే పింగళి వారిని ప్రేరణగా తీసుకొని మణిరత్నం 'సఖి' లోని 'స్నేహితుడా' పాటలో 'సేవలు శాయవలెరా' అంటూ రాశారు వేటూరి సుందర్రామ్మూర్తి.

అ: ఎవరో ఎవరో
ఈ నవనాటక సూత్రధారులు
ఎవరో... ఎవరో
ఆ: ఎవరా ఎవరా ॥2॥
మంచి వారు మా మావగారిని
వంచన చేసిన వారెవరో వారే
అ: మనవులుగా అమాయక చూపుల
మనసును లాగిన దెవరో ॥2॥
నిను విడజాల నీదాన నేనని
నను నిలవేసిన దెవరో
ఎవరో వారే
ఆ: ప్రియ సఖిపై గల ప్రేమను చాటి
భయమును విడచినదెవరో ॥2॥
న్యాయవాది అన్యాయవాదియై
మాయలు నేర్చిన దెవరో
ఎవరో వారే
అ: హృదయములో విశాల భావము
ఉదయము జేసిన దెవరో ॥2॥
ఆ: చదువుల సారం సంసారమునకే
పదిలము చేసిన దెవరో
ఎవరో వారే
అ: వారే వీరు
ఆ: వీరే వారు
ఇద్దరు: వారే వీరు.



ఈ పాటను ఘంటసాల, లీల పాడగా ఎన్.టి.రామారావు, జి.వరలక్ష్మి అభినయించారు. ఈ పాటలో కూడా సాహిత్యాన్ని గమనిస్తే కథ అర్థం అయిపోతుంది. సాధారణంగా మనం విన్నపం, విజ్ఞాపన మొదలైన వాటికి బహువచనాలుగా విన్నపాలు, విజ్ఞాపనాలు అంటూ వాడతాం. కానీ 'మనవి' అనే మాటకి బహువచనాన్ని ప్రయోగించం, 'మనవులుగా' అంటూ మొదటి చరణంలో పింగళి చేసిన ప్రయోగాన్ని ఈ సందర్భంగా గుర్తించాలి మనం. అలాగే 'ఉదయము జేసిన దెవరో' ప్రయోగం కూడా పింగళివారిని శైలిని పట్టి ఇచ్చేదిగా కనిపిస్తుంది.

ఈ పాటకు చారుకేశి రాగం ఆధార రాగం. ట్యూన్‌ని ఒకటి రెండు సార్లు బాగా విని ఆ రాగాన్ని మననం చేసుకుంటే 'రాజమకుటం' సినిమాలోని 'ఊరేది పేరేది ఓ చందమామ' అనేపాట, 'సిరి సంపదలు' సినిమాలోని 'వెండి వెన్నెల జాబిలి నిండు పున్నమి జాబిలి' అనే పాట మనకి స్ఫురిస్తాయి. ఈ రెండు పాటలకు స్వరకర్త మాస్టర్ వేణు. ఆయన శైలి ఈ 'ఎవరో ఎవరో' పాట చాలా వరకు ప్రతిబింబిస్తూ ఉంటుంది. 'పెళ్ళి చేసి చూడు' సినిమా టీవీలో గాని, థియేటర్‌లో గాని వస్తే (అఛాన్సు తక్కువ) చూడండి లేదా వీహెచ్ యస్ క్యాసెట్‌లో గాని వీసీడిలో గాని (ఇవి మార్కెట్లో ఉన్నాయి) చూడండి. 'ఆర్కెస్ట్రా వేణు' అని టైటిల్స్‌లో ఉంటుంది.

**ఇవి గాక 'పెళ్ళి చేసి చూడు'లో ఎన్నదగిన పాటలు ఇంకా ఉన్నాయి. సంగీత పరంగా చెప్పుకోవలసిన మరో ముఖ్య విశేషం ఏమిటంటే ఈ సినిమాలో 'ఏడవకు ఏడవకు వెర్రి పాపాయి నను పాలడగమోకోయ్ దొరల బాబాయి! దొరల తాతాయి' అనే పాటను పామర్తి పాడేరు. (తరువాత ఆయన కూడా సంగీత దర్శకునిగా పేరు తెచ్చుకున్నారు.) అయితే గాయనీ గాయకుల లిస్ట్‌లో ఆయన పేరు లేదు.**

**మంచి సంగీతం, హుందాగా ఉండే చక్కని హాస్యం కోరుకునే వారిని ఈ నాటికీ అలరించే చిత్రం - 'పెళ్ళి చేసి చూడు'.**

పాప్ కార్నర్

# రాక్ సంగీతంలో ఒకే ఒక్కడు బ్రియాన్ ఆడమ్స్

మెడలో తులసిమాలతో కనిపించే కెనడా రాక్ హీరో ఎవరు? అని ప్రశ్నిస్తే దానికి సమాధానం బ్రియాన్ ఆడమ్స్ ఒక్కటే! మూడు సార్లు భారత్‌ను సందర్శించిన బ్రియాన్ రాక్ సంగీతంలో తొంభై దశకం నుంచీ అగ్రస్థానంలోనే ఉన్నారు. కోట్ల సంఖ్యలో అమ్ముడైన ఆల్బమ్‌లే చెబుతాయి ఆయన పాట విలువేమిటో!? ముంబైలో ఒక భారతీయ మిత్రుడు ఎంతో ప్రేమతో ఇచ్చిన తులసిమాలను 1994 నుంచి క్రమం తప్పక ధరిస్తూ ప్రపంచ దేశాల్లో ప్రదర్శనలిస్తోన్న ఆడమ్స్ ఇటీవల ముంబైలో, బెంగుళూరులో మూడో పర్యాయం ప్రదర్శన ఇచ్చారు. ఎన్నికలు, తదితర కారణాల మూలంగా శాంతి భద్రతల దృష్ట్యా ఢిల్లీలో ఆయన ప్రదర్శనలకు అనుమతి నిరాకరించారు. దీన్ని బట్టి ఆయన పాట సృష్టించే ప్రభావం, ప్రతిస్పందన ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

ఆయన తాజా ఆల్బమ్ 'బెస్ట్ ఆఫ్ మి'. అయితే తన ఇటలీ అభిమానుల కోసం పవరాట్టీతో కలిసి 'ఆర్ యు రెడీ' ఆల్బమ్‌ను ఇటీవలే విడుదల చేశారు. 'సమ్మర్ ఆఫ్ '69' ఆయన మరువురాని మధురగీతం. 'ఎయిటిన్ టిల్ ఐ డై' భావగర్భితంగా సాగే వలపుగీతం.

తన గీతాలను తానే రాసుకునే బ్రియాన్ ఇతరుల గీతాలను కూడా పాడతారు. "మేడ్ ఇన్ కెనడా'' అనేది స్వీయరచన. పాప్ సింగర్స్‌లో చాలామంది రంగురంగుల వస్త్రాలు ధరించి ప్రదర్శనలిస్తుంటారు. జిగేలుమని మెరిసే దుస్తుల్లో వారు దివి నుంచి భువికి దిగిన గంధర్వుల్లా ఉంటారు. కానీ బ్రియాన్ ఆడమ్స్ మాత్రం తెల్లని దుస్తుల్లోనే ప్రత్యక్షమవుతారు. అన్నివర్ణాలను తనలో నింపుకున్న శ్వేత వర్ణం అంటే ఆయనకి ఇష్టం. వైట్ షర్ట్, వైట్ జీన్స్ ధరించిన ఆడమ్స్ జీన్స్‌మీద 'బ్యాడ్' అనే పదం మాత్రం అందరికీ స్పష్టంగా కనిపిస్తుంది. 'బ్యాడ్' అనగానే చాలామందికి మైఖేల్ జాక్సన్ 'ఆల్బమ్' గుర్తుకు రావచ్చు. కానీ 'బ్యాడ్'ని ధరించే గాయకుడు మాత్రం ఒక్క బ్రియాన్ ఆడమ్సే....!

ముంబైలో ఇటీవల జరిగిన ఆయన సంగీత



ప్రదర్శన వన్ డే క్రికెట్‌కి ఏమాత్రం తక్కువ కాదనే చెప్పాలి. యాభై వేలకు పైగా సంగీత ప్రియులు 500 రూ.లు, 300 రూ.లు టిక్కెట్లు కొని గంటల తరబడి ఆడమ్స్ కోసం ఓపికతో ఎదురు చూస్తు కూర్చున్నారు. బ్రియాన్ ఆడమ్స్ వేదిక మీదకు రాక మునుపు నిఖిల్ చినప్ప, మేరియా గొరెటి వ్యాఖ్యానంతో 'ఆక్వా ఫ్లో' బ్యాండ్ గాయనీగాయకులు కొన్ని గీతాలు ఆలాపించారు. బ్రియాన్ ఆడమ్స్ కోసం ఎదురు తెన్నులు చూసిన వారికి 'ఆక్వాఫ్లో'' బృందం పాడిన గీతాలు అంతగా రుచించలేదనే చెప్పాలి.

శ్వేత వర్ణంతో, మెరుపులా వేదికమీద బ్రియాన్ ఆడమ్స్ ప్రత్యక్షం కాగానే అశేష జనవాహిని లేచి స్వాగతం పలికింది. కరతాళ ధ్వనులతో ప్రాంగణం మిన్ను ముట్టింది. యువతీ యువకులు ఫ్లయింగ్‌కిస్‌లతో, నృత్య భంగిమలతో తమ ఆనందం వ్యక్తం చేశారు. క్రికెట్ క్రీడాకారుడు సచిన్ టెండుల్కర్ ప్రదర్శన తర్వాత ఆడమ్స్‌ని కలిసి మాట్లాడివెళ్లడం చెప్పుకోదగ్గ మరొక విశేషం!

ఇంతకీ బ్రియాన్ ఆడమ్స్‌కి ఎందుకింత ప్రజాదరణ!? ఇరవయేళ్లకు పైగా లెక్కలేని సంచనాలను సృష్టించి ఖండం ఏదైనా, దేశం ఏదైనా రాక్ సంగీతాభిమానుల గుండెల్లో చెక్కుచెదరని స్థానం సంపాదించుకున్న రాక్ హీరో మరొకరు లేక పోవటమే ముఖ్యకారణం. ఆడమ్స్ కెరీర్ గ్రాఫ్ ఒక్కసారిగా నింగిని చేరుకుంది 1983లో 'కట్స్ లైక్ ఎ నైఫ్' అనే ఆల్బమ్‌తో! స్ట్రెయిట్ ఫ్రమ్ ద హార్ట్' ఆల్బమ్‌తో అమెరికాలోని పది ఉత్తమోత్తమ గాయకుల్లో ఒకరుగా మారారాయన.

ఆడమ్స్ నాలుగో ఆల్బమ్ 'రెక్లెస్' 1984లో విడుదలైంది. ఆ సంవత్సరం ఉత్తమ ఆల్బమ్ అదే మరి. 'రన్ టు యు', 'సమ్ బడీ' సింగిల్స్ సూపర్ హిట్టవ్వడంతో ఆయన పేరు దేశదేశాలా మారు మోగింది. 1985లో విడుదలైన 'హెవన్' ఆల్బమ్‌తో ఆడమ్స్ నెంబర్ వన్ అయ్యారు. అందులో మరో విశేషం కూడా ఉంది. ఆ ఆల్బమ్‌లో "డయానా'' అనే గీతం కూడా ఉంది. అది ఎంత సంచలనం సృష్టించిందంటే - "ప్రిన్సెస్ డయానా హృదయాన్ని దోచుకున్న ఆడమ్స్'' అన్ని పత్రికలూ ఫ్రంట్ పేజీల్లో హెడ్డింగులు పెట్టి మరీ రాశాయి. 'టియర్స్ ఆర్ నాట్ ఎనఫ్' అన్న ఆల్బమ్‌కి ఎంతో ప్రత్యేకత ఉంది. ఇథియోపియా సహాయార్థం ఆడమ్స్ రూపొందించిన ఆ ఆల్బమ్ అమ్మకాల ద్వారా వచ్చిన సొమ్మును ఆ దేశానికి పంపారు.

'సమ్మర్ ఆఫ్ 69' 'ఇట్స్ ఓన్లీ లవ్', 'అన్‌టుది ఫైర్' చిత్రానికి ఆడమ్స్ పాడిన గీతం 'ఎవ్విరి థింగ్ ఐ డు, ఐ డు ఇట్ ఫర్ యు' ప్రపంచం మొత్తాన్ని ఊపేసింది. "కాంట్ స్టాప్ దిస్ థింగ్ వుయ్ స్టార్టెడ్, థాట్ ఐ హ్యాడ్ డైడ్ అండ్ గాన్ టు హెవన్'' ఈ రెండూ దేనికదే పోటీగా నిలిచి సూపర్ సక్సెస్ అయ్యాయి.

1993లో "ప్లీజ్ ఫర్గివ్ మి' ప్రత్యర్థుల ఊహకు అందనంత విజయం సాధించింది. ఆ సంవత్సరమే విడుదలైన "ద త్రీ మస్కిటీర్స్'' చిత్రంలోని ఆడమ్స్ గీతం 'ఆల్‌ఫర్ లవ్' మెగా హిట్ అయింది. డాన్ జాన్ డి మార్కో చిత్రంలోని "హ్యావ్ యు ఎవర్ రియల్లీ లవ్డ్ ఎ ఉమన్?'' రాక్ గాయకుడిగా ఆయన సత్తాని చాటింది.



'ఎయిటిన్ టిల్ ఐ డై' అనుకున్నంత విజయం సాధించకపోయినా దాని తర్వాత వచ్చిన "ఆన్ ఎ డే లైక్ టుడే", 'వెన్ యు ఆర్ గాన్' ఆల్బమ్ మాత్రం ఆయనకు ఆయనే సాటి అని నిరూపించాయి. అయితే 'ఎయిటీన్ టిల్ ఐ డై' అంటే బ్రియాన్‌కి ఎంతో ఇష్టం. అవును.... ఆయన స్వరానికి, ఆ సంగీతానికి ఇంకా పద్దెనిమిదేళ్లే'! ఎన్ని దశాబ్దాలైనా, ఎన్ని శతాబ్దాలైనా ఆయన పాటలోనూ మాటలోనూ ఆ నవయవ్వనం తొణికిసలాడుతూనే ఉంటుంది.

-సి. హెచ్. లక్ష్మి.

న్యూస్ వ్యూస్

## రాయల్ మ్యూజిక్



ఆర్యాట్ ప్రిన్స్ మహమద్ అబ్దుల్ ఆలీ కుమారుడు మహమద్ అసిఫ్ అలీ పాప్ సంగీతం వైపు మళ్లారు. రాబోయే లక్కీ అలీ ఆల్బమ్‌కు సంగీతం సమకూరుస్తున్నది ఈ 29 ఏళ్ల యువ రాజే! అంతేకాదు లక్కీ ఆలీతో కలిసి దేవ్‌ఆనంద్ కొత్త చిత్రం 'లవ్ ఇన్ టైమ్స్ స్క్వేర్' కి సంగీతాన్ని అందిస్తున్నారు.

## పాటల రచయితగా నౌషద్



దర్శక నిర్మాత అక్బర్‌ఖాన్‌కు ఒక అమోఘమైన ఐడియా వచ్చింది. అతడి కొత్త సినిమా 'తాజ్‌మహల్' ఒక కొత్త ప్రయోగం జరగబోతుంది. ఆ సినిమాలో సంగీతానికి లిరిక్స్ సమకూర్చేది ప్రఖ్యాత సంగీత దర్శకుడు నౌషద్! ఆ సంగీతం అందించేది యానీ. తాజ్‌మహల్ ముందు 1997లో సంగీత కార్యక్రమాన్ని నిర్వహించిన ఈ గ్రీకు సంగీత దర్శకుడు 'యానీ'కి తాజ్‌మహల్‌తో బంధం ఇప్పట్లో తెగేట్టు లేదు!

## లిఫ్ట్ ఇవ్వని అద్నన్‌శామీ



పాప్‌గాయకుడు అద్నన్‌శామిపై మధ్యప్రదేశ్ పోలీసులు కేసు పెట్టారు. ఇండోర్‌లోని గీతాభవన్ ట్రస్టు ఆధ్వర్యంలో ఏప్రిల్‌లో జరిగిన ఓ 'గార్మెంట్ ఫెయిర్‌'లో పాల్గొంటానని అడ్వాన్సు తీసుకుని గైరు హాజరయ్యాడని అద్నన్‌పై అభియోగం. మేగ్నా సౌండ్ ద్వారా అద్నాన్‌కి రూ. 2.45 లక్షలు డ్రాఫ్టు ద్వారా, రూ. 7.45 లక్షలు రొక్కంగా ఇచ్చామని ఆర్గనైజర్స్ అంటున్నారు. మేగ్నాసౌండ్ వారు మాకేం తెలియదని అంటూనే అద్నాన్‌కి పూర్తి డబ్బు ముట్టి ఉండక పోవచ్చునని, అందుచేతనే రాలేదని అంటున్నారు.

## భయపడిన జిమ్ క్యారీ



న్యూయార్కు బాధితుల సహాయార్థం అక్టోబరు 27న ఏర్పాటు చేసిక కార్యక్రమంలో జిమ్ క్యారీ పాల్గొన్నాడు. బీటిల్ గాయకుడు పాల్ మెక్ కార్టీ నిర్వాహకుడిగా ఉన్న ఈ ప్రోగ్రాంలో జిమ్ క్యారీని స్టేజ్‌పై వినూత్నంగా ప్రవేశ పెడదామనుకున్నారు. ఒక అగ్నిమాపక దళ సభ్యుడు క్యారీని కారీ చేస్తూ తీసుకువచ్చేట్లు ప్లాన్ చేసారు.

కానీ ఆఖరి నిముషంలో క్యారీకి భయం వేసింది. ఈ ఫైర్‌ఫైటర్ తనను మోయగలడాని. "నా బరువు 190 పౌండ్లు, (87 కిలోలు) మోయగలవా..? కింద పడేస్తావా?" అని అడిగేడు. 'నీకేం భయం లేదని అతను హామీ ఇచ్చినా క్యారీకి భయం వేసింది. మెక్ కార్టీ దగ్గరకి వెళ్లి 'వాడు తాగి ఉన్నట్టుగా ఉన్నాడు. నాకు భయంగా వుంది. మామూలుగానే వచ్చేస్తా'! అని బతిమాలుకుని ఏ హంగామా లేకుండా స్టేజి ఎక్కేసాడు.

## ఉవాచ

"కాలేజీ విద్యార్థులు ఫోక్ సాంగ్స్ పాడినట్టు చిత్రీకరించడంలో అసహజం ఏమీ లేదు. సంగీత పరికరాలతో అవసరం లేకుండా ఓ రిథమ్‌తో పాడుకునే సౌకర్యం వీటిలో ఉంది. మేం యూని వర్శిటిలో చదువుకునే రోజుల్లో ఎక్కువగా ఇలాంటి పాటలే పాడుకునే వాళ్లం"

-ఆర్.పి.పట్నాయక్, 'నువ్వు-నేను', 'మనసంతా నువ్వే' చిత్రాల సంగీతదర్శకుడు

"పాట ప్రసవం లాటిదే. ఒక్కోసారి అద్భుతమైన సందర్భం కోసం, మేధోమథనం జరిగి నాచురల్ డెలివరీకి అవకాశం వచ్చి మంచిపాట పుడుతుంది. కొన్నిసార్లు సందర్భమూ, ట్యూన్... ఏదీ కుదరక సిజేరియన్ డెలివరీ జరిగి వికృత శిశువుకి జన్మనివాల్సి వస్తుంది".

-కులశేఖర్, గేయ రచయిత

"నవంబరు 22, 1999న నాకు కారు ఏక్సిడెంటు అయి అపస్మారక స్థితికి చేరుకుని దేవుడి దయ వల్ల బతికి బయట పడ్డాను. అదే పునర్జన్మ. తర్వాతే నాకు నిజమైన కెరియర్ మొదలైందేమో! 'నువ్వు - నేను'లో లెక్చరర్ పాత్ర హిట్ కావడంతో క్రౌడ్ పుల్లింగ్ ఆర్టిస్టుని కాగలనన్న ఆశ కలుగుతోంది".

-ధర్మవరపు సుబ్రహ్మణ్యం, హాస్యనటుడు

"ఏ నిర్వచనానికి అందని పాట యూత్ పాట. ఎందుకంటే, ఇందులో ప్రేమ గురించి నాలుగు ముక్కలు, ఎంజాయ్‌మెంటు గురించి నాలుగు ముక్కలు, పక్కింటి అమ్మాయి గురించి, ఎదురింటి ఆంటీ గురించి నాలుగు ముక్కలు ఎవరికీ అర్థం కాని భావ కవిత్వం కొంత!"

-భువనచంద్ర, గేయరచయిత

# న్యూస్ వ్యూస్

# తబలా డ్రమ్ములో టీ తుపాను

టీ, కాఫీ, సిగరెట్ - ఏదైనా కానీయండి. అమ్మడానికి సినిమా తారలను, ప్రఖ్యాత వ్యక్తులను ప్రకటనలలో ఉపయోగించుకోవడం అనాదిగా వస్తున్న సాంప్రదాయమే. 'ఫలానా సబ్బే నా సౌందర్య రహస్యం' అని ప్రకటన ఇచ్చి కొంప ముంచుకున్న సినిమా తారల ఉదంతాలు లేవు గానీ కానీ తబలా విద్వాంసుడు జాకీర్ హుస్సేన్ మాత్రం తాజ్‌మహల్ టీ ప్రకటన విషయంలో వివాదంలో ఇరుకున్నాడు. కారణం తన గురించి అబద్ధపు వార్తలు రాయడానికి సమ్మతించడం. టీ క్వాలిటీకి తమ తబలా మనేయడానికి ముడిపెడుతూ ప్రకటన ఇవ్వడం.

కొద్దిరోజుల క్రితం జాకీర్‌హుస్సేన్ రిటైర్ అయిపోతున్నారన్న వార్తలు రాయించారు తాజ్‌మహల్ టీ తయారు చేసే హిందుస్తాన్ లివర్ కంపెనీ వారు. వేళ్ళు నొప్పి పుడుతూండడమే దానికి కారణం అనుకుంటున్నారని కూడా ఆ వార్తల్లో వచ్చింది. అది అడ్వర్టయిజ్‌మెంట్‌గా కాక మామూలు వార్తలా రావడంతో జాకీర్ అభిమానులు తల్లడిల్లారు. అయ్యో పాపం అనుకున్నారు.

అంతలోనే వచ్చిపడింది అడ్వర్టయిజ్‌మెంట్. 'జాకీర్ హుస్సేన్. తబలా వాయించడం మానేస్తున్నారా?' అని వార్తలు పడ్డ పత్రికలు



కనబడతాయి. ఎవరో అడుగుతారు. 'మీరు నిజంగా మానేస్తున్నారా?' అని 'తాజ్‌మహల్ టీ కంటె మంచి టీ ఏదైనా ఉందని నిరూపిస్తే తాము తబలా వాయించడం మానేస్తానని జాకీర్ హుస్సేన్ ఛాలెంజ్ చేస్తాడు'.

దీనితో ఇంతకుముందు వచ్చిన వార్తలు పబ్లిసిటీ స్టంట్ అని నిర్ధారణ అయిపోయింది. ఇటువంటి అసంబద్ధమైన జిమ్మిక్‌లో జాకీర్‌హుస్సేన్ తన పేరును ఉపయోగించుకోనివ్వడం కళాభిమానులను నివ్వెరపరిచింది. అడ్వర్టయిజ్ మెంట్ రంగం తాలూకు మర్యాదలను ఇది అతిక్రమిస్తోంది అని ఆరోపించారు వ్యాపారసంఘం వాళ్ళు. 'తాజ్‌మహల్ టీ అంత గొప్పదేం కాదు. దాని కంటె మేము మేలిరకమైన టీ అమ్ముతున్నాం. డబ్బిచ్చి హిందూస్తాన్ లివర్ వారు జాకీర్‌హుస్సేన్‌చే అలా ఛాలెంజ్ చేయించడం తప్పు' అని గుజరాత్, మహారాష్ట్రలలో పాప్యులర్ బ్రాండ్‌లు అమ్మే 8 మంది ట్రేడర్స్ ఆలిండియా టీ ట్రేడర్స్ అసోసియేషన్స్ ఛైర్మన్ శ్రీ పి.ఓ.దేశాయ్‌కు ఫిర్యాదు పంపారు. నాణ్యమైన టీని ఉత్పత్తి చేసే మార్కెట్‌లోని చిన్న కంపెనీలకు ఈ ప్రకటన వల్ల నష్టం జరిగే ప్రమాదం ఉందని భావించిన దేశాయ్ ఆ మేరకు హిందుస్తాన్ లివర్ వారికొక ఉత్తరం రాస్తున్నారు.

అడ్వర్‌టైజింగ్ స్టాండర్డ్స్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా అనే సంస్థ వాణిజ్య ప్రకటనలలో ప్రమాణాలు పాటించేట్లు చూస్తుంది. జాకీర్ హుస్సేన్ తన వ్యక్తిగత ప్రతిష్ఠను పణంగా పెట్టి తాజ్‌మహల్ టీ అమ్మ చూపడం వారి అభిశంసనకు గురవుతుందని అందరూ భావిస్తున్నా ఆ 8 కంపెనీలు కానీ, ఐటా గానీ ఇప్పటివరకు ఆ సంస్థకు ఫిర్యాదు చేయలేదు. హిందుస్తాన్ లివర్ అవలంబించిన స్ట్రేటజీ మాట ఎలా వున్నా, ఇకపై ఎవరైనా కళాకారుడు 'నేను రిటైర్ అవుతున్నాను' అని ప్రకటిస్తే 'ఓహో అంటే ఏదో పెద్ద అడ్వర్టయిజ్‌మెంట్ బేరం తగిలిందన్నమాట' అని ప్రజలు సందేహించే రోజు వచ్చేసింది.

## టెర్రరిస్టు బాధితులకు మైకేల్ జాక్సన్ చేయూత



సెప్టెంబరు 11న జరిగిన టెర్రరిస్టు దాడుల వల్ల వలురకాలుగా నష్టపోయిన అమెరికన్ పౌరుల సహాయార్థం మైకేల్ జాక్సన్ గళం విప్పుతున్నారు. గతంలో ఆఫ్రికాలో కరువు బాధితుల కోసం "వి ఆర్ ది వరల్డ్" పాట పాడి ఆరున్నర కోట్ల డాలర్ల నిధి సమకూర్చిన మైకేల్ జాక్సన్ ఈసారి "వాట్ మోర్ కెన్ వి డూ?" అనే పాట పాడబోతున్నారు. ఈ ప్రయత్నంలో ఆయనతో చాలామంది అమెరికన్ సూపర్‌స్టార్లు గొంతు కలప బోతున్నారు. రిక్కీ మార్టిన్, మేరియా క్యారీ, కార్లోస్ సంతానా, సెలీన్ డియాన్, జూలియా ఇగ్లెసిస్, గ్లోరియా ఈస్ట్‌ఫాన్ వీరందరూ ఈ సరికే జాక్సన్‌తో కలిసి పాటలు పాడడం జరిగిపోయింది. "అమాయక బాధితుల సహాయార్థం మా సంగీత కుటుంబ సభ్యులందరం ఒక్కచోట చేరుతున్నాం" అన్నాడు జాక్సన్.

## ఫిలిప్స్ విసిడి మిని హైఫీ FW V720



ఫిలిప్స్ వారు తమ $MP_3$ కంపాటిబుల్ రేంజ్‌లో మరొక కొత్త ఉత్పాదనను చేర్చారు. VCD Mini Hi-Fi FW V720 $MP_3$ సిస్టమ్ పేర మార్కెట్లోకి ప్రవేశించిన ఈ సిస్టమ్‌లో ప్రత్యేకత - ఫిలిప్స్‌కే స్వంతమైన 'w OOx' టెక్నాలజీ! డ్యూయల్ సస్పెన్షన్ రేడియేటర్ విధానంపై పనిచేసే ఈ టెక్నాలజీ వల్ల 'బాస్' రిజల్ట్సు మెరుగ్గా వుంటాయి. చాలా తక్కువ ఫ్రీక్వెన్సీలలో హై డైనమిక్ సౌండ్ సిగ్నల్స్ ఈయగలుగుతుంది. మానవ శ్రవణేంద్రియం ఒకస్థాయి శబ్దాలను మాత్రమే వినగలుగుతుంది. ఆ లెవల్‌కి తక్కువ వున్నా, ఎక్కువ వున్నా వినబడదు. 50 Hz ఫ్రీక్వెన్సీ శబ్దాలను మనం వినలేం. ఈ 'w OOx' టెక్నాలజీ ఆ ఫ్రీక్వెన్సీ శబ్దాలను ఏమాత్రం చెదరనీయకుండా మనం వినగల స్థాయికి ఏంప్లిఫై చేయగలుగుతుంది. దీని ధర ఎం.ఆర్.పి. 24,990 రూ॥లు, డీలర్ ధర 23,490 రూ॥లు. గ్రేట్‌మాల్ ఆఫ్ హైదరాబాద్‌లో తిరుమల మ్యూజిక్ సెంటర్ వారి స్టాల్‌లో 22,700 రూ॥లు.

'హాసం

**రాజబాబు 66వ జయంతిని పురస్కరించుకుని**
**27 అక్టోబరు 2001న కళారాధన సాంస్కృతిక సంస్థ**
**నిర్వహించిన కార్యక్రమానికి హాజరైన ఈనాటి హాస్య కుటుంబ సభ్యులలో...**



రమణమూర్తి, బాబి(రాజబాబు సోదరుడు), కె.కె.శర్మ, ఏవీఎస్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, బ్రహ్మానందం, సత్తిబాబు,
రమాప్రభ, బాబూమోహన్, పేకేటి శివరాం, కల్పనారాయ్, జూ.వేణు మాధవ్, గుండు హనుమంతరావు, కృష్ణవేణి

